

సాహిత్యా
మాస పత్రిక

జూన్ 1984

# భారతి

కొత్త సీరియల్ నవల

## నల్లమబ్బుకో వెండి అంచు

రచన: శ్రీ ఘుండికోట బ్రహ్మాజీరావు

వ్యవస్థాపకులు

# భారతి

మాసపత్రిక

❧

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

❧

జూన్ 1984

సంపుటము : 61 సంచిక : 6

---

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# వి ష యా ను క్ర మ ణి క

## జూన్ 1984



ముఖచిత్రం :

మ హా మ ం డ ప కు డ్య స్త ం భ ము లు

ఫోటో పంపినవారు : శ్రీ ఇ. కార్తికేయశర్మ



# "ఉరుమునై - మెరుపునై"

## "ఆంధ్రి"

PRESENTED BY
Prof. KORLAPATI SRIRAMAMURTHY, D.Litt.

వస్తాను మిత్రమా ! మళ్లీ వస్తాను !

అందమైన రాత్రుల్లో ఆకాశం వాకిట్లో చెమ్మచెక్కలాడుకునే బాలతారల ముఖంమీద వెలుగులా వస్తాను ! మంచుసోనల్లో తల తడుపుకొని కేరింతలు కొట్టే గులాబీపాపనై వస్తాను ! అప్పటికి - నీ మధురోహల చేమంతులు ఎదల మడుల్లో విరుస్తాయ్ ! నీ హృదయ కేదారంలోని శాంతివనం, నందనమై - చైత్రశ్రీస్యందనమై పూచివుంటుంది ! కాయలుకాచిన నీ అరచేతుల రేఖల రహదారులలో సౌభాగ్యం తప్పటడుగులు వేస్తూ ఉంటుంది ! నీ స్వేద బిందుల్ని తాగిన పుడమి, పావన జనయిత్రీలాలన గీతుల్ని ఆలాపిస్తూ వుంటుంది ! అక్షరమై - వికస్వరమై - ప్రత్యక్షమై - మలయపవన తరంగమై వస్తాను నేస్తం !! దీక్షాతృప్తి ఆనందం - కల గలిపికొని నువు నవులుతున్న శ్రమజీవనైకఫల తాంబూల రుచుల్ని చూడ్డానికి వస్తాను ! ఒహ్ ! నీ నోరు ఎలా పండుతుందో !! వసంతంలో కోకిల్లా - ఏకాంతంలోని ప్రణవంలా - దివ్యంగా, నవ్యంగా సకల జగన్మోహనంగా, బాహాటంగా వస్తాను ! కడలినై సంబరాల నురుగల్లు కక్కుకుంటూ వచ్చి, గ్రీష్మాతప విదారిత భూఖండంలా బీటలు తీసిన నీ ఆశల పాదాల్ని తడుపుతాను మెల్లగా - చల్లగా !! అలనై - నిజమైన కలనై; ఉరుమునై - మెరుపునై; చినుకునై - చంద్రికనై; తెలిమంచునై - తొలి కిరణాన్నై; వస్తాను ! మిత్రమా ! మళ్లీ వస్తాను !!

ఇప్పుడుమాత్రం ఒక్కనిముషంకూడా ఇక్కడ ఉండలేను ! క్షమించు !!

---

# గాలికి కూడానా పక్షపాతం?

మేడ పై అంతస్తులో
పందిరి మంచం వాల్చుకున్న కుబేరునికేమో
చల్లందనాలు ప్రసరిస్తూ
చందనాన్ని మెత్తగా మేనికి రాస్తూ
కన్న తల్లిలా జోలపాడి
కళ్లకి నిద్దుర కాటుక దిద్దుతోంది.
ఆ మేడ మరుగుదొడ్డి నీడలో
తల దాచుకున్న దరిద్రనారాయణునికేమో
దుర్గంధపు సెగలు ఉమ్ముస్తూ
కళ్ల నింగిలో ఎగిరే నిద్ర బెలూన్లని టప్‌ని పేలుస్తూంది.
— గాలికి కూడానా పక్షపాతం !?

# ఎలా నడిపించుకుపోవడం?

ఈ దారి పొడవునా
ముళ్లు రాళ్లు, బురదగుంటలూ....
నువ్వు రాలేవు
నాతో నడవలేవు
అంటే విన్నావా ?
„ప్లీజ్— వొస్తాను
అనుమతించండి
ఆసరాగా చేయి యివ్వండి"
మొండిగా నాతో వొచ్చావు
బురదకుంటలో దిగబడిపోయావు
యిప్పుడు నిన్నెలా రక్షించడం ?
నాతో ఎలా నడిపించుకుపోవడం ?

శ్రీ జెట్టిగుండ్ల రఘునాథరెడ్డి



శ్రీ పొట్లపల్లి సీతారామారావు

# మహాప్రస్థానము - ప్రతిభా వైభవము

"యదున్మీలన శక్త్యైవ విశ్వమున్మీల తిక్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతామ్, తాం, వందే, ప్రతిభామ్, శివామ్"

అని అభినవగుప్తులవారి అభిభాషణం మానవుని మేధాశక్తులలో ఈ ప్రతిభాశక్తి యొకటి ఇది విలక్షణమైన శక్తి. ఈ శక్తి వుంటేనే రచయితకు కవి యనిపించుకోవటానికి అర్హత వస్తుంది. అన్నిటివలెనే దీనిలోనూ తరతమ భేదములుంటాయి. దానినలా ఉంచుదాం. పూర్వ ఛందోమార్గాన్ని అనుసరించినంతమాత్రాన్నిగానీ, సమాస నిర్మాణంలో, చిక్కగా, పాండిత్యాన్ని గుంఫించినంత మాత్రముచేతగానీ, వచన గేయాలు వ్రాసినంత మాత్రంచేతగానీ, ఎవ్వరు కవిగా చలామణిగారు. ప్రతిభాముద్ర కొట్టే లక్షణం వుంటేనే కవిశబ్ద వాచ్యుడౌతాడు. అపూర్వ వస్తు నిర్మాణ దక్షుడౌతాడు. నవనవోన్మేష ప్రజ్ఞాపాటవంతో రచనకు నవత్వం సమకూర్చి సర్వం ఆనందమయంగా చేయగలుగుతాడు. ఇలాంటి ప్రతిభాముద్ర నిర్వహణా కౌశల్యం సాధించిన ఆధునిక కవి కీ. శే. శ్రీరంగం శ్రీనివాసరావుగారు. (శ్రీ శ్రీ)

"గగనమంతా నిండి పొగలాగు క్రమ్మి
బహుళ పంచమి జోత్స్న భయపెట్టు నన్ను

• • •

విశ్వమంతా నిండి వెలిబూది వోలె
బహుళ పంచమి జోత్స్న భయపెట్టు నన్ను

• • •

గాలిలో కనరాని గడుసు దయ్యాలు
భూ దివమ్ముల మధ్య యీదుతున్నాయి.

• • •

కరి కళేబరములా కదలదు కొండ

• • •

ఆకాశపు ఎడారిలో కాళ్ళుతెగిన
ఒంటరి ఒంటె లాగుంది జాబిల్లి"

ఇక్కడ, కవికి భయహేతువైన వస్తువు బహుళ పంచమినాటి సన్నని తెల్లని వెన్నెల. ఈ భయాన్ని పోషించే ఉపమానాలు కరి కళేబరము- కాళ్ళుతెగిన ఒంటె - పొగ - వెలిబూది లాంటి సామగ్రి - అంతర్లీనముగా నున్న గడుసుదెయ్యాలు కుదిపి కుదిపి కవిని మరీ భయకంపితుణ్ణి చేస్తున్నాయి లోకమంతా భయంకర వంచన స్థావరంగా తోచి ప్రళయాన్ని సూచిస్తున్నది అని చెప్పవచ్చు లేదా ఈ కవి బహుళ పంచమ జోత్స్ననాడు చూచిన సన్నివేశంలోని తీవ్రత ఇందులో గోచరిస్తుందని చెప్పవచ్చు. లేదా సమాజములో ఎకుడుదిగుడుగా ప్రసరించే ఒక పరిదీన లక్షణం కనిపిస్తుందనవచ్చు — ఇదంతా వ్యంజనా సామగ్రివలన ధ్వనన వ్యాపారమునుండి మనకు తెలియకుండా జరిగే ఒక అనుభూతి విశేషమే. వివిధర్థ గతిస్ఫురణలు కలగటం కావ్యలక్షణాలలోని ఒక పరమ లక్షణం.

మీమాంసకులు అభిదా లక్షణా తాత్పర్యశక్తులనే అంగీకరిస్తారు వ్యంజనాశక్తిని వొప్పుకోరు. మీమాంసకుల దృష్ట్యా ఒక్క అభిధశక్తియే సందర్భాన్నిబట్టి - వ్యక్తిగత విశేషాల్ని బట్టి - అర్థాంతరాల స్ఫురింపజేస్తుంది. "స యిషోరివ దీర్ఘ దీర్ఘతరో వ్యాపార॰' అభిధ వ్యాపారం తర్వాతనే వ్యంజనా వ్యాపారం జరుగుతుంది అ ధ్వనివేత్తలంటారు "ప్రొద్దుక్రుంకుతున్నది" - అని అభిసారి అంటే ఒక అర్థం స్ఫురిస్తుంది. విద్యార్థి అంటే మరొక అర్థ స్ఫురిస్తుంది. కార్మికుడు అంటే వేరొక అర్థం స్ఫురిస్తుంది. ఉద్యో అంటే యింకో అర్థం స్ఫురిస్తుంది. ఇదంతా అభిధ వ్యాపారవ లోనిదేననీ, అక్కడ ఆయా సందర్భ వ్యక్తిగత విశేషాలు అర్థాల స్ఫురింపజేస్తవని మీమాంసకులంటారు ధ్వనివాదులు వ్యంజనాశ భిన్నమైనదని వ్యక్తిగత విశేష సందర్భ అపేక్ష వ్యంజనాశక్తి వుండదని చెబుతారు.

ఇక్కడ కవి, వక్త సందర్భం మనకు తెలియదు. రచన అనేకానేక స్ఫురణలు గోచరిస్తున్నాయి. మనకున్న అర్హతా నర్హతల బట్టి - పాండిత్య ప్రమాణ స్థాయిలను బట్టి వానికి అర్థాలు చె కుంటున్నాము. సహృదయతాదృష్ట్యా యీ అర్థాలన్నీ కవి ప్ర పరిపాలనా ఫలప్రాయాలే.

ఈ ప్రతిభాశక్తి విలక్షణమైనది. ఒక్కొక్కసారి ఉక్తివైచి రూపంగా - ఒకసారి వ్యంగ్యరూపంగా - మరొకసారి గ్రథన కౌశలం

– అనేకభూమికలు ధరించి మనస్సులను ఆకట్టుకుంటుంది. వట్టి వ్యవహారాన్ని నిర్వహించే రచనతో దీనికి ప్రమేయం ఉండదు శ్రీ శ్రీ ఎడ్గార్‌పో చేతప్రభావితుడైనా – సిన్‌బర్న్ చేతప్రభావితుడైనా – మరే యితర కవి చేత ప్రభావితుడైనా మూలద్రవ్యమైన ప్రతిభాశక్తిచేతనే కవిగా మిగులుతున్నాడు ఏకవినైనాగాని మన అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాడనిగానీ – మనం అంటిపెట్టుకొని తిరిగే రాజకీయబాణీలో సన్నిహితంగా వున్నాడనిగానీ – మనకు అతి సన్నిహిత రక్తబంధువనిగాని – ఆకాశానికి ఎత్తితే లోకాన్ని ప్రతారించడమే అవుతుంది ఆకవిలోని కవితాశక్తిని మాత్రమే ప్రశంసించి తరతమ భేదాలుగా తనకు తోచిన భావాన్నిమాత్రమే వివరించటం సద్విమర్శకునికి ధ్యేయంకావాలి వాల్మీకిలో విశిష్టాద్వైతం వుందనిగాని వ్యాసుడిలో అద్వైత సిద్ధాంతం పరాకష్ట పొందినదనిగాని – నైషధంలో ఆధునిక విద్యుచ్ఛక్తి గోచరిస్తుందనిగానీ – శ్రీ శ్రీలో మార్క్స్ ఏంజిల్స్ ప్రభావం వుందనిగాని వివరించటం కావ్యవిమర్శ అనిపించుకోదు జాబితాలూ – అభిప్రాయ సంపుటాలూ – కాలానుక్రమణికలూ – వట్టి సాంఘిక సామాజిక పరిస్థితుల పట్టీలు – వ్రాయటంలో సమర్థులైన శ్రామికులైన పరిశోధకులకు కొంత బోగట్టా అందించడానికి పనికిరావచ్చునేగానీ భావుకత్వాన్ని పంచేలక్షణం యీబాపతు రచనలలో వుంటుందని నేననుకోను.

అవును నిజం అవును నిజం
నీవన్నది నిజం నిజం

• •

బ్రతుకు వృథా చదువు వృథా
కవిత వృథా వృథా వృథా

• •

వెనుక దగా ముందు దగా
కుడి ఎడమల దగా దగా

• •

మనదీ వొక బ్రతుకేనా
సందులలో పందులవలె

• •

నిజంసుమా నిజంసుమా
నీవన్నది నిజంసుమీ.

• •

చేదు విషం జీవ ఫలం
జీవఫలం చేదు విషం
నీవన్నది నీవన్నది
నీవన్నది నిజం నిజం"

జీవితం పట్ల ఆంతర్ముఖంగా ప్రసరించే నిరీహ అహంకార ప్రసమనత్వం – వైరాగ్యభావం – ఇందులో ప్రధానమైన ధ్వని శ్రీ శ్రీ కావ్యానికి జీవ ప్రియమైనది ధ్వని. ఈ ధ్వని వైభవమే ఈ కావ్యాన్ని తారా పథానికి ఎత్తి చూపిస్తుంది. మార్క్సిజం వుందన్న పెట్టుబడిదారీ వ్యవస్థలో కలిగి నలిగి శిథిలమైన బానిస జీవితం కన్పిస్తుందన్న – ఆర్షమతంలోని పరమ సారం గోచరిస్తుందన్న – అవి పాఠకుని వైయ్యక్తిక మనస్తత్వాన్ని పురస్కరించుకొని ప్రభావితములైన అభిప్రాయ విశేషాలు మాత్రమే అవుతాయి కాని కావ్యజీవితములోని ఆయువుపట్టులను వివరించడం కాదు. కావ్యం యెటు చూస్తే అటు కనిపించాలి అది రచనాశిల్పరహస్యం శిల్పిమూర్తిని చిత్రించినపుడు ఆ మూర్తి దృష్టి మనం ఏ కోణం నుండి చూచిన అ కోణం వైపు ప్రసరిస్తుంటుంది. రచనాశిల్పం కూడ అలాంటిదే కావ్య విమర్శకుడు చూడవలసింది కావ్యంలో ఏం చెప్పాడు అన్నదానికంటే ఎలా చెప్పాడు అనేదే ఈ కావ్యమింత జీవఫల చేదువిషం అనే మూలాభూతమైన సంప్రదాయబద్ధమైన సందేశాన్ని ధ్వనిస్తుంది.

రచనసుయావత్తూ యిలా మూలభూతములైన ధర్మరహస్యాలను ధ్వనింపజేస్తేనే ఆ కావ్యం పదికాలాలపాటు నిలుస్తుంది. లోక కళ్యాణప్రదం అవుతుంది ప్రజా సమూహములోని సంస్కార లక్షణాన్ని జాగృతం చేస్తుంది కాలం అనంతం. అది మారుతున్నకొద్దీ అనేక సంస్కరణలు పుడుతుంటాయి. గిడుతుంటాయి కూడ సృష్ట్యాది నుండి ఎన్ని సిద్ధాంతాలు పుట్టి ఎన్ని మతాలు పుట్టి రూపులేకుండా పోలేదు వాటికనుగుణంగా ఎందరు కవులు గొంతు విప్పిపాడలేదు. వీరశైవ కవులు పట్టపగ్గాలు లేకుండ సామాన్య ప్రజల కందుబాటులో కవిత్వాలు వ్రాసి ఆనాడు పొందిన ప్రతిష్ఠలో ఈనాడు ఎన్నోవంతు మిగుల్చుకున్నారు శ్రీ పునర్వివాహ నిర్వహణ శీలుడు – గొప్ప సంఘసంస్కర్త – కవి– అనిపించుకున్నవారు కందుకూరి వీరేశలింగం పంతులు గారు ఈనాడు కవిగా ఆయనకు ఎంతస్థానంవుంది. వాల్మీకి వ్యాస కాళిదాస నన్నయ తిక్కన వగైరాలు అనంతకాలంలో కవులుగా నిలువత్రొక్కుకొన గలగటానికి హేతువేమిటి ? జీవనధర్మాల్ని మూల ధర్మ సారభూత సిద్ధాంతాలను ప్రధాన సందేశాలుగా ధ్వనింపజేస్తూ కావ్యాలు వ్రాయటం వలననే గదా. అనంత ప్రతిభా వైభవంగా కావ్యాలను దిద్దటం – కాలానుగుణంగా అలవడిన తమ వ్యక్తిగతమైన అభిరుచులను ముఖ్యసందేశం దృష్ట్యా అప్రధానం చేయటం వలననేగదా ! త్రికాలా బాధ్యములైన ధర్మాల్ని సందేశంగా ధ్వనింపజేయటం కవికి ప్రధాన లక్ష్యం కావాలి. ప్రతిభా పాటవాన్ని బట్టి పదికాలాలపాటు నిలువద్రొక్కుకునే శక్తి ఆ మాత్రమే కవికి వుంటుంది. మహాప్రస్థానాన్ని నిలిపింది. ఎన్ని ముద్రలు క్రమ్ముకొన్నా మారని నిశ్చలమైన నిర్మలమైన – మూలభూతమైన – ధర్మసందేశధ్వని – వ్యంజనా పరి

ష్యంగంలో ప్రసరించే కంగుమని మారు మ్రోగే శబ్దశక్తి - అడుగడుగునా అలరించే ఉక్తివైచిత్రి - రుడితిస్ఫురణ - ఆలోచించే కొద్దీ పదునెక్కించి పరవశింపజేసే భావనాపటిమ మాత్రమే.

"నడిరాతిరి కడలి వద్ద
హోరుగాలి ఉపశ్రుతిగ
నీలోనే నీవేదో
ఆలపించుతావ్
అవ్యక్త పుటూహలతో
ఆలపించుతావ్
శ్రీనివాసరావ్"

ఇదాంతా వస్తునిర్మాణ విషయంకగా కవిపొందే ఆవేదన - రచనా విన్యాసం కొఱకు కవిలో సుళ్ళు తిరిగే అంతర్మధన - రచన కొఱకు అంతరాంతరాలలో కవిపడే కృత్యాద్యవస్థ అంతర్ముఖంగా కవి పొందే రసానుభూతి దీనిలోని మూగవేదనను వివరిస్తుంది. సంప్రదాయజ్ఞులు కావ్య నిర్మాణ విషయంలో తెలిపిన లక్షణాలనే భంగ్యంతరంగా శ్రీశ్రీ చెప్పినాడు.

ప్రతిభాశక్తికి దేశ కాలావధులు వుండవు. ఏదేశములోనైనా - ఏకాలములోనైనా - ఆభావాలే రూపాలు మార్చుకొని ప్రత్యక్ష మౌతాయి. అలంకారశాస్త్ర దృష్ట్యా ఆధునిక కావ్యాన్ని విమర్శించరాదు అనే పిడి వాదంలో ఎంత సామంజస్యంలేదో ఆధునికమైన విమర్శన దృష్టితో పూర్వ కావ్యాలను చూడరాదనే దానిలోను అంత సామంజస్యము వుండదు.

"నేనొంటరినై నిద్రకు వెలియై
నాగది లోపల చీకటిలో
చీకటి లోపల నాగదిలో
చీకటిలో ఆకటితో"

ప్రతిభగల ప్రతికవి యిలాంటి ఆవేదన పడందే, అహరహమికయా శబ్దవిన్యాసం బైటకుప్పొంగిరాదు కవిలోని అనుభూతి బహిర్గతం కావటానికి పడే తహ ... తహ .... ఆవేదన - ఇందులో వ్యక్త మౌతుంది.

"చూడు చూడు నీడలు

నీడలు పొగ మేడలు

పేద వాళ్ళ వాడలు

పేదవాళ్ళపేరు వినబడటంతోటే కొందరకు నూతన సిద్ధాంత ప్రతిపాదకుల ప్రణాళిక - అని భ్రమకలగటానికి వీలున్నది. మన తాత్త్వికులు - దర్శనికులు - యోగులు చెప్పిన పరమార్థమే యిది. పేద వారి బ్రతుకుల నీడలు లౌకిక వ్యవస్థలో ప్రతిబింబించుట సూచితము. అలౌకిక వ్యవస్థలో వాటికి స్థానములేదు.. కవి లౌకిక దృష్ట్యా దీన్ని వ్రాస్తూ పారమార్థికమైన తత్త్వజిజ్ఞాసకు శృతి కలుపుచున్నాడు. ఈ లోకములో పేదవాళ్ళ వాడలు పొగమేడలు వంటివని నీడలద్వార సూచించుచున్నాడు. దీన్ని స్వకీయ సిద్ధాంతాలకు అభిప్రాయాలకు ఎంద రెందరో మలచి చెప్పుకున్నా యిందులో ప్రధానంగా భాసించేది తత్త్వచింతన - లౌకికా లౌకికవ్యవస్థల తారతమ్యము - దార్శనికర హస్యసంపద. అదే యీ కావ్యానికి ప్రాణభూతం.

"ఇవేమిటి వింత భయాలు ?
ఇంట్లో చీకటి
ఇవేమిటి అపస్వరాలు ?
తెగింది వీణ
ఆవేమిటారంగుల నీడలు
చావుబ్రతుకు
ఎచటికి పోతా వీరాత్రి ?
అవతలి గట్టుకు

ఈకావ్యానికంతా ఆదర్శప్రాయమైన రచనయిది. అవతలిగట్టుకు అన్న మాటలో ఎంత పరమార్థ దృష్టిని ఈ కవి నిక్షేపించాడో చూడండి. ఇంత సంస్కారముద్ర వ్యంగ్యమర్యాదా ముద్రామార్గము తెలిసిన కవి సామాన్యుడెలా అవుతాడు. కావ్యం కావ్యం అంతా ఈ పరమార్థభావం మీదే లక్షితమైవుంది. వ్యక్తి సామర్థ్య యోగము లైన కవిలోని ఆయా శబ్దములను పట్టుకొని వివరించడమే విమర్శలోని పథమలక్షణం.

"సోఽర్థ వ్యక్తి సామర్థ్య యోగీశబ్దశ్చ కశ్చన :
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌశబ్దార్థౌ, మహాకవేః"

ఇదంతా లోలోపల గూఢంగా యిమిడి త్రొక్కిసలాడిన గాఢ వేదాంత భావన. ఒక తత్త్వవేత్తపలె జ్ఞానజ్యోతులు వెదజల్లుతున్నాడు. ఎంత ఆధునిక భావ ప్రపంచాన్ని అవలోడన చేసికొన్న రచయిత అయినా తనలేత వయసులో చదువుకున్న ప్రాచ్యపాండిత్య సంస్కారాలు పైచేయిగా మిగిలి ఈయనను కవిగా పైకెత్తి చూపించినవి - ఒక్కొక్కసారి ఆయన కవిత్వానికి ఒక ప్రత్యేక విలక్షణత్వాన్ని గూడ అవే తెచ్చిపెట్టాయి

"పథస్వరం సంఘర్షించిన
శకములలో చరిత బుధైను"

ఇది దేశచరిత్రలోని గేయము లోనిది. మార్క్సు అభిప్రాయాలకు కొంత ప్రతిబింబ ప్రాయము. పరస్పర సంఘర్షణలలో చరిత్ర పుట్టినదేమో మనకు తెలియదుగాని శ్రీ శ్రీ కవిత్వంలో ప్రాచ్య పాశ్చాత్య భావాల సంఘర్షణ మాత్రం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. మార్క్సు అన్నది కానియ్యండీ మరెవ్వరన్నా అన్నది కానివ్వండీ ఈ భావాలలో సామంజస్యం ఎంతవరకు ఉన్నది ? నిజానికి ఆయన అభిప్రాయాలను మనము విమర్శించకూడదు. ఏకవిన్తైన అంతే. ఇక్కడ కొంత పరిశీలించుదాము. ఒక శిల్పి మూర్తిని మలుస్తాడు- ఒకరాజు సౌధనిర్మాణం చేస్తాడు - ఒక కవి కావ్యాన్ని నిర్మిస్తాడు - ఒక రసజ్ఞుడు పల్లకీలో విహరిస్తాడు. ఇక్కడ మూర్తిని చెక్కే శిల్పి కౌశల్యభావానికి ప్రాధాన్యంగానీ గ్రుడ్డివాడో మూగవాడో సహాయపడిన కాయకష్టానికి కాదు. అలాగే సౌధనిర్మాణంలో అనేక కార్మికుల కాయికశక్తి ఆసరాగానిల్చి కట్టబడిన సౌధనిర్మాత యొక్క ధ్యేయం- నిర్మాణ మార్మికతలోని సూక్ష్మ మేధాసంపత్తి - మాత్రమే ప్రధానంగా భావనీయం. అంతేగాని చెమటవోడ్చి కష్టించినవాని చరిత్ర యిందులో లేదనటం అతివాద ధోరణి. యధాముఖీనంగా వస్తువును చూచే సహనంలేని అపవాదమార్గుల అస్తవ్యస్తపు భావ పరంపర యిట్లే ఉంటుంది. ఈ చిక్కు అంతా ఒకదృష్ట్యా చేయబడిన దానిని మరొక దృష్ట్యా విమర్శించే అలవాటు వలననే కలుగుతుంది. అందుచేతనే కావ్య విమర్శకూడా 'యదభిముఖంగా వ్రాయబడితే తదభిముఖంగా' చూడాలని చెప్పటం జరిగింది. రాళ్ళనెత్తే వాళ్ళనే - పల్లకి మోసే వాళ్ళనే - చరిత్రగా వ్రాస్తే వానికి వెనుకనున్న రసిక - మేధావుల కర్మ ఏమిటని మరొకరు ప్రశ్నింపరా ? ఈ సంఘర్షణమునకు అంత మెక్కడ ? ఇది దేశం అల్లకల్లోలం కావటానికి మార్గంకాని శుభ కళ్యాణదాయకం కాదు.

శ్రీ శ్రీ కాంక్షించేది మేధావివర్గాన్ని నిర్లక్ష్యంచేస్తూ కేవల శ్రమజీవుల భోగట్టా మాత్రమే వివరించవలెననియా ? కొన్ని యితర దేశాల సిద్ధాంతాల అవగాహనం చేసికొని శ్రీ శ్రీ యిలా వ్రాయరాదు. అలౌకికానందాన్ని - ప్రతిభ సౌష్కల్యాన్ని - లక్ష్యంగా పెట్టుకున్న శ్రీ శ్రీ యిలా వ్రాయలేదు. వ్రాయకూడదు కూడ.

మహమ్మదు, గజనీ, ఘోరి, సికిందర్, చెంగిస్కాన్ తామర్లేన్ - చరిత్రలో ప్రసిద్ధికెక్కడమేమిటి ? ప్రసిద్ధికెక్కడమంటే అనబడటమే అభిప్రాయమా ? అలాంటప్పుడు శ్రమజీవులు, దుఃఖ భాజనులు, అశుభము శుభము ఎరుగని అమాయకులైన దీనజనులకు అలాంటి ప్రసిద్ధి రాకుండ ఉండటం మనకు ఆకాంక్షణీయము. ఈ భావాలలో సామంజస్యం లేకపోయినా - యితర సిద్ధాంత ప్రవచనాలకు అనుప్రాయమైనా - అనుకరణ లక్షణం ఉన్నా - తన సహజమైన ప్రతిభ దేవతా విశ్వరూప సాక్షాత్కారము వలననూ - వాక్యం పాటు లోని విచ్ఛిత్తి విశేషం వలననూ - ఉక్తిలోని పలుకుబడి మెఱుపు వలననూ - మాత్ర ఛందస్సులోని మహేంద్రజాలం వలననూ - మనస్సులను ఆకట్టుకొన్నది. పలువురు నోళ్ళలో మెదిగే వాదిగే చిక్కని చక్కని రచన సాగించినాడు శ్రీ శ్రీ. అసలు చరిత్రనుగూర్చి నిర్వచించే గతితార్కిక భౌతికవాద మిదేనా ? అయితే దాని ఆయువు పట్టు శ్రీ శ్రీ గ్రహించి వ్రాసిన రచనయేనా యిది ?

"కనకదుర్గ చండసింహాలు" "యముని మహిషపు లోహ ఘంటలు", "ఉదయ సూర్యుని సప్తహయములు", ఆదిసూకర వేద వేద్యుడు" లాంటి ప్రసిద్ధ భావాలూ పద సమాస బంధాలూ, "లోహ విహంగాలు", "రెక్క విప్పిన రివల్యూషనులూ", "నరకలోకపు జాగిలంబులు", కంటే పైచేయిగా మిగిలి కవి యనుభూతిని పండించి మెరపించాయి. పాఠకుని ఆకట్టుకున్నాయి.

తన వయస్సు పెరిగినకొద్దీ అవీ పెరిగి విశృంఖలంగా విహరించిన సర్‌రియలిజం, సింబాలిజం, డాడాయిజం, మొదలైన పెడమార్గాలు ఎంత ప్రయత్నించినా తన చిన్ననాటి సంస్కారం దృష్ట్యా బలాదూరు అయినవి. ఈయనలో పరవళ్ళుత్రొక్కే కవితావేశానికి ఆ చిన్ననాటి సంస్కారం పోషకప్రదం కూడ అయింది. దేశచరిత్రలు అన్న రచన ఆకర్షణీయంగా ఉండటానికి కారణం మార్క్సు ప్రభావం కాదు. వేరే కారణం వలన. ముఖ్యంగా శక్తి ప్రభావం వలన.

శ్రీ శ్రీ ముఖ్యంగా "పదకవి" కొందరు

"ముదివిటులు విధవలంజలు పదకవితలు మారు బాస బాపన వారల్" అని ఈ కవిత్వాలను ఎంత యీసడించినా వాటి ప్రత్యేకత జనసామాన్యంలో వాటికి వుండుకుంటూనే వచ్చింది. లాలి పాటల జోలపాటలు, దేశింగురాజుకథ, బొబ్బిలికథ. వగైరాలు బహుళ వ్యాప్తంగా దేశంలోస్థానాన్ని సంపాదించుకున్నాయి. ఆ కవులపేర్లు ప్రసిద్ధంగా వినికిడిలోనికి రాలేదు. ఆంగ్లేయుల పరిపాలన వచ్చిన తరువాత ఆ బాణీలనే వొరవడిగా పెట్టుకొనిన ప్రతివ్యక్తి కవియై ప్రకాశించాడు. ఆధునిక భావాలుకొన్ని జోడించి గొప్పగొప్ప కవుల మనిపించు కున్నారు కూడ. ఊరు పేరు లేకుండాపోయిన పూర్వ కవుల బాణీలను మాత్రం ఛందస్సులను ఆధునికులు అనుసరించారు. ఆలోచించిచూస్తే వారి ముందు వీరెంతటి కవులు ? బ్రహ్మంగారి తత్త్వాలు - యడ్ల రామదాసు కీర్తనలు, బొబ్బిలిపాట, బాలనాగమ్మకథ, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణస్వామి మూర్ఛ- వీనికున్న ప్రచారం ఈనాటి రచనలలో ఎన్నిటికి వున్నది. కొన్ని సంగీతపు ముద్రలవలన- కొన్ని ఆకర్షణీయ బాణీలవలన- కొన్ని మాత్రా ఛందస్సులోని మెలకువల

వలన ప్రజలలో బహుళప్రచారం పొందగలిగాయి. బ్రహ్మంగారి తత్త్వాలు మొదలుకొని గొల్ల సుద్దుల వరకు ప్రజల మనస్సులను కొల్లగొట్టి వదలి పెట్టినవి. వారందరూ ప్రతిభావంతులే. ఆధునిక కవుల లక్ష్యాలకు వరవడి దిద్దవలసినవారే. కాని వ్యుత్పన్నత కొంత చాలనివారు. ప్రతిభావ్యుత్పన్నతల సమ్మేళనానికి పూర్వులు గౌరవం ఇచ్చేవారు. అందుకే ఈ రకం కవులు పూర్వులచేత అనాదరితులైనారు. విద్వత్కవులకిచ్చే స్థానం వీళ్ళకు ఇచ్చేవాళ్ళుకాదు. "విద్వత్కవయః కవయః కేవలం కవయస్తు కపయః" అని నిర్లక్ష్యం చేశారు. పూర్వకాలం సహృదయులు పండిత పరిషత్తులకు లోబడిగానీ దుష్టప్రభువుల శాసనాలకు తలఒగ్గిగానీ, పక్షపాత బుద్ధితోగానీ, ఈ బాపతు కవులను వంచించారనటం సహృదయలోకాన్నే కళంకపరచటం అవుతుంది.

ఛందస్సును రెండు విధాలుగా విభజించవచ్చు. మొదటిది వైదిక ఛందస్సును- వేదబుక్కులలోని, మంత్రాలలోని ఛందస్సు కేవలం దేవతాప్రసన్నతా వైభవం కొఱకే ప్రయోజనంగా వ్రాయబడింది. ఇక్కడ దానితో మనకు ప్రమేయం లేదు. రెండవది లౌకికఛందస్సు ఈ ఛందస్సుకూడ గణప్రస్తారం వలన మాత్రా సంయోజనం వలన అనేకదా ప్రస్తరించ బడుతుంది. ఈఛందస్సుకు ప్రయోజనం భావాన్ని సంస్కరించటం- శ్లోకానికో పద్యానికో ఒక గమన గాంభీర్యాన్ని కలిగించటం- తరువాత భావానికి వుద్దీప్తి సాధించటం.

ఇందులో మాత్రా ఛందస్సు పరమ ప్రయోజనం కేవలం వుద్దీప్తి కలిగించటం మాత్రమే. ఇది మనస్సులోనికి చొచ్చుకొనిపోయినంత తీవ్రంగా, సూటిగా, పద్యఛందస్సు చొచ్చుకొని పోదు. దీనిలో ఆ పాత రమణీయమైన సంగీత లక్షణం అప్రయత్నంగా, కొంత అస్ఫుటంగా యిమడ్చబడి వుంటుంది. ఇది అనూచానంగా వస్తున్న రచనా విశేషమే. చిన్నపాడు గ్రామీణ జీవితంలోని పల్లెపదాలవలననో కన్నతల్లిపాడిన లాలి జోలపాటల వలననో తన్నుమకొన్న సంస్కారంలోపల గుడుసుళ్లువారగా, విదేశీయ రచనా సంస్కారాన్ని జోడించటానికి ప్రయత్నించిన కవి శ్రీ శ్రీ.

తెలుగులోని రగడలు- ద్విపదలు- ఆసరాగావచ్చిన పల్లెపదాల పచ్చదనాన్ని ఆ కళించుకొన్నతనం ఈయన రచనలో ఎక్కువగా కన్పిస్తుంది.

"ఆటకూటమ్మలో ఆడేటి నెమలీ
వేట కాడొచ్చాడు ఆటచాలించూ
నారాచపుప్పోల్లు నవ్వేటి వదినా
అన్నగారొచ్చారు నవ్వు చాలించూ"
ఇది పూర్వపు జోలపాటల వరుసలోనిది.

ఆ కాళపుఎడారిలో కాళ్లుతెగిన
ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి
గాలిలో కనరానిగడుసుదయ్యాలు
భూ దివంబులమధ్య యీదు తున్నాయి.
ఇది శ్రీ శ్రీ రచన
"ఏడువకు ఏడువకు వెఱ్ఱినా తండ్రి
ఏడిస్తే నీకళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను"
ఇది పాతకాలపు జోలపాటలోనిది.
"ఊరకో నా తండ్రి ఊరకో తండ్రి

ఇది పాల్కురికి సోమనాధుని రచన. ఇవన్నీ ద్విపదలే. ఇలాంటి పదవాఙ్మయాన్ని ఆసరాగా పెట్టుకొనే తన రచన సాగించాడు శ్రీ శ్రీ. అంతరాంతరాల్లో యిదంతా మన పూర్వుల ఛందో మార్గమనే భావన ఆయనలో గాఢంగా ఉంది. ద్విపదలో ఒకచరణం మాత్రా ఛందస్సులో మలాక్ చరణం గ్రహించి దానికేదో పేరుపెట్టి నూతన ఛంద ప్రవర్తగా తాను చెప్పుకోటానికి శ్రీ శ్రీ ఇష్టపడడు. లోకాన్ని ప్రతారించటం బొత్తిగా సరిపడని ఋజుప్రవర్తన శ్రీ శ్రీ తనజీవితం వట్లనేగాక కవిత్వ విషయంలో గూడ సార్థకపరచుకున్నాడు.

"పాపారాయడి పేరు చెప్పితే
పసిపాపలూ పాలుత్రాగపోరూ
పాపారాయడి యుద్ధరంగడు
పటాలరాముండూ
పటాలరాముడి మొనగాడండీ
ముత్యాల పాపయ్యా
ఈటె ఎందుకూ బల్లెమెందుకూ
విజయరామ రాజా ?
ప్రక్కలోపలే బాకైనారా పాపారాయుణ్ణి

• • •

రామ రామ అనంతకాలమూ రాజ్యమేలుతూనూ
శ్రీరాముడు ఏలినట్లుగా రాజ్యమేలుతూనూ

ఇలా మాత్రలు సరిపోకుండా పోయినా బుజ్జులు వాయిస్తూ వాని దరువులకు హరువుగా సంతరించుకొన్న రచన యిది. వీటికి సంగీత సామగ్రి అవసరం. సంగీత సామగ్రి నపేక్షించకుండ కేవలం శబ్ద

శ క్తితో ఆ లోపాన్ని పూరిస్తూ విలక్షణంగా క్రొత్త పద్ధతిని నడిపించిన కవి శ్రీ శ్రీ. ఈయన రచన అంతా ఆ శక్తితో ధగధగ లాడి పోతుంది. శబ్దశక్తిని ఈ కవి తన రచనకు హంగుగా వాడుకున్నంతగా ఏ కవీ వాడుకోలేదు. ప్రబంధ కవులు కూడ శబ్దశక్తిని తనివిదీర నోరార వుపయోగించుకొన్నవారే. కాని ఈయనవలె విలక్షణంగా వుపయోగించుకొన్నవారు కారు ఏ శబ్దాన్ని ముట్టుకున్న కంగుమని భావాన్ని ప్రమోగిస్తుంది. మూగ భావంతో మోము ముడుచుకొనే శబ్దమే ఈయన వాడాడు. ఈయనలో నిరర్థక పదాలు కూడ భావం ప్రమోగటానికి దోహదకారులుగా గాని - ఉక్తి వైచిత్రికి హంగు దారులుగా గాని - వత్తాసు వస్తవి.

సింధూరం రక్త చందనం
బంధూకం సంధ్యా రాగం

• •

కలకత్తా కాళీ నాలిక
ఝ్రాలిక నయన జ్వాలిక

• •

రగులొక్కనే రాక్షసి బొగ్గు
బుగులుకొనే బుక్కా గుండ

• •

రాబందుల రెక్కల చప్పుడు
పొగ గొట్టపు భూంకార ధ్వని

కావాలోయ్ నవకవనానికి. ఇవన్నీ ముఖ్యార్థ బాధ కల్గిన శబ్ద ప్రయోగాలే. ఇక్కడ లక్షణా శక్తిని ఆశ్రయిస్తేనే అర్థం సరి పోతుంది. అత్యంత తిరస్కృతి వాచ్యధ్వని మార్గంగా హృదయం ప్రవిస్తుంది. ఇవన్నీ శ్రీశ్రీ తెలిసివ్రాశాడా ? లేదా ? అనేప్రశ్నవేరు. ప్రతిభాశక్తి గలవానికి అవన్నీ అప్రయత్న సిద్ధంగా అమరిపోతవి. అదే ప్రతిభలోని విలక్షణత్వం. " యమస్మింలన శక్తై వా విశ్వముస్మింల తిక్షణాత్ " అని కదా చెప్పబడింది. కవి సృష్ట కర్త వంటివాడుకదా-

" అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యదాస్మై రోచతే విశ్వం తదేదం పరివర్తతే "
రవి సంక్రాంత సౌభాగ్యః తుషారావృత మండలః
నిశ్వాసాంధ యివాదర్శః చంద్రమా నప్రకాశతే

ఇది వాల్మీకిరామాయణములోని హేమంత వర్ణనలోని శ్లోకము. ఆనంద వర్ధనుడు యిక్కడ అంధ శబ్దాన్ని తీసికొని అత్యంత తిరస్కృత వాచ్యధ్వనిగా ఉదాహరించినాడు నిశ్వాసముచేత గ్రుడ్డిదైన అద్దంఅంటే అర్థం కుదరక నిశ్వాసంచేత మలినమైన అద్దం - అనే అర్థం లక్షణా శక్తితో నిర్ణయించబడి తరువాత వ్యంజనాశక్తి వలన హేమంతకాల చంద్రునితో ఔపమ్యం స్ఫురిస్తుంది. దుస్సహ నిశ్వాస దోదూయ మానుడైన నాయకుని యొక్క విరహావస్థ యిక్కడ ధ్వనిస్తుంది. సీతావిరహసంతప్తుడు, రాముడు, పొందే పరిదీనస్థితి గమ్యమానం కావటానికి యిది సూచికంగా ఉన్నది.

(ఇంకా వుంది)



# వెన్నెల రాత్రి

శ్రీ పవని. ఆర్. హరినాథ్

ఊరంతా నిశ్శబ్దాన్ని కప్పుకుని నిద్రిస్తోంది.
మేడమెట్ల పై నుండి
సుతారంగా క్రిందికి జారే వాననీళ్ళలా
వెన్నెల జారుతోంది
—నేలపైకి.
పెరట్లోని సంపెంగ మొక్క
ఏ జన్మాంతర కవిత్వ పరిమళాలనో అందిస్తోంది.
విడిది గృహంలో దిగిన పెళ్ళివాళ్ళలా
ఆకాశమంతా నక్షత్రాల సందడితో వున్నా
ఏకాంతంలోని ప్రియురాలి పరిష్వంగంలా
వెన్నెల వేయి చేతులతో కౌగిలించుకుంటుంది.
నన్ను వీణను చేసి నిలువెల్లా మీటుతుంది-
నా సర్వేంద్రియాలలో
స్వాప్నిక సరిత్ లహరుల్ని పొంగిస్తూ !
ఏ రహః ప్రపంచాన్ని ఆవిష్కరించడానికో
చీకటిని తాగి వెన్నెల గీతం పాడుతున్నాడు చంద్రుడు.
—మధువు తాగి గజళ్ళు పాడే గాలిబ్‌లా !
నీవు చూశావో లేదో గానీ
చెట్లకొమ్మల వెనుకనించి జారిపోయే చంద్రుడు
ప్రియురాలి సిగపాయల్లో చిక్కుకున్న
మల్లెపూవులా అనుపిస్తాడు
నీలోని కవిని మేల్కొలుపుతాడు.



డా॥ ఇంగువ కార్తికేయ శర్మ

# విదర్భ నుండి రెండు శివమూర్తులు

వాకాటక రాజ్యవంశము క్రీ. శ. 4 - 6 శతాబ్దిల మధ్య - విదర్భ ప్రాంతముల ఖ్యాతికి వచ్చెను. దక్షిణమున విష్ణుకుండినులు, ఉత్తరమున గుప్త సామ్రాజ్యము వీరికి బంధువంశములై యుండుటచే సుస్థిరమైన రాజ్యమేగాక, శిల్ప వాస్తు కళా సంస్కృతులు మెండుగ వృద్ధి చెందినవి. వైభవోపేతమైన సులక్షణమైన శైలి అటు శిల్పమున, యిటు సాహిత్యమున ( ప్రాకృత - సంస్కృతముల ) ఉద్భవించెను. ఆంధ్రమునకు చేరువగానున్న అజంతా, కన్హేరి, నాసిక్క మొదలగు చోట్ల నున్న బౌద్ధ గుహాలయములు నీ వాకాటక కృతములు. బౌద్ధమేగాక బ్రాహ్మణ మతములైన శైవ - వైష్ణవములు విదర్భ ప్రాంతమున చక్కగా ప్రచారములోనికి వచ్చినవి. ఈ వ్యాసమున అసామాన్యమైన రెండు శివ ప్రతిమల గూర్చి వివరింతును. ఇట్టి మూర్తులు దేశమున మరెక్కడను కానరాలేదు. ఈ శైవమూర్తులు సృష్టించిన వారి లక్ష్యము, తాత్విక భావన, ఆ కాలమునాటి శిల్పాగమరీతుల కొన్నింటిని గూర్చి తెలుసుకొన ప్రయత్నింతుము.

## 1 మానసారలో లభించిన ప్రతిమ (చిత్రములు 1, 2, 3)

మానసార యను గ్రామము నాగపూరు పట్టణమునకు 36 కిలో మీటర్లు యీశాన్యముగా నున్నది. మహాకవి కాళిదాసు వర్ణించిన రామగిరి యాశ్రమమునకు 5 కిలో మీటర్లు పడమరగా నున్నను యీ రెండు ప్రదేశములు ప్రాచీనముగా నొకే క్షేత్రముగా వెలసినవి. వాకాటక కాలమునకు జెందిన జీర్ణాలయములు శిల్ప - శాసనాదులు పెక్కు లీచోట్ల లభించినవి.

ఈ మూర్తి శిల్పము యెఱ్ఱరంగు యిసుకరాయి కృతము. అడవిలో నొక కంట్రాక్టరు త్రవ్వకములు చేయుచుండగా కొన్ని యిటుక కట్టడములు మధ్య రాతి విగ్రహములు కూడ బయల్పడినవి. అట్టివానిలో నీ ప్రతిమ చూడముచ్చటగా నుండుటచే ఆ పనివారు దానిని ఛిద్రము చేయక అప్పట్లో నాగపూరు విశ్వవిద్యాలయ ఆచార్యుడైన డా. శాంతరామ భాలచంద్రదేవ్ గారి దృష్టికి తెచ్చిరి. ఈ విగ్రహమునుగూర్చి వారు కుబేరునిగా తలచి మరాఠీ దినపత్రికలో ప్రచురించిరి. మరొకరు జంభాలునిగా పేర్కొనిరి.



చిత్రము 1

ఈ మూర్తి 84 సెం. మీ. యెత్తు, 76.50 సెం. మీ. వెడల్పు గల్గియున్న రాతి విగ్రహము. ఈ స్వామి నాల్గు బాహువులు గల్గి యున్నాడు. సుఖాసీనుడు. మందహాసమున వీపునానుకొనుటకై 8 పలకల దిండు గలదు. ధరించిన వస్త్రయుగ్మమునుండి ముడుతలు ఆసనముపై కానవచ్చుచున్నవి. స్వరూపము బొద్దుగా మరగుజ్జుగా నుండుటనుబట్టి యక్ష లేక కుబేరునిగా భావింపబడుట వుచితము. కాని నిశితముగా పరిశీలించినచో నీ ప్రతిమ ప్రాచీన భారతీయమూర్తి శిల్ప చరిత్రలోనే యరుదైన శివరూపముగా కానవచ్చును. పై రెండు హస్తముల - కుడిచేతిని నక్షమాల, యెడమచేతిలో తామరపుష్పము యొక్క కాండము ( పై పుష్పము విరిగిపోయినది ) గలవు. రెండు ముంజేతుల కంకణములున్నవి క్రింది రెండు చేతులలో, కుడి యరచేతిని నొక మణిహారము, యెడమచేయి మోకాలిపైని పెట్టుకొని యున్నాడు. హారముంచుకొన్న తీరు గమనింపదగినది. హారము కుడి చేతిని మధ్యమ - అంగుళీయకములపై యుండ, అంగుష్ఠకము, ప్రథమ, కనిష్ఠికములు విడిగా నుండుట – ఆ ప్రశస్తవస్తువును దానమిచ్చు రీతిని

తెలుపుచున్నది. ఆరు పాయలున్న ముక్తా యజ్ఞోపవీతమునుబట్టి గృహస్థునిగా నెరుంగలయును. నడుమునకు బిగించియున్న వస్త్ర ఉదరబంధము, కుడిచేతిమీదగా యజ్ఞోపవీతమును మాలగా వేసుకొని యున్న తీరునుబట్టి యీ స్వామి మహోన్నత దాన్రకతువును నిర్వర్తించుచున్నట్లు తెలుసుకోనగును. ఆకర్ణాంత నేత్రములు, వెడల్పు నాశిక, విశాలమైన ఫాలము, చిక్కని పెదిమలు, బొద్దుగా ముడుచుకొని యున్న కంఠరములు యీ గృహస్థుని పరిపూర్ణతను చాటుచున్నవి. తలపైని కానసగు కేశాలంకరణతీరు చిత్రమైనది. మిక్కిలి సొంపుగా దువ్విన జటాసమూహము కుడిప్రక్కగా (చిత్రము 2) నాగవలయమున యమరికగా పొందుపరచి చంద్రకళను యాభరణముగా పొదివి యుంచిరి. మిక్కుటమైన జటములు కొన్ని పాయలుగా పారాడు చున్నవి యెడమప్రక్క (చిత్రము 3) అమరికగా దువ్విన జటములపైని కపాలము - వికృతముగా నుండినను, పైభాగమును యష్టపుష్పికలతో కూడిన పూలమాల శోభ నిచ్చుచున్నది. ఫాలమున అగ్రపట్టమున్నది. పరిశీలించిచూడ వామభాగమును స్త్రీ రూపముగా నెరుగవలయును. ఒక్క శిలాలంకరణయేగాక, యెడమ చెవిని తాటంకవలయము, కాలికి నాగనూపురము, ముఖమున కానవచ్చు లలితమైన స్త్రీ సౌందర్యశోభ యీ భగవత్ స్వరూపమును - 'సుఖాసీనం సహోమాయ' యను మంత్రవర్ణనకు ప్రతిరూపముగా చెప్పుకోనగును. శిరోజములు కట్టిన తీరునుబట్టి ప్రొఫెసర్ దేవగారు వకుటభైరవునిగా తలచిరి కాని యట్టి లక్షణములేవి యీ విగ్రహమున కానరావు.

పైన వివరించిన లక్షణాదులన్నిటిని బట్టి యీ మూర్తిశిల్పము కృష్ణయజుర్వేదములోని తైత్తిరీయ సంహితాంతర్గత శివనమోవాక మంత్రములనవుపోసన చేసుకొన్న మహాపండితుడీ శిల్పమును సుశిల్పిచే కావించినాడు. శివనమోవాకములోని, ప్రాస్పాయ: వామనాయ బృహతే యను మంత్రములు ఈ స్వరూపమును అటుపైని జటములు నమః కపర్దినేచ, హరికేశేభ్యోలేక కపర్దినే వ్యుప్తకేశాయ యను నామమున్న, ఉపవీతినేనమః, సుఖాసీనుడైన-దున నమోఆసినేభ్యః ! నామభాగమున స్త్రీరూపమునందున సహోమాయాడగా నెరుగవలయును. ఇట్టి మహోన్నత వైదికకృతియైన మానసార రుద్రుడు క్రీస్తబ్దము 4-5 శతాబ్దిని ఆలయమున ప్రతిష్ఠింపబడెను.



చిత్రము 2



చిత్రము 3

ఈస్వామి మూలబేరమై అర్చనాదికములందు కొనెనో లేక కోష్ఠదేవతగా తదితర భగవత్ స్వరూపములతోటి పూజలకు నోచు కొనెనో నిశ్చయముగా చెప్పజాలము.

యేదెట్లున్నను, ఈ ప్రతిమ రుద్రుని లక్ష్య లక్షణములన్నిటిని పొందుపరచుకొని భాసించుచున్నది.

## 2. మాంఢాలు శివప్రతిమ, (చిత్రము - 4).

ఈ గ్రామము నాగపూరునకు 75 కి. మీ. వాయవ్యదిశగా నున్నది. ఇటీవల కాలమున నాగపూరు విశ్వవిద్యాలయ అర్షశాఖవారు ఖనన పరిశోధనలు గావించిరి. ఈ త్రవ్వకముల లభించిన వాకాటక కాలమునాటి శాసనములు - శిల్పములపై ఆచార్య డా. అజయ్‌మిత్ర శాస్త్రిగారు నొక సమగ్ర వ్యాసమును మరాఠీభాషలో ప్రచురించిరి. ఈ గ్రామమున, ముఖ్యముగా భోలబడ్డి యను ప్రాచీన స్థలము పెక్కు దేవాలయములకు, శైవ - వైష్ణవ శిల్పములకు అలవాలమై యున్న టుల తెలియుచున్నది.

ఈచోట లభించిన మూర్తులన్నింటిలో నొకశివప్రతిమ అత్యంత జుగుప్సాకరమైనది (చిత్రము 4). రెండు చేతులుగల్గి స్థానకమూర్తియైన శివుడు పన్నెండు ముఖములు గల్గియున్నాడు. రెండు చేతులలో ఆయుధములుగలవు. కటిపైనున్నవి. మోకాటి క్రింద భాగము విరిగినది. శిరోభాగమున యెనిమిది తలలున్నవి. పైనాలుగుమూలల కేంద్రీకరించియున్నవి. క్రిందవి నాల్గుదిక్కుల చూచుచున్నవి. కటిపైనున్న బాహుస్కంధములపై నిరుప్రైపుల ఒక్కొక్కతల మొలచియున్నది. నాభిక్రిందుగా వస్త్రయుగ్మమున్నను ఊర్ధ్వమేఢ్రము సూచించబడియున్నది. మేఖములగూడ వస్త్రముతోనే చుట్టబడి కుడిప్రక్క అంచులు బంధింపబడినవి. రెండుప్రక్కల తొడలనుండి శీర్షికలుద్భవించియుండుట చిత్రముగానున్నది. ఈవిధముగా నీమూర్తిస్వరూపము పన్నెండుశిరస్సులు గల్గియున్నది. కంఠమున ఫలకహారము, వక్షముపై సవ్యముగ యజ్ఞోపవీతమున్నది. ముఖ్యమైన మధ్యశీర్షికపై జటములున్నవి. క్రింద వలయముతో బంధించినను చామరమును బోలివిచ్చుకొన్న జటలు చక్కగాదువ్వి తక్కిన శిరములపై అణగిన శిరోలంకరణ ముఖపట్టికలతో బంధింపబడియుండుట గమనార్హములు. ముఖకవళికలు పలురకములుగా మన్నవి. దళసరి పెదిమలు, విస్మయమును చూపు పెద్దకళ్ళు, వంకు తేలినమీసము, కుండలములు లేకున్నను సుదీర్ఘ కర్ణములు ప్రత్యేకించి భుజస్కంధమున తొడల యందున్న శిరములు మందహాసముతోటి చిలిపి వీక్షణముల కనబరుచుచున్నవి.



చిత్రము 4

ఈశిల్పమును శ్రీ అజయమిత్రశాస్త్రిగారు మహాసదాశివునిగా పేర్కొనిరి. కాని అట్టి తాత్వికలక్షణము లీప్రతిమను కానరావు. శివుని దిశపతిగా ( దిశాంచపతయేనమః ), శతరుద్రీయమున నెరుగుదుము. పైనెనిమిదిశిరములు అట్టి రూపమును విదితముచేయునేమోకాని మిగత నాల్గుశిరములు అట్టి తత్వమునకు విరుద్ధములు. క్రీ. పూ. 1 – 2 వ శతాబ్ది నుండి సదాశివుని లింగలేక వ్యక్తరూపమున – తత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశానులుగా సద్యోజాత మంత్రముల ద్వారా స్పష్టీకరించిరి. పైశీర్షికలు అట్టిసద్యోజాత తత్వము నుద్దేశించి నట్టివిగా యెంతమాత్రము గ్రహింపజాలము.

నిశితదృష్టితో పరిశీలించగా మనఐతిహాసిక పురాణగ్రంథముల నిట్టి దైవరూపములు కొన్ని కానవచ్చుచున్నవి. ప్రకృతమున నీశివ రూపము మహాభారతమున ఆదిపర్వములో (I, 203, 26 మరియు XIII, 128, పేజీలు, 1–5) స్థాణుడైన శివునికి పెక్కుశిరములు, శరీరముపైని కనులు యుధ్భవించినటుల కొన్నిగాథలున్నవి. అదెట్లన లింగరూపియైన రుద్రుడు మహాతపస్వి – నిశ్చలశివుడు –ఊర్ధ్వరేతుడైన మహాయోగి. దీర్ఘతపోనిష్ఠలోనున్న శివుని విముఖుని చేయుటకై సౌందర్యరాశియైన తిలోత్తమను తక్కినదేవతలు పంపెరట. ఈఅందాలయబల స్థాణుశివునిచుట్టు వయ్యారముగ ప్రదక్షిణముచేసి విచలితుని చేసెనట. మరొకచో నీమోహిని నృత్యముచేశి స్థాణువును చెలింపజేసెనని కూడ కలదు. ఈసొగసుకత్తె శరీరసౌయగము చూచుటకై కామాతురుడైన శివుడు తన శరీరముపైన పెక్కు శిరస్సులు సృష్టించుకొనెను. అట్లే మరొకగాథలో యింద్రుడు సహస్రాక్షుడయ్యెననికూడ తెలియచున్నది. పైనపేర్కొన్న ప్రతిమలోని శీర్షికలు, నీకామరుపియైన శివుని చూపుచున్నవి. ఈమూర్తిశిల్పము దేవాలయమున శైవగాథల తెలుపు ప్రతిమయేగాని అర్చమూర్తిగా తీసుకొనరాదు.

ఈమండాల శిల్పమును యవగాహనచేసుకొన్న పిదప నేను మరి కొన్నిశిల్పముల పునర్దర్శించితిని. ఇందున అలహాబాదు చేరువగానున్న భిటాయనుచోట లభ్యమయిన శివరూపము ప్రపంచఖ్యాతి చెందియున్నది. దీనిని పంచముఖలింగముగా పలువురుపండితులు, ముఖ్యముగా శ్రీజితేంద్రనాథబెనర్జీ గోపీనాధరావుగారు, శివరామమూర్తి యిత్యాది, పెద్దలు పేర్కొనిరి. కాని ఈప్రతిమ అట్టికోవకు చెందదు. ఈ శిల్పఖండిక


చిత్రము 5

34 సెం.మీ. యెత్తుగల్గి బ్రహ్మ భాగము భూగర్భితమై యుండుటచే పూర్తిగా వింప బడలేదు. ఈశానుడుగా తలచినభాగమున శివునిరూపమున్నది. (చిత్రము5) కాన ఈశానునిగా భావింప జాలము. విరిగియున్నందున ముఖము స్పష్టముగా తెలియదు కాని, వెనుకభాగము(చిత్రము6) తాటి ఆకుల బోలినట్టి జటలు శిరస్సుపై నమరియున్నవి. కుడి చేయి అభయ ముద్రతో క్రింద నున్న శిరముపై ( చిత్రము 7 ) కానవచ్చుచున్నది. అట్లే ఎడమ చేతిని పాత్రయో లేక ఆయుధమో యుండినట్లు తెలియుచున్నది. యజ్ఞోపవీతమున్నది. నాభిక్రిందుగా ఊర్ధ్వమేఢ్రము, దీనికిరువైపుల తొడలనుండి రెండు శిరములుద్భవించుచున్నవి. అట్లే వెనుకభాగమున పిరుదలనుండి రెండుశిరములు వచ్చియున్నవి. ఈనాల్గింట శిఖలు, కర్ణాభరణములు విశాలమైన కనుదోయి,చిన్నఫాలము వివిధ భావస్ఫోరకములైన ముఖములు కామప్రేరితుడైన శివుని సూచించుచున్నవికాని, వైదిక యోగియైన సద్యోజాత తత్త్వమును ప్రకటించు ముఖలింగముగా నెంత మాత్రము తీసుకొనజాలము. ఈభీటమూర్తి క్రీ. పూ 1 – 2 శతాబ్ది నాటిదనుటలో యెట్టిసందేహములేదు. అప్పటికే పురాణేతిహాసములు ప్రబల ప్రచారములోనికివచ్చినవి. ముఖ్యముగా నుత్తరదేశమున, మధుర, కాశి, కోసాంబి, అలహాబాదు మున్నగు ప్రదేశముల శైవ–విష్ణవములు వృద్ధిచెంది పెక్కు దైవస్వరూపములకు మాతృక వేయబడెను.

మహాపండితుడు ఇటలీదేశస్థుడైన ఆచార్యగియసుప్పెతుచ్చి నుడివినట్లు,

ప్రాచీన దైవమూర్తులు గ్రంథములవంటివి. కొన్ని వేలయేండ్ల భాగవతోపాసన, యోగధ్యాన, తాత్త్విక భావములలోని గూఢమైన కృతములు. సజీవమయిన భారతీయ వైదిక పురాణేతిహాసములకివి ప్రతిబింబములు. అవగాహన చేసికొనవలెనన్న యెంతో సంస్కృతి నిశ్చల తపస్సు యవసరము.


చిత్రము 6


చిత్రము 7

ఈ వ్యాసమునే నిటీవల (జనవరి 29–31, 1984), నాగపూరు విశ్వవిద్యాలయమున జరిగిన నేషనల్ యు. జి. సి సెమినార్ ఆన్ ది ఏజి ఆఫ్ ది వాకటక్ లో ప్రసంగించిన ఆంగ్లోపన్యాసమునకు తెలుగుసేత. దయతో నాగపూరు విశ్వవిద్యాలయమున ఆచార్యులు డా. అజయ్‌మిత్రశాస్త్రిగారు, నాకీ వ్యాసమునకు కావలసిన చిత్రములనొసగిరి. వారికి ఋణపడియున్నాను.

# అనంతరాగాలు

## శ్రీ దిలావర్

ఏ అజ్ఞాత నేపథ్య సంగీత విద్వాంసుడో
కాలమనే "కమాను" తో
ప్రకృతి అనే వాయులీనం మీద
సృష్టిస్తున్నాడు అనంతరాగాలు !
యుగాల శిఖరాలను చీల్చుకొనిదూకే
కాంతినాదాల జలపాతాలు !

సుడులు తిరిగే యీ సృష్టిసంగీత తరంగాల
ఉచ్ఛ్వాస నిశ్వాస చిగురించి,
ఎన్ని మన్వంతరాల పందిళ్ళు పాకిందో !
కడలి నడలులయి నర్తించు నాదస్వరాల
సప్తవర్ణలాస్యాలు స్వప్నించి,
ఏ కాలగర్భ నిక్షిప్త చరిత్ర నిదురలేచిందో !

ఆ నాదబ్రహ్మ -
ప్రమోద భరితంగా ఎప్పుడైనా
ఏ అరుణోదయారోహణో చేస్తే
సురభిళిస్తుంది మానవతాసంగీత కాకలీకాంతిస్వనాల
రాగమాల
లోకకళ్యాణ జ్యోతిగా ప్రజ్వరిల్లే ప్రణయ నాదకీల !
ప్రమాద ఫలితంగా ఎప్పుడైనా
ఏ నిశీథావరోహణో చేస్తే
ఉద్భవిస్తుంది ప్రళయభీకర మృత్యుసంగీతహేల !
లోక వినాశకర వున్మాద నాదజ్వాల !

తీగలు కదిలితే
మహోన్నత రాగాల గగనంలో
విచ్చుకుంటాయి మానవ నాగరికతా యింద్రధనువులు !
రాగం ప్రిదిలితే
మహానాదాల ప్రౌఢకావ్యంలో
రేకులు విచ్చుకుంటాయి రసాత్మక ధ్వనులు !

మహోధృతోత్తుంగ రాగజలధుల్లో
పయనిస్తుంది జడత, చైతన్య నావగా !
మనోరంజక రాగలహరుల్లో
పల్లవిస్తుంది మనిషి ఎడద, పూలతీవెగా !

అనంతరాగాల్లోంచి పుట్టి
ఆరోహణ అవరోహణల రెక్కలు అల్లల్లార్చుకుంటూ
యీ రాగాలపిట్ట ఏ వసంతాలు మోసుకుపోతున్నదో !
అవ్యక్త సందేశాలు పాడుకుంటూ
ఏ దూర దూరాల తీరాలకు దూసుకుపోతున్నదో !

*

డా॥ బి. వెంకటేశ్వర్లు

# అచ్చనగండ్లు

బాలికలు ఆడుకొనే ఆటల్లో ముఖ్యమైంది అచ్చనగండ్లు. పల్లె టూళ్లలో సామాన్యంగా అచ్చనగండ్లురాని బాలికలుండరు. ఇద్దరు, ముగ్గురు, ఇంకా ఎక్కువ మందితోనైనా కలసి ఆడవచ్చు. ఒంటరి గానూ ఆడవచ్చు. ఈ యాటను పగలు మాత్రమే ఆడటానికి వీలవు తుంది. రాత్రివేళల్లో వీలుపడదు. చిన్నవయసులోని బాలికలే విశేషంగా ఆడుతున్నప్పటికీ వయోభేదం లేకుండా పెద్దవాళ్ళు కూడ వారి వారి తీరికవేళల్లో ఈ యాటను ఆడుతుంటారు. ఎంతో విశేషాన్ని సంతరించుకుని ప్రచారం పొందిన ఈ యాట విస్తృతి ఆంధ్రదేశం అంతటా వ్యాపించింది. విస్తృతితోపాటు ప్రాంతీయ భేదాలను పొందటం జానపదకళల ప్రధాన లక్షణం. పల్నాటిసీమలో ఈ యాట విస్తృతి, ప్రచారాలను సేకరించడం జరిగింది. అచ్చనగండ్లు – ఉనికి, అచ్చనగండ్లరకాలు, ఆటలో జాగ్రత్తలు, సమయవర్ణనాలు అనే అంశాలను పరిశీలించడమే ఈ వ్యాస ముఖ్యోద్దేశం.

## 1. అచ్చనగండ్లు – ఉనికి

సాహిత్యంలో అచ్చనగండ్లవ్యాప్తి, రూపాంతరాలు, పర్యాయ పదాలు, పదవ్యుత్పత్తి, పరికరాలు మొదలైన అంశాలు ఇందులో గమనించవచ్చు.

1, 1. సాహిత్యంలో అచ్చనగండ్ల వ్యాప్తి :- అచ్చనగండ్లు అనే పదంతోపాటు అచ్చనగాయలు, అచ్చనగుండ్లు, అచ్చనలు అనే పదాలుకూడా కన్పిస్తాయి. ఈ పదాలవ్యాప్తి మనకు సాహిత్యంద్వారా మాత్రమే తెలుస్తుంది. సాహిత్యంలో ఈ పదాల వ్యాప్తిని పరికిద్దాం.

క... "గచ్చకాయలు, నచ్చనగండ్లాడ సరివయస్యల తోడన్"[1] అని పాంచాలీ పరిణయంలో కాకమాని మూర్తి కవీ;

"ఉ... మధులోల భృంగముల్, వారక సారెకున్ నెగసి వ్రాలుచునొప్పెఁ దదంబు దేవతల్, నేరుపుతోడ

నాడు హరినీలపు టచ్చనగండ్ల కైవడిన్"[2] అని కళాపూర్ణో దయంలో పింగళి సూరన; "గీ... కొండ లచ్చనగండ్లయి నిండు చెఱువులెల్ల నద్దంపుబిల్లలై ..."[3] అని వసుచరిత్రలో భట్టుమూర్తి గారూ; "... సరిలేని యంజి సొగటాలరుదగు జూదంబు నెత్త మచ్చనగండ్లున్ ..."[4] అని భోజరాజీయంలో అనంతమాత్యుఁడు "...పింపిళ్ళు బొక్కిళ్ళు బేడిసె తిరుగుళ్ళు నచ్చనగండు దాయా ... "[5] అని హంసవింశతిలో అయ్యలరాజు నారాయణామాత్యుఁడు ఇంకా దశావతార చరిత్రలో ధరణిదేవుల రామయామాత్యుఁడూ భోజసుతాపరిణయంలో కోటేశ్వరకవి మొదలయినవాళ్ళు 'అచ్చ గండ్లు' అనే పదాన్ని పేర్కొన్నారు.

అచ్చనగాయలు :- ఈ పదాన్ని "సీ... కరకంకణ ధ్వనుల ఘల్లు ఘల్లు రని యింపుగావింప నచ్చనగాయలాడు"[6] అని రుక్మి పరిణయంలో కూచిమంచి తిమ్మకవి పేర్కొన్నాడు.

అచ్చనగుండ్లు :- ఈ పదాన్ని "సీ ... లచ్చికన్నియ యాడు నచ్చనగుండ్లు నాఁగొండ లేవార్థిలో నుండు నొకట"[7] అని రామాభ్యుదయంలో అయ్యలరాజు రామభద్రుడూ "సీ... ముదుర వెన్నెలగాలము ముత్యాల దిన్నెపైబడి యచ్చనగుండ్లు పాఱవైచి" అని యయాతి చరిత్రలో పొన్నెగంటి తెలగనార్యుడూ; పేర్కొన్నారు.

అచ్చనలు అనే పదాన్ని "ద్వి... చెచ్చెర సుతుప్రాణమిచ్చి నేఁడె, యచ్చనలాడెద నభవమీకనక ..."[9] అని పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమన, "క.... హెచ్చిన శోకము మదిలో నచ్చనలాడంగ ననియె నమ్మునితోడన్ ..."[10] అని జైమినీభారతంలో పిల్లలమర్రి పిన వీరభద్రుడూ పేర్కొన్నారు.

ఇక అచ్చనగుండులు అనే పదానికి ప్రత్యేకంగా ప్రయోగ కన్పించకపోయినా అచ్చనగుండ్లు అనే పదానికి రూపాంతరంగ ఊహించవచ్చు.

1, 2. రూపాంతరాలు :- అచ్చనగండులు, అచ్చనగళ్ళ అచ్చనగుండులు, అచ్చనగుండ్లు అని రూపాంతరాలు కన్పిస్తున్నాయి ఈ యాటలో ఆడే రాళ్ళు గుండ్రంగా ఉంటాయి, కాబట్టి 'గుండు అని వ్యవహరించబడి క్రమంగా అది రూపాంతరంగా 'అచ్చనగుండ్లు అయి ఉండవచ్చు.

1, 3. పర్యాయపదాలు :- అచ్చనగండ్లు అనే పదాని అచ్చనగాయలు, అచ్చనలు, అచ్చనగిల్లలు, గిల్లలు అనేవి పర్యాయ పదాలుగా కన్పిస్తున్నాయి.

1, 4. వ్యుత్పత్తి :-

1, 4, 1. అచ్చనగండ్లు :- సం. అక్ష > ప్రా. అచ్చ > తె. 'అచ్చ' గానూ సం. కల్లమ్ > పా. కల్లం > త. కళ్ > తె. కల్లు' - గానూ మారి అచ్చ + కలు → అచ్చ + న + కల్లు = అచ్చనకల్లు అయి ఉండవచ్చు. తర్వాత వ్యాకరణ కార్యంవల్ల 'క' 'గ' గా మారి బహువచనంలో "అచ్చనగండ్లు" గా రూపొందిందని చెప్పవచ్చు. 'అక్ష' అనే సంస్కృత పదానికి పాచిక అని అర్థం. కల్లు, అంటే రాయి అని అర్థం. అచ్చనగండ్లు అనే యీ మాట ప్రాచీనకాలం నుంచీ పాచికలాటలలో ఒక భేదంగా అవతరించి ఉండవచ్చు. ఈ యాటకు రాళ్ళు ఉపయోగిస్తారు కాబట్టి వాటి పేరుమీదుగానే ఈ పేరు ఏర్పడి ఉండవచ్చునని ఊహించవచ్చు.

1,4,2. అచ్చనగాయలు :- ఈ యాటకు కొన్ని ప్రాంతాల్లో గచ్చకాయలు ఉపయోగిస్తారు. ఈ యాటలో కాయలు వాడడంవల్ల అచ్చనగాయలు అని పేరుబడి ఉండవచ్చు. ఇదికూడా అక్ష > అచ్చ > అచ్చ + కాయలు → అచ్చ + న + కాయలు → అచ్చనకాయలు అయి → 'అచ్చనగాయలు' గా మారి ఉండవచ్చు.

ఈ కాయలు బదులు ఏ సాధనాలు వాడినా తర్వాతికాలంలో కాయలు అనే మాటే స్థిరపడిపోయి ఉండవచ్చు. చదరంగం, పులిజూదం మొదలైన ఆటలలో వాడే రాళ్ళను చిన్నకాయలు, పెద్దకాయలు అని వ్యవహరించడం కద్దు.

1. 4. 3. అచ్చనలు :- 'అచ్చన' అంటే పాచికల.కు సంబంధించినది అని అర్థం.[11] 'అచ్చనలు' అనేది బహువచనరూపం.

1. 4. 4. అచ్చనగిల్లలు :- ఈ పదానికి నిఘంటువులలో అర్థ వివరణ జరుగలేదు. ప్రస్తుతం తెలంగాణాలోని కొన్ని ప్రాంతాలలో ఉంది.

1. 4. 5. గిల్లలు:- చిన్న చిన్న రాళ్ళను "గుల్ల" అంటుంటారు, "గుల్ల" క్రమంగా 'గిల్లగా' మారి ఉండవచ్చు. ఈయాట అర్థంలో నిఘంటువుల కెక్కలేదు. ప్రస్తుతం పల్నాటి సీమలో "గిల్లాలు" అనేది విస్తృత వ్యవహారంలో ఉంది. 'గిల్ల' కు బహువచనరూపం "గిల్లలు".

1. 5, పరికరాలు :- అచ్చనగండ్లాటకు గచ్చకాయలుగానీ, గచ్చకాయ పరిణామంలో గల రాళ్లుగానీ వాడుతారు. అవుల మంద వంటి పెద్ద ఆటలలో చింత విత్తనాలు వాడుతారు. కొందరు కుంకుడు విత్తనాలు కూడా వాడుతారని చెప్తారు. రాళ్లయితే వాటిని గరుకైన నేలమీద రుద్ది కొంచెం గుండ్రంగా చేస్తారు.

## 2. అచ్చనగండ్లు – రకాలు :-

అచ్చనగండ్లు పల్నాటిసీమలో మూడురకాలుగా ఆడుతారు. 1. ఐదు గిల్లాలాట. ఇందులో 32 పద్ధతులు ఆడుతారు. 2 తొమ్మిది గిల్లాలాట ఇందులో 13 పద్ధతులు ఆడుతారు. 3. అవులమంద, దీన్ని పల్నాటిసీమలో "4 గిల్లాలు = ఒక ఉజ్జి" అని లెక్కించుకొని చాలా గిల్లాలతో ఆడుతారు. విపులంగా వివరించడం వ్యాసముఖంగా వీలు పడని పని కాబట్టి సాధ్యమైనంత క్లుప్తంగా వివరించడం జరుగుతుంది.

2, 1. ఐదు గిల్లాలాట :- ఐదు గిల్లాలతో ఆడే ఆట. ఇందులో రెండు రకాలున్నాయి. యాభైగానీ, అరవైగానీ, వందసార్లుగానీ ఒక నిర్ణీత సంఖ్యలో 'కుప్పె' ఆడటం. ఎవరు ముందు పూర్తిగా ఆడితే వారు గెల్చినట్లు. రెండోరకం ఆటలో 32 పద్ధతులు ఆడతారు. ఆ 32 పద్ధతులు మామూలు ఆటలోనూ, మురుగు ఆటలోనూ ముందు పూర్తిగా ఆడినవారు గెల్చినట్లు. ఈ యాటలో ప్రతి పద్ధతి ఐదుసార్లు ఆడుతారు. ఆ పద్ధతులు ఇవి.

2, 1, 1. కుప్పె :- దీనిని కుప్పీలు అంటారని విజ్ఞాన సర్వస్వాలలో పేర్కొన్నారు. సామాన్యంగా ఆట కుడిచేతితో ఆడుతుంటారు. మొదట ఐదు గిల్లలు చేతిలోనికి తీసుకొని ఒక గిల్లను దాదాపు ఆడే వ్యక్తి తన తల ఎత్తుకు ఎగురవేసి, అది కిందకు దిగే లోగా చేతిలోని నాలుగుగిల్లలను ఒకచోట కుప్పగా పెట్టి పైనుంచి వచ్చే గిల్లను కిందపడకుండా పట్టుకోవాలి. తర్వాత మరలా ఆ గిల్లను ఎగురవేసి అది కిందకు వచ్చేలోగా అంతకుముందు కింద కుప్పగా పెట్టిన నాల్గు గిల్లలను చేతిలోకి తీసుకొని పైనుంచి వచ్చే గిల్లను కిందపడకుండా పట్టుకోవాలి. దీనిని ఒకసారి ఆడినట్లుగా లెక్కించాలి. అట్లా ఐదుసార్లు ఆడాలి. అపుడు కుప్పె ఆట పూర్తవుతుంది. ఆటలో పైనుంచి వచ్చే గిల్లను సరిగా పట్టుకోలేకపోయినా, పైనుంచి గిల్లను కిందకు వచ్చేలోగా కిందగిల్లలను చేతిలోనికి తీసుకోలేకపోయినా, చేతిలోనికి తీసుకున్న తర్వాత ఏఒక్కటి కిందపడినా ఆట పోయినట్లే. ఆడే అవకాశం ప్రత్యర్థికి పోతుంది.

2, 1, 2. మూటీలు :- కుప్పె ఆడిన తర్వాత మూటీలు ఆడుతారు. ఇందులో కిందవేసిన నాల్గు గిల్లాలలో మూటిని మాత్రమే చేతిలోనికి తీసుకోవాలి. అపుడు నాల్గో గిల్లా కదలగూడదు. చెయ్యి తగులరాదు. అందుకనే చేతిలోని గిల్లలను విడిచేటప్పుడు విడివిడిగా పడేట్లు విడిచి ఆడుతారు. ఐదుసార్లు ఆడాలి.

2, 3, 1. రెంటీలు :- చేతిలోని గిల్లలు విడివిడిగా పడేట్లు వేసి రెండు రెండు చొప్పున తీసుకోవాలి. గిల్లాలన్నీ దగ్గరగాపడి

రెండు రెండు విడివిడిగా తీసుకోటానికి వీలుపడనప్పుడు 'జోళ్ళో' అనే మాటను చెప్పి అన్నీ కలిపి తీసుకోవచ్చు. ఐతే అది ఒకసారిగానే పరిగణించాలి. ఐదుసార్లు ఆడాలి.

2, 1, 4. ఒక్కనగిల్ల :- కిందవేసిన గిల్లలను ఒక్కొక్క గిల్లను చేతిలోనికి తీసుకోడం ఒక్కనగిల్ల అంటారు. ఐదుసార్లు ఐదు గిల్లలు తీసుకోవడంతో ఈపద్ధతి పూర్తవుతుంది.

2, 1, 5 మారుగిల్ల :- దీనినే గిల్లమార్పు అని అంటారు. ముందు ఒకగిల్లను ఎగురవేసి నాల్గుగిల్లలు కిందపడవేసి ఒకదాన్ని కొట్టి చేతిలోని రెంటిలో ఒకదాన్ని ఎగురవేసి అది కిందకు వచ్చేలోగా కింద గిల్లాలలో ఒకదాన్ని చేతిలోనికి తీసుకొని దానిస్థానంలో చేతిలోని గిల్లను వదలిపెట్టాలి. ఇట్లా ఒకదాని తర్వాత ఒకటిగా ఐదుసార్లు మార్చాలి.

2, 1, 6. కొట్టుడుగిల్ల :- ఒకగిల్లను బొటనవేలు చూపుడు వేలు మధ్యగా ఇరికించి పట్టుకొని కిందవున్న మూడుగిల్లలను ఒకదాని తర్వాత మరొకదాన్ని ఈవేళ్ళమధ్య గిల్లతో స్పృశించాలి. ఇట్లా ఐదు సార్లు కొట్టాలి. దీనినే కొట్టుడుగిల్లా అలటారు.

2, 1, 7. ఎగరేత :- మొదట ఒకగిల్లను ఎగురవేసి నాల్గుగిల్లలను కిందపెట్టి, కొట్టాలి. రెండోసారి రెండుగిల్లలను, మూడో సారి మూడుగిల్లలను, నాల్గోసారి నాల్గుగిల్లలను ఎగురవేసి కిందపెట్టిన గిల్లలు కొడుతుండాలి. దీనినే ఎగరేత అటాంరు.

2, 1, 8. పెద్దచేట :- మొదటి చేతిలోని ఐదుగిల్లాలలో నాల్గుగిల్లాలను ఎగురవేసి అవి కిందకువచ్చేలోగా చేతిలోని గిల్లను కిందపెట్టి, తర్వాత పైనుంచివచ్చే గిల్లాలను పట్టుకోవాలి. రెండోసారి మూడుగిల్లాలు, మూడోసారి రెండుగిల్లాలు, నాల్గోసారి ఒకగిల్లను
19 ఎగురవేస్తూ ప్రతిసారి ఒక్కొక్కగిల్లను కిందపెడుతుండాలి. ఐదోసారి కిందపెట్టిన అన్నిగిల్లలను కలిపి కొట్టడంతో ఈపద్ధతి పూర్తవుతుంది దీనినే పెద్దచేట అంటారు. గిల్లాలు ఎగురవేసేటప్పుడు చేటలో ధాన్యం ఎగరిన పోలికఉంటుంది.

2,1, 9. చిన్నచేట :- ఒకపక్క రెండుగిల్లలు, మరొకపక్క రెండు గిల్లలు కిందపెడుతూ ఆడాలి. ఐదోసారి ఒకపక్క రెండు గిల్లలు తక్కినవాటితో కలిపి తర్వాతకొట్టాలి. ఇదేచిన్నచేట

2, 1, 10 చిన్నగొడ్డలి :- ఒకగిల్లను ఎగురవేసి చేతిలోని గిల్లలను చేతిలోనే ఉంచుకొని చూపుడు వేలుతో భూమిని స్పృశించాలి. పైనుంచి వచ్చేగిల్లను పట్టుకోవాలి. వేలు భూమిని స్పృశించడం గొడ్డలి వ్రేటును పోలిఉంటుంది. ఐదుసార్లు ఆడాలి.

2,1,11. పెద్దగొడ్డలి :- చిన్నగొడ్డలిని పోలిన ఆటే. ఇందులో బొటన వేలితో భూమిని స్పృశించాలి.

2,1,12. తొట్టి :- ఆడేవాళ్ళ రెండుపాదాలు కలిపించాలి. రెండు మడాలు ఒకచోట, రెండు బొటనవేళ్ళు ఒకచోట కలుస్తాయి. రెండు బొటనవేళ్ళు కలసినచోట ఒక గిల్లను, రెండుమడాలు కలసిన చోట ఒక గిల్లను, కుడిపాదం మధ్యలో గిలకకు దగ్గరలో ఒక గిల్లను, అట్లే ఎడమపాదం గిలకవద్ద ఒక గిల్లను నిలపాలి. తర్వాత మిగిలిన గిల్లను ఎగురవేస్తూ ఒక్కొక్కదాన్ని రెండు పాదాలు ఆనించగా అరికాళ్ళ మధ్యలోఏర్పడ్డ ఖాళీలోనికి నెమ్మదిగా నెట్టాలి. నాల్గుగిల్లాలు తొట్టిలోనికి పడవేసిన తర్వాత కాళ్ళుతీసి గిల్లలన్నీ కలిపి కొట్టాలి. ఇదే తొట్టి అంటారు.

2,1,13. చల్లగుత్తి :- చల్ల చిలికే కవ్వం ఆకారంలో భూమిమీద చేతి (ఎడమచేతి) వేళ్ళను ఉంచాలి. ప్రతి రెండువేళ్ళ మధ్యకు ఎదురుగా గిల్లలను ఉంచి ఒక్కొక్కదాన్నే అరచేతికిందకు నెట్టాలి. తర్వాత చేయితీసి గిల్లలనీ కలిపి కొట్టాలి.

2,1,14. అప్పచ్చి :- ఎడమచేతిని పూర్తిగా భూమిమీద ఆనించి (బోర్లించి) వేళ్ళమధ్య సందు ఉండేటట్లు ఎడంగా చాచాలి. చల్లగుత్తిని పోలిన పద్ధతిలోనే ఉంటుందీయాటగూడ. ఇందులో వేళ్ళకు ఎదురుగా పెట్టిన గిల్లలను సరిగ్గా ఆయా రెండువేళ్ళ మధ్యకు వెళ్ళి నిలిచేటట్లు నెట్టాలి. నాల్గుగిల్లలు అట్లానెట్టిన తర్వాత చేతిని తీసి నాల్గు గిల్లలు కలిపి కొట్టాలి. నాల్గుగిల్లాలు నెట్టడం నాల్గుసార్లుగాను, కలిపి కొట్టడం ఐదోసారిగాను లెక్కించాలి.

2,1,15. గవాచి :- ఎడమచేతిని గవాక్షం ఆకారంలో పెట్టి గిల్లలు నాల్గింటిని వరుసగాపెట్టి ఒక్కొక్కదాన్ని ఆ చేతికిందకు నెట్టడం గవాచి అంటారు. నాల్గుగిల్లలు నెట్టినతర్వాత చేతిని పక్కకు తొలగించి గిల్లాలు నాల్గు కలిపి కొట్టాలి.

2,1,16. గూన :- దీనినే దోనె అంటారు. ఎడమచేతిని దోనె ఆకారంలో పెట్టి ఆడాలి 'గవాచి' పద్ధతివలె ఉంటుంది.

2,1,17. దోకుడువార :- చేతిలో నాల్గు గిల్లాలుంచుకొని చూపుడువేలుతో దోకుడువారతో నేలను దోకినట్లుగా భూమిని స్పృశించాలి. అట్లా ఐదుసార్లు ఆడాలి.

2,1,18. దోసిళ్ళు :- నాల్గుగిల్లలు కిందపెట్టి పైనుంచి గిల్ల వచ్చేలోగా కిందవాటిని రెండుచేతులతో కలిపి తీసుకోవడం. దోసిలితో తీసికుంటారు కాబట్టి దోసిళ్ళు అని వ్యవహారం.

2,1,19. గిచ్చుడు :— నాల్గు గిల్లలను చేతిలోనే ఉంచుకొని బొటనవేలు చూపుడువేలు కలిపి భూమిని గిచ్చినట్లు స్పృశించాలి.

2. 1. 20. కత్తెర :— రెండు చేతులు కలిపి ఒక చేతివేళ్ళ మధ్య మరొక చేతివేళ్ళు దూర్చి మెలికవేయాలి. రెండు చూపుడువేళ్ల ఈ మెలకనుంచి తీసి చాచాలి. బొటనవేళ్ళు విడివిడిగా ఉంటాయి. రెండు అరచేతులు కరచుకొని ఉంటాయి. కిందవేసిన గిల్లలలో చాచిన రెండు చూపుడు వేళ్ళతో ఒక్కొక్కదాన్ని పట్టుకొని ఎగురవేసి చేతుల మెలికను అట్లాగే ఉంచి అరచేతులు కొద్దిగ వెడల్పుగా తెరచి పైనుంచి వచ్చే గిల్లను కిందపడకుండా దోసిట్లోకి పట్టాలి. చేతుల మెలిక, చూపుడు వేళ్ల కత్తెర అకారాన్ని బోలి ఉంటుంది.

2, 1, 21. చిన్న గుద్దుడు :— ఒక గిల్లను పిడికిలి అడుగు భాగాన అంటే చిటికెన వేలితో సగం వెలుపలకు కన్పించేటట్లు పట్టు కుని తక్కిన గిల్లాలను పిడికిలిలో ఉంచుకొని ఆ గిల్లాతో భూమిని స్పృశించాలి. ఇది గుద్దినట్లుగా ఉంటుంది.

2, 1, 22. పెద్దగుద్దుడు :— చిన్న గుద్దుడు లాగానే రెండు సార్లు వెంట వెంటనే గిల్లకిందకు వచ్చేలోగా స్పృశిస్తే పెద్దగుద్దుడు

2, 1, 23. కప్పగంతులు :— కిందవేసిన గిల్లలలో ఒక దాన్ని తీసుకొని, వెంటనే మరొకదాన్ని తీసుకొని పైనుంచి వచ్చే గిల్లను పట్టుకోవాలి. ఆ సమయంలో చేయి కదలిక కప్పగంతులు వేసినట్లుగా ఉంటుంది. రెండు గిల్లలను ఒకేమారు విడివిడిగా తీసుకోడమే ఇందులో విశేషం.

2, 1, 24. కాకిరెక్కలు :— మూడుగిల్లలు కిందవేసి, రెండు గిల్లలు చేతిలోనికి తీసుకొని వాటిని పైకి ఎగురవేసి కిందనుంచి ఒక గిల్లను కుడిచేతిలోనికి తీసుకొని పైనుంచి వచ్చే రెండు గిల్లాలలో ఒకదాన్ని కుడిచేతితోను, మరొకదాన్ని ఎడమచేతితోను పట్టుకోవాలి. ఎగరవేసేటప్పుడు విడివిడిగా పడేటట్లు వేయాలి. అపుడు ఎడమ చేతిలో ఒకగిల్ల, కుడిచేతిలో రెండుగిల్లలు, కింద రెండు గిల్లలు ఉంటాయి. ఇది ఒకసారి. ఇట్లా ఐదుసార్లకు ఐదు గిల్లలు ఎడమచేతి లోనికి చేరుతాయి.

2, 1, 25. విసనకట్ట :— ఇది కుప్పె ఆట. అయితే పైకి ఎగురవేసిన ప్రతిసారి ఎడమచేతిని ఎగురవేసిన గిల్లకు ఎదురుగా ఊపాలి. అది చూడటానికి విసనకట్ట ఊపులను బోలి ఉంటుంది. ఐదుసార్లు ఆడాలి.

2, 1, 26. కొబ్బరిచిప్ప :— ఇది కుప్పె పద్ధతిలో ఒక ... కింది గిల్లలు చేతిలోనికి తీసుకొని పైనుంచి వచ్చే గిల్లను పట్టుకున్న వెంటనే ఎడమచేతితో కుడిచేతి చేరను మూయాలి. దీన్నే కొబ్బరిచిప్ప అంటారు.

2, 1, 27. కాయనెట్టుడు :— మూటీలాటలో ఒక భేదం. కిందవున్న నాల్గు గిల్లలలో ఒకదాన్ని చేతితో పక్కకు నెట్టి తక్కినవి చేతిలోనికి తీసుకోవాలి. మూటీలాటలో నాల్గోగిల్లకు చేయితగులరాదు.

2, 1, 28. మిరపకాయ :— నాల్గు గిల్లలను చేతిలోనే ఉంచుకొని నడిమవేలు, చూపుడువేలు కలిపి చాచి భూమిని స్పృశించాలి. ఆ రెండువేళ్ళు చాచినపుడు మిరపకాయలజంట ఆకృతి కన్పిస్తుంది.

2, 1, 29. చేయి మార్పిళ్లు :— ఇందులో నాల్గు రకాలున్నాయి. ఎడమచేయి, కుడిచేయి, రెండు చేతులు, ఎడమ - కుడి చేతులు ఒకదాని తర్వాత మరొకటి బోర్లించడం, వెల్లకిల తిప్పడం ఈ ఆటలో ముఖ్యవిశేషం. ఒక్కొక్క రకంలో ఐదుసార్లు ఆడాలి.

2, 1, 30. చెయ్యి :— ఐదు గిల్లలు చేతిలోనికి తీసుకొని కొద్ది ఎత్తుకు అన్నిటిని ఒక్కమారుగా ఎగురవేయాలి. చేతిని బోర్ల తిప్పి వేళ్లమీద పైనుంచి వచ్చే గిల్లలను కిందపడకుండా పట్టుకోవాలి. ఐదు గిల్లలు చేతిమీద నిల్వకుండా కిందపడితే ఆటపోతుంది. ఒక్క గిల్ల చేతిమీద నిలబడినా ఆడవచ్చు. కిందపడిన గిల్లలను చేతివేళ్ళమధ్య ఇరికించుకొని వేళ్లమీద మిగిలిన (పట్టుకున్న) గిల్లలను ఎగురవేసి చేయి మామూలుగా తిప్పి ఎగురవేసిన గిల్లలను పట్టుకోవాలి, అన్ని గిల్లలు బోర్ల తిప్పిన వేళ్ళమీద పట్టుకుంటే వాటిని మరలా ఎగురవేసి చేయితిప్పి వాటిని పట్టుకోవాలి. ఏ ఒక్కటి జారిపోయినా ఆట పోతుంది. ఇట్లా ఐదుసార్లు ఆడాలి.

2,1,31. చింతపూత :— చెయ్యి పద్ధతిలోనే ఉంటుందీయాట, అందులో కిందపడిన గిల్లలను చేతివేళ్ళమధ్య ఇరుకించుకొని ఆడితే, ఇందులో బోర్లించిన చేతిమీది గిల్లలను ఎగురవేసి చేయితిప్పి వాటిని పట్టుకున్న తర్వాత ఒక్కొక్కదాన్ని ఆడి తీసుకోవాలి. అంటే ఒక గిల్లను ఎగురవేసి అవి కిందకు వచ్చేలోగా కిందగిల్లను తీసుకోవాలి. ఇట్లా ఐదుసార్లు చేయి బోర్లించి ఆడాలి.

2,1,32. దుసిళ్ళు :— మూడు గిల్లలు కిందవేసి, రెండు గిల్లలు కుడిచేతిలోనికి తీసుకొని, రెంటిని పైకి ఎగురవేసి అవి కిందకు వచ్చేలోగా కిందమూటిని చేతిలోనికి తీసుకొని పైనుంచి వచ్చే రెం గిల్లలను పట్టుకోవాలి. ఇట్లా ఐదుసార్లు ఆడాలి. అట్లాగే ... ండు గిల్లాలు, నాల్గుగిల్లాలు ఎగురవేస్తూ ఐదుసార్లు చొప్పున మూడు ఆడాలి.



1984

ఇట్లా 32 పద్ధతులు ఆడినతర్వాత మురుగు ఆటలో మొదలు పెడతారు. మురుగు ఆటలోకూడ 32 పద్ధతులు ఎవరు ముందు ఆడుతారో వారు గెల్చినట్లు. ఓడినవారు పెట్టుకున్న పందెం చెల్లిస్తారు.

2,2. తొమ్మిది గిల్లాలాట :- ఇందులో 13 పద్ధతులు ఆడుతారు. మామూలు ఆట, మురుగు ఆట ఉంటాయి.

2,2,1. ఒక్కనగిల్ల :- తొమ్మిది గిల్లలు కుడిచేతిలోనికి తీసుకొని అందులో ఒకగిల్లను పైకి ఎగురవేసి చేతిలోని గిల్లలను కిందవేసి పైనుంచి వచ్చే గిల్లను పట్టుకోవాలి. తర్వాత చేతిలోని గిల్లను మరలా పైకి ఎగురవేసి కిందనుంచి ఒక గిల్లను చేతిలోనికి తీసుకొని పైనుంచివచ్చే గిల్లను పట్టుకోవాలి. అది ఒక్కసారిగా పరిగణించాలి. అట్లా తొమ్మిదిసార్లు ఆడాలి.

2,2,2. రెంటీలు :- రెండు రెండు గిల్లల చొప్పున తీసుకుంటూ ఆడాలి. తొమ్మిదిసార్లు ఆడాలి.

ఇట్లే మూటిలలో మూడుగిల్లల చొప్పున, నాల్గులులో నాల్గు గిల్లల చొప్పున, ఐదులలో ఐదుగిల్లల చొప్పున, ఆర్లలో ఆరుగిల్లల చొప్పున, ఏళ్ళులో ఏడుగిల్లల చొప్పున తీసుకుంటూ తొమ్మిదిసార్లు ఆడాలి. ఎనిమిది గిల్లలను కలిపి తీసుకుంటూ ఆడటాన్నే కుప్పె అంటారు.

రెక్కలు, చేతులు, చిన్నగుద్దుడు, పెద్దగుద్దుడు, కప్పగంతులు ఆడే విధానంలో ఐదుగిల్లాలాట మాదిరిగానే ఉంటుంది. ఐతే తొమ్మిది గిల్లాలాటలో తొమ్మిదిసార్లు ఆడాలి. మురుగు ఆటలోకూడ ఈ 13 పద్ధతులు ఆడుతారు.

2,3. ఆవులమంద :- చాలగిల్లలు తీసుకొని ఇద్దరుగానీ, అంతకంటె ఎక్కువమందితోగానీ ఆడే ఆట. ఆటలో ఎక్కువమంది పాల్గొంటే పంట వేస్తారు. ఇద్దరే ఆడితే ఎవరో ఒకరు ముందు ఆడుతారు. ఆటలో గిల్లలు రెండువందల నుంచి ఆరువందలదాకా ఉండవచ్చు. ఎక్కువమంది పాల్గొంటే ఇంకా ఎక్కువగిల్లాలు తీసుకోవాలి. మొదట ఆడే వ్యక్తి దోసిలి నిండుగా గిల్లాలు తీసుకోవాలి. మిగిలినవి పల్చగా ఉండేటట్లు సర్దుబాటు చేయాలి. దోసిట్లోని గిల్లలను కొంచెం ఎత్తుకు అన్నీ ఎగురవేసి చేతిని బోర్లతిప్పి ఆ వేళ్ళమీద పైనుంచి వచ్చే గిల్లలను పట్టుకోవాలి. అన్నీ పట్టుకోవటం వీలుపడదు. అంతేగాదు చేతిమీద పడ్డ గిల్లాలలో కూడా కొన్ని కిందకు దొర్లుతాయి. పడేవరకు పడినతర్వాత వాటిని మరలా ఎగురవేసి చేయి తిప్పి వా పట్టుకోవాలి. అప్పుడు ఏ ఒక్కటి పట్టుతప్పి కిందపడినా పోతుంది. అట్లా పట్టుకున్న గిల్లలు గెల్చినట్లే. పట్టుకున్న గిల్లల ఒకపక్క కుప్పగా పెట్టుకొని ఆట మొదలుపెట్టాలి గెల్చుకు గిల్లలలోనుంచి ఒకదాన్ని తీసుకొని దాన్ని పైకి ఎగురవేసి కిందవు గిల్లలలోనుంచి ఒకదాన్ని చేతిలోనికి తీసుకొని పైనుంచి వచ్చేగిల్ల పట్టుకోవాలి. ఒక్కొక్క గిల్ల చొప్పున నాల్గు గిల్లలు కొట్టుకు తర్వాత ఆ నాల్గు గిల్లలను ఎడమచేతిలోనికి తీసుకోవాలి. ఒకగిల్ల కుడిచేతి బొటనవేలితో నొక్కిపట్టి, తక్కిన నాల్గు గిల్లలను ఒకమా ఎత్తుకు ఎగురవేసి వాటిని ఎడమచేతితో పట్టాలి. వాటిని గెల్చుకు తర్వాత కుప్పమీద పెట్టాలి. ఈ నాల్గుగిల్లలను కలిపి ఉజ్జి అంటా ఉద్ది లేక ఉజ్జి అంటే రెండు అని అర్థం. కానీ ఇక్కడ ఒక స దాయానికి ఉపయోగించబడుతుంది. కొన్నిచోట్ల మూడు గిల్లలనే ఉ అంటారు. ఇట్లా ఉజ్జీలు ఉజ్జీలుగా గెల్చుకుని ఎడమచేతిలోనికి తీ కుంటూ పక్కన పెట్టుకుంటూ ఎక్కువ గెల్చుకోవటానికి ఉత్సా పడుతూ ఆడుతుంటారు. ఇట్లా ఆడుతూ ఎవరు అన్నీ గెల్చు ఆట అవకాశం ఉండి ఆడటానికి కింద గిల్లలు లేకుండా మరలా ఆట మొదట ఆడే అవకాశాన్ని పొందుతారో వాళ్ళ ఆటలో ప్రత్యర్థిక గిల్లలు ఎక్కువ వేయాలి. ప్రత్యర్థి కట్టు గిల్లలు వేస్తే ఈ వ కట్టున్నర గిల్లలు వేయాలి. అంటే 2:3 నిష్పత్తిలో ఉంటు 4 గిల్లాల ఉజ్జీలు రెండైతే ఒక కట్టు అంటారు. ఇందులో

4 గిల్లాలు = ఉజ్జి

2 ఉజ్జీలు = కట్టు

5 కట్లు = గుబ్బం

8 గిల్లలు = కట్టు

40 గిల్లలు = గుబ్బం—" అని లెక్కిస్తారు.

ఆట ఎప్పుడైనా మొదలు పెట్టేటప్పుడు దోసిలిలో గిల్లలు కొని వాటిని ఎగురవేసి చేయి తిప్పి వేళ్ళమీద పట్టుకునే అవక ఆట మొదలు పెట్టిన వాళ్ళకే వస్తుంది. అపుడు పట్టుకున్న గిల్లా గెల్చుకున్నట్లే. తర్వాత ఆడేటప్పుడు పక్క గిల్ల కదలగూ పూర్తిగా అన్నీ గెల్చుకున్న తర్వాత ఓడిపోయినవారు పెట్టుక పందెం చెల్లిస్తారు. బాగా చేయి మెదిగిన వాళ్ళకు వంతువస్తే పూ కొట్టుకునే వరకు ఆట వదలరు. కాలవ్యవధి ఎక్కువగానే పడుత



6

**. ఆటలో తీసుకోవలసన జాగ్రత్తలు**

ఈ యాటలో కొంత జాగ్రత్తగా ప్రవర్తించాలి. గిల్లాలు జుల మీద పడి గాజులు పగిలిపోతుంటాయి.

కొత్తగా నేర్చేవారికిది తప్పనిసరి. ఒక్కొక్కమారు ఎగుర ేన గిల్లలు చేతిలో కాకుండా మణికట్టుమీద పడుతుంటాయి. కొద్ది టి దెబ్బకూడా తగుల వచ్చు. ఆవులమంద ఆటలో దోసిట్లోని గిల్ల ే చేయి బోర్లించి పట్టుకునేటప్పుడు వేళ్ళమీద కొద్దిపాటి నొప్పి ంగుతుంది. అందువల్ల ఆవుల మందలో ఎక్కువ మంది చింతవిత్త ను ఎన్నుకుంటారు. ఆట ఆడేవాళ్ళకంటే గిల్లాలాటలో ప్రత్యర్థులే క్కువ జాగ్రత్తగా మెలగుతుంటారు. ఆడేవాళ్ల చేయి తగిలిగానీ, క అజాగ్రతవల్లగాని పక్క గిల్ల కదిలితే ఆట పోతుంది. అది ప్రత్యి కి లాభం. అందుకే ప్రత్యర్థులు చాలా జాగ్రత్తగానూ, ఏకాగ్రత నూ ఆడేవాళ్ల చేతివైపూ, గిల్లాలవైపూ చూస్తూవుంటారు. గిల్లా టలో సమయవర్తనాలను ఎప్పుడు ఏది అవసరమో అది ముందుగా నేస్తారు. కొందరు చేతిలోని గిల్లాలు కిందపడగానే అన్నీ ఏకరువు ెడతారు. ఎవరు ముందుగా ఈ మాటలు చెప్తారో వాటివల్ల కలిగే ్రయోజనం వారే పొందుతారు.

3, 1. మామూలు ఆటలో ఐదుగిల్లాలాటలోగాని, తొమ్మిది గిల్లాలాటలోగానీ నిర్ణయించుకున్న ప్రకారం ఐదు లేదా తొమ్మిదిసార్లు కేమారు (ఒకే అవకాశంలో) వీలుపడకపోతే ఆడినంతవరకు గుర్తుంచు ోవాలి. మరలా అవకాశం వచ్చినపుడు తక్కినవి పూర్తిచేసి మరొక ద్ధతిలోకి వెళ్లవచ్చు. ఐదు గిల్లాలాటలో 32 పద్ధతులు, తొమ్మిది గిల్లాలాటలో 13 పద్ధతులు ఆడుతారు. సమయవర్తనాలు వాడు ంటారు.

3, 2. మురుగుఆట :– మురుగు ఆటలో మామూలుఆటల్లో ే పద్ధతులన్నిటిని ఆడాలి. మురుగు ఆటలో కొన్ని నియమాలు ంటాయి. మురుగుఆట ఆడేటప్పుడు ముఖ్యంగా నోరుమూసుకోవాలి. ళ్లు కన్పించరాదు. పెదవి విప్పరాదు. ఒకవేళ పళ్లు కన్పిస్తే ్రత్యర్థి వెంటనే పసిగట్టి ఆట అవకాశాన్ని తీసుకోవచ్చు. నోరు ూసుకోకుండా మరొక అవకాశం వుంది. ఎడమచేతి బొటనవేలి ోరును పిడికిలిలో కన్పించకుండా మూసుకోవచ్చు. ఆట ఆడుతున్నంత ్పు ఇది బయట పడరాదు. మురుగు ఆటలో ఐదుసార్లుగానీ, తొమ్మిదిసార్లుగానీ పూర్తిగా ఆడవలసిందే. సగం ఆడిన తర్వాత ఆట పోతే అవి గుర్తుంచుకొని తర్వాత లెక్కించుకొని పూర్తిచేసుకునే అవ కాశం ఉండదు. నోరుమూసుకుంటే చేతివేళ్ళతో లెక్కించవచ్చు. చేతి గోరు మూసుకుంటే నోటిలో లెక్కించవచ్చు.

ఆవుల మందకు మామూలు ఆట, మురుగు ఆటలు ఉండవు. ఐదు గిల్లాలాట, తొమ్మిది గిల్లాలాటలకు మాత్రమే ఉంటాయి.

## 4 సమయవర్తనాలు

గిల్లాలాటలో సమయవర్తనాలు చాలఎక్కువగా తోడ్పడతాయి. ఆట ఆడేవాళ్ళకు ఆట జారిపోకుండానూ, ప్రత్యర్థికి ఆట ఆడే అవ కాశాన్ని తెచ్చిపెట్టేవిగానూ ఉంటాయి. ఆడేవాళ్ళకు రక్షక కవచాలు, ప్రత్యర్థికి వరాలు,

ఇవిమొత్తం ఏడు, వీటిని అన్ని ఆటలలో వాడవచ్చు.

4, 1. ఎత్తెళ్ళు :– ఆట ఆడేవ్యక్తి ఈమాట ముందుగా చెప్పి నట్లైతే దీనివల్ల కలిగే ప్రయోజనాన్ని పొందవచ్చు. ఒక్కొకమారు – పైకి ఎగురవేసిన గిల్లను సరిగా పట్టుకొనలేకపోవచ్చు. అపుడు దాన్ని మరలా చేతితో పైకెగిరేటట్లు తట్టి కిందపడకుండా పట్టుకోవచ్చు. ఒక్కొక్కమారు పైనుంచి వచ్చేగిల్లను పట్టుకున్నతర్వాత చిందిగాని, ఎగిరిగానీ పడుతుంది. అది కిందపడకుండా చేతితో పట్టుకోవచ్చు. 'ఎత్తెళ్ళో' అనేమాటను ప్రత్యర్థిగనుక ముందుగా చెప్పినట్లైతే పైవాటిలో ఏదిజరిగినా ఆట అవకాశం ప్రత్యర్థికే వస్తుంది.

4, 2. కాలికంకణం (లేదా) కాలికరక్కాయ :– గిల్లలు కాళ్ళ దగ్గర పడినపుడు ఈమాట ముందుగా చెప్పినట్లైతే కాలు పక్కకుతీసి గిల్లలు కొట్టుకోవచ్చు. ప్రత్యర్థిముందుగా చెప్పినట్లైతే కాలుకదపకుండా గిల్లలు కొట్టాలి. కొంచెం కష్టం.

4, 3. జరుగుడు – మురుగుళ్ళు :– ఈమాటను ఆడేవాళ్ళు చెప్పినట్లైతే అనుకూలమైనచోటకు జరిగి గిల్లలను కొట్టుకోవచ్చు. ప్రత్యర్థిముందు చెప్పితే ఆడేవాళ్ళు కదలటానికి వీల్లేదు.

4, 4. జోళ్ళు :– మూటలు, రొంటెలలో కిందవేసిన గిల్లలు అన్నీ ఒకేచోటపడి ఆడటానికి వీలుపడకపోవచ్చు. "జోళ్ళో" అనిచెప్పి అన్నిటిని కలిపి కొట్టుకొని ఒకసారి ఆడినట్లుగా లెక్కించుకోవచ్చు. ప్రత్యర్థి ముందుచెబితే ఆడేవాళ్ళు కలిపికొట్టటానికి వీల్లేదు.

4, 5. చేతికనక్కాయ :- చేతుల దగ్గరపడిన గిల్లాలు కొట్టు కోటానికి ఈమాట అంటారు. చేతులు పక్కకు తొలగించి కొట్టుకోవచ్చు ప్రత్యర్థి ఈమాటచెప్పితే చేతులు కదలకుండా కొట్టాలి.

4,6. తిరుగుడు - మురుగుళ్ళు :- కూర్చున్నచోటునుంచి ఎటు వైపునకైనా తిరిగి గిల్లాలాడుకోవచ్చు. వీలుకాని పరిస్థితిని గమనించి ఈమాటను వెంటనే చెబుతారు. ప్రత్యర్థి చెప్పితే కదలకుండా ఆడాలి.

## 5 ముగింపు

ఇట్లు పల్నాటిసీమలో ఐదుగిల్లాలాట, తొమ్మిదిగిల్లాలాట, ఆవులమంద అనేవి విస్తృత ప్రచారంలో ఉన్నాయి. అన్నిప్రాంతాలలో ఈయాటను తులనాత్మకంగా పరిశీలిస్తే ఇంకా ఎన్నోపద్ధతులు వెలుగు లోకిరావచ్చు.

## ఆధారగ్రంథపట్టిక


1. కళాపూర్ణోదయం.
2. జైమినీభారతం (అశ్వమేధపర్వం)
3. తెలుగువ్యుత్పత్తిపదకోశం, ప్రథమసంపుటం.
4. తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు - డా॥ వి. సుబ్రహ్మణ్యం పి ఎచ్. డి. సిద్ధాంతవ్యాసగ్రంథం, నాగార్జున విశ్వవిద్యాలయం
5. పండితారాధ్య చరిత్ర
6. పాంచాలీపరిణయం
7. బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు
8. భోజరాజీయం
9. మిన్నేరు - నేదునూరిగంగాధరం
10. యయాతిచరిత్ర
11. రామాభ్యుదయం
12. రుక్మిణీ పరిణయం
13. వసు చరిత్ర
14. విజ్ఞాన సర్వస్వం నాల్గవ సంపుటం
15. శబ్దరత్నాకరం
16. శబ్దార్థచంద్రిక
17. సూర్యరాయాంధ్ర నిఘంటువు
18. హంసవింశతి


## అ ధో జ్ఞా పి క లు

1. పాంచాలీ పరిణయం, 1-57.
2. కళాపూర్ణోదయం, 6-209,
3. వసుచరిత్ర, 4 ఆ.
4. భోజరాజీయం, 5-76,
5. హంసవింశతి, 5-155.
6. రుక్మిణీపరిణయం, 1-86.
7. రామాభ్యుదయం,5-121.
8. యతాతిచరిత్ర, 3-151
9. పండితారాధ్యచరిత్ర. 160పు.
10. జైమినీ భారతం, 1-55.
11. తెలుగు వ్యుత్పత్తి పదకోశం, 1-23.

ఈ యాటకు విషయం పల్నాటి సీమనుంచి సేకరించడం జరి గింది. కాబట్టి ముందు ముందు ఈ వ్యాసంలో "గిల్లాలు" అనేమాట ఎక్కువగా వాడబడింది.

విషయ వివరణ ఇచ్చినవారు:

1. జూకూరు మంగమ్మ, 30 సం॥ లు, గురజాల
2. నామసాని పున్నమ్మ, 30 సం॥ పోలేపల్లి, మాచర్ల తాలూకా
3. పిన్నెల్లి ఆదెమ్మ, 35 సం॥ ఒప్పిచర్ల, గురజాల తాలూకా
4. రామినేని పిచ్చమ్మ 45 సం॥ ఆత్మకూరు, మాచర్ల తాలూకా
5. శాగం గాలెమ్మ, 35 సం॥ తాళ్ళపల్లి, మాచర్ల తాలూకా

# హృదయనేత్రం

## శ్రీ తిరునగరి

హృదయం
తేజోదర్పణం
అదినీ అందాల్నే కాదు
వికారాలనూ చూపిస్తుంది

హృదయం
ఆచార్య హృదయం
అది గుణాల్నే కాదు
దోషాల్ని ఎత్తిచూపిస్తుంది

హృదయం
ప్రియ మిత్రం
అది నీ ప్రతిభను స్తుతించడమేకాదు
నీ మాంద్యాన్ని నిష్ఠురంగా నిరసిస్తుంది

హృదయం
దివ్య నేత్రం
అది నీకు ఉజ్వల భవిష్యన్మార్గాన్ని చూపడమేకాదు
నీ వ్యర్థ గమనాన్ని ప్రశ్నిస్తుంది

హృదయం
జీవన సర్వస్వం
అది నీ బ్రతుకును వసంతోద్యానంలో పరిమళింపజేస్తుంది
కంటకారణ్యాల బడి పోకుండా సదా నిన్ను కాపాడుతుంది

హృదయం
నేత్రం
అది నీకు ఉజ్వల భవిష్యన్మార్గాన్ని చూపిస్తుంది.



*



# తరగని గని

పాలడుగు వెంకటేశ్వరరావు

అంతకు కొన్ని నిముషాల ముందే –

మునిమాపు చీకటి పడింది. దీపాలు వెలిగేయి.

నలుగురు కుర్రాళ్ళు కేరింతలుకొడుతూ వీధి వెంట సాగిపోయేరు. వాళ్ళముందు ఇద్దరు ఆడపిల్లలు వెడుతున్నారు. పకపకలు. వికవికలు. ఈ కుర్రాళ్ళ గొడవకి ఆడపిల్లలు మా ఇదయిపోతున్నారు. బాధపడిపోతున్నారు. కళ్ళవెంట నీళ్ళు పెట్టుకుని మెలికలు తిరిగిపోతూ వున్నారు.

ఇది తప్పు. వయసు చిలిపితనం. అనాగరీకం. తెలియనితనం.

'తప్పుబాబూ' అని, వాళ్ళకి చెప్పేవారు లేరు. అందువ వాళ్ళదగ్గరకి వెళ్ళి చెపుదామని అనుకుని – 'తప్పుబాబూ' అన్నా తనకి తోచింది చెప్పేడు. సిన్సియర్‌గానే అన్నాడు.

వాళ్ళు ఆగారు. తీక్షణంగా చూసేరు అతన్ని. కోపం బుసలు కొట్టేరు. కళ్ళెర్రజేసారు.

అతని నలిగి మాసిన బట్టలు ! రేగిన జుట్టు. ఎర్రగా ఆ లోతుకుపోయిన కళ్ళు. అస్తిపంజరం వంటి ఆకారం. – అందు ఒకడు అతని కాలరు పట్టుకున్నాడు. ఎడాపెడా మొరటుగా గుండె

'ఎవ్రడ్రా నువ్వు? నీకెన్ని గుండెలు!?'

'నేను ... నేనే' గింజుకున్నాడు అతను. వదిలించుకో లేడు.

'అహే! వీడు వీడేనటరోయ్?! - నవ్వు.

'మందు కొట్టినట్టున్నాడ్రా, సన్నాసి? ఏరా? ఏంటి కథా?'

'వళ్ళు చిమచిమలాడ్తూ వుందేవిట్రా, వీరేశ్వర్? అయితే క్కో మా తడాఖా'

నలుగురూ పటపటమని నాలుగు వాయించేరు. అతని చొక్కా ంది. బుగ్గలు వాచేయి.

'ఇక చాల్లెండిరా. పదండి పదండి. ఫస్ట్ షో టయిమయి ంది.' అనుకుంటూ అతన్ని వదిలేసి, వాళ్ళు చకచకా సాగి పేరు. అలా జరిగింది కొన్ని క్షణాలలోనే — అంతా! అతన్కి మంటగా వుంది. నొప్పిగా ఉంది. నీరసం, నిస్త్రాణా అనిపించింది. ంలకి కమిలిన చర్మం చిమచిమలాడింది. మంటపెట్టింది.

రేగిన జుట్టు సరిచేసుకుని, నిలబడి - వాళ్ళనే చూస్తు వుండి పేడు, అతను. ఏది తప్పు? ఏది ఒప్పు? విచిత్రమయిన మాజిక పరిస్థితుల్లో వీటిని నిర్వచించటం ఎల్లా? వాటి వాటిని చీసి చెప్పగలగటాన్కి, 'ఒకడు' సంపాదించుకోవలసిన అర్హత టి? ఇట్లా జరిగిందేమిటి? తనేం చేయబోయేడు? ఏమయిందీ?

దవడ కలుక్కుమంది. మహబాగా వాయించేరు కుర్రవాళ్ళు!

'అమ్మా' అని అప్రయత్నంగానే అనేసేడు అతను. నొప్పి. పున్నూ.

అమ్మ!

అమ్మ - తనబిడ్డ అడ్డాలలో వున్నప్పుడే - భర్తపోతే - అ నే నమ్ముకుని పువ్వులాగ కళ్ళల్లోపెట్టి. పెంచుకునింది. రెక్కలు క్కలు చేసుకుని సంపాదించి తన బిడ్డని విద్యావంతుడుగానూ యోజకుడుగానూ చేయాలని తాపత్రయపడింది. ప్రయత్నాలు ంది.

'అమ్మా. డబ్బుకావాలే' అంటే — 'తీసుకోబాబూ' అంటూ — దించింది. 'ఎందుకు?' అని అడగలేదు. 'తగలెయ్యకురా' అని ంలు చెప్పలేదు. అమ్మ రక్తాన్ని డబ్బుగా అందుకుని అతనూ —

'ఒకరోజు' అలాగే తిరిగేడు. తెగిన గాలిపటంలాగ లక్ష్యాన్ని చేడు.

స్నేహితుల్తో కలిసి ఆడపిల్లల్ని ఏడిపించేడు. ఆకతాయి గాలు వేశేడు.

చదువు ఎగ్గొట్టి సినిమాలు చూసేడు. రోడ్లు సర్వే చేసేడు - పూరికినే.

పేకాడేడు, పుషారుషారుగా.

డబ్బుపెట్టి మజాచేసేడు.

బట్ట నలగనివ్వలేదు.

క్రాపు చెరగనివ్వలేదు. కాలు కందనీయలేదు.

గిర్రున రోజులు తిరిగి - అతివిలువయిన కాలం గడిచిపోయి - కేవలం పుచ్చిపోయిన శరీరాన్ని - అప్రయోజకత్వాన్నీ, మిగుల్చుకొని పారసయిట్ లాగా మిగిలిపోయేడు.

ఏవీ ఆ రోజులు?

ఏరీ ఆ స్నేహితులు?

ఎక్కడా ఆ సర్దాలు?

జారిపోయిన రోజుల్ని ఎలాగా అంది పుచ్చుకోవటం?!

పండిన శరీరంతో వాడివత్తలయిన కాలు చేతులతో ఇంకా నిరంతరంశ్రమిస్తూ తనకోసమే రక్తాన్ని చమటగా కారుస్తూ, ఆశగా కొడుకు భవిష్యత్తు గురించే కలలుకంటూ వున్న అమ్మకి వాస్తవాన్ని తెలపటం ఎలా?

భయంకర మయిన ఆ నిజాల్ని తెలుసుకుంటే ముసలిప్రాణం ఆషాక్ కి తట్టుకొని నిలబడ గలుగుతుందా?!

క్కిరుమంటూ ఒకకారు ఆగింది - సడన్ బ్రేకుతో.

ఫూల్! రోడ్డుమధ్యన నిలబడి ఏంచేస్తున్నావ్?! చావా లనుందా? - సూటిప్రశ్న వచ్చింది. తనకి చావాలని లేదని అడ్డంగా తలూపి - ప్రక్కకి తొలిగాడు అతను. కారు సాగిపోయింది. ఆకారు వెనుకనే ఒకరిక్షావెళ్ళింది. రెండుసైకిళ్ళువెళ్ళాయి. ఇద్దరు నడివయసు మనుషులు ఏదో విషయంమీద ఘర్షణపడుతూ సాగిపోయారు.

అవును. ఆరోజులు ఇక అందవు. వేగంగా దొర్లిపోయాయి.

ఆస్నేహితులూ - ఎవరిదార్ని వాళ్ళు వెళ్ళిపోయారు. ఇపుడు ఎదురయినాకూడా గుర్తించి పలకరిస్తారో లేదో — అనుమానం! ఆ సర్దాలు అనుభవించటాన్కి ఓపికలేదు. డబ్బూలేదు. డబ్బు! ఈడబ్బు — తనసౌకర్యంకోసం మనిషి సృష్టించుకున్నటువంటిది. డబ్బు సంపాదించటం చాతకాని వాడికి, ఖర్చుపెట్టేహక్కులేదు. ఎందుకులేదు? ఎంతమందిని చూడటంలేదు? సరే. మహానుభావ. నువ్వూఖర్చుపెట్టూ. కాదన్నదెవరు? కానీ - ఏదీ? ఏమిటా ఖర్చుపెట్టటం? నీతలకాయని. ఆతలకాయలో ఆలోచనల్ని తావిచ్చి వాట్ని ఖర్చుపెట్టవోయ్, కామేశం! ఓకే?!

నవ్వుకున్నాడు, అతను.

ఆనవ్వుకి వెంటనే భయంకరమయిన ఆలోచన వచ్చింది. విషాదంలో ముంచివేసిందతన్ని. అవాళ వుదయమే - తన ముసలి తల్లిని డబ్బుకావాలని అడిగేడు - అతను. డబ్బాలో పోగేసిన చిల్లర డబ్బులు తెచ్చి ఇచ్చింది. ఆమె ! కొడుకు దోసిట్లో పోసింది.

'నాన్న. ఇదివరకట్లా నా వంట్లో ఓపిక లేదురా. సంపాదనా లేదు. నాకాలుచేతులు పడిపోయే పరిస్థితికి వచ్చాయిరా.' - గాజుకళ్ళతో వాత్సల్యంగాచూస్తూ ఆమె, నవ్వింది. ప్రేమగా బుజంమీద చేయివేసింది. ఆవెంటనే వెక్కి వెక్కిఏడ్చింది. అతని గుండెల్లో మొహందాచుకుని గట్టిగా ఏడ్చింది. అతన్ని కావిలించుకుని బావురుమంది. అతని వంటిని ఆప్యాయంగా నిమిరింది. - అతనితల్లి.

అతను భయంభయంగా ఆమె మొహంలోకి చూసాడు.

'నాప్రాణం ఎప్పుడో ఎగిరి పోతుంది. అప్పుడు నిన్నెవరు చూసుకుంటారు బాబు ?! నీకు ఏమయినా కావలసివస్తే, ఎవర్నడుగుతావురా, కన్నా ! ఎలా ? ఎలా ?' అంటూ ఆమె గొణిగింది, గద్గద స్వరంతో దిగులుతో కుమిలి పోయింది.

అతను వులికి పడ్డాడు !

అస్పష్టమయిన భయం అతన్ని కబళించాలని చూసింది. దాని ప్రయత్నాలను భగ్నం చేయాలని అతను, నిలబడి, పోరాటం సాగించాలని ప్రయత్నించాడు.

అది ఇంకా - సాగుతూనే వుంది. అంతర్మధనం. అస్తిత్వం కోసం ఆరాటం ! ఆలోచనల్ని అవతలిక్కితోసి, నిర్లక్ష్యంగా తలఎగరేసి - అతను చకచకా నడిచాడు.

అతని పళ్ళుతీపులు పెడుతోంది. మొహంమంటగావుంది. చర్మం చిట్లి ఎర్రగా చారలు పెట్టుకుంది. బ్రతుకే ఏర్రని మంటగామారి, భయం గొల్పటానిక్కి ప్రయత్నిస్తోంది.

అతను చకచకా నడిచేడు.

దుమ్ము, ధూళితోనిండిన రోడ్లని గడిచి సిమెంటుచేసిన మెయిన్ రోడ్డు ఎక్కేడు. కాళ్ళు నొప్పులు పెడుతూవున్నా లెక్కచెయ్యకుండా నడిచి మెయిన్‌రోడ్ చివరకి వెళ్ళేడు.

రేకులు, డబ్బాలు, ఇంజన్లు, చెడిపోయిన లారీలు, జీపులు. ఆ 'గారేజీ' రణరంగంలాగా వుంది. టూల్సు పట్టుకుని టంగ్ టంగ్ మనిపిస్తూ, ఆయిలు మరకలయిన కాకిబట్టల్తో పనిచేస్తూ వున్నారు కుర్రవాళ్ళు. చెడిపోయిన ఇంజన్లని మరామత్తుచేసి పంపించే కృషిలో నిమగ్నమయి వున్నారు - అక్కడివాళ్లు. క్షణమన్నా తీరికలేని నిరంతర వ్యాసంగం.

ఆ గేటులో నిలబడి వున్నాడు ఒక భయంకరాకారుడు. మిడిగుడ్లు. రేగిన దుబ్బు జుత్తు. ఆరడుగులు ఆజానుబాహువు. అతను ఆ 'గారేజీ' యజమాని. 'అతన్ని' గుర్తించాడు, అతను. 'అతనే' 'అబ్బయ్య' కి తండ్రి. రాత్రింబవళ్ళు కష్టించి పనిచేసి పైకివచ్చి ఇప్పటికి ఒక గారేజీ యజమాని అయాడు ! అబ్బయ్య ఎప్పుడో - ఇంట్లోంచి కొంతపైకం తస్కరించి దేశాలుపట్టి పోయాడు. కాల్నిలవని, వళ్ళువంగని అబ్బయ్య ఇప్పుడు ఎక్కడ వున్నాడో ! ఆ రోజుల్లో అబ్బయ్య అతని ముఖ్య స్నేహితుడు.

'ఏం గావాలి ?' - అతన్ని చూసి 'అబ్బయ్య తండ్రి' అడిగాడు. అతను తిన్నగా వెళ్ళి 'అతని' ముందు నిలబడ్డాడు. తల వంచుకుని -

'పని కావాలి' అని అడిగాడు సూటిగా.

'ఏం పని చేస్తావు ?' అబ్బయ తండ్రి, అడిగాడు.

'ఏదయినా సరే. నేను అబ్బయ్యకు స్నేహితుడిని.'

'తెలుసు ! ఆపని చేస్తావా?' - మొహమంతా చమట్లతో, ఇంజన్లతో కుస్తీ పడుతున్న కుర్రాళ్ళని చూపించాడు - అబ్బయ్య తండ్రి, అతనికి.

'చేస్తాను'

'ఎంతగావాలి'

'ఎంతయినా సరే'

'ఎప్పుడు చేరతావు ?'

'ఇప్పుడే. ఈ క్షణమే'

'అయితే - సరే. నా వెంట రా.' అన్న, అబ్బయ్య తండ్రి వెంట వెళ్ళేడతను. అబ్బయ్యతండ్రి బట్టలు మార్చుకుని రంగంలోకి దిగాడు. ఇంజన్ని వూడదీసి రిపేరు పూర్తిచేసేసరికి అర్థరాత్రి దాటింది. 'ఇక ఇవాల్టికిచాలు. రేపు ఆరింటికిరా.' అని -పొమ్మన్నాడు అబ్బయ్యతండ్రి. అతను బయటపడ్డాడు. చల్లనిగాలి వీచింది. నిబ్బరంగా అడుగులువేసి ఇంటివయిపు సాగాడు అతను.

అతను ఇల్లు చేరబోతూండగా - భయంతో పరుగులుపెడ్తున్న ఒక యువతీ, ఆమెను వెంటాడ్తున్న ఇద్దరురోమియోలు, ఎదురయారు. ఆమె గజగజ వణికిపోతూ వుంది. వచ్చి అమాంతం అతని ఎదర కూలబడింది. నరికిన అరటి బోదెలాగా.

'నన్ను రక్షించండి. ఆ రాక్షసులు నా ప్రాణాలు తీస్తారు' అంది దీనంగా, ఆమె.

వాళ్ళు చిరుతపులుల్లాగ వచ్చారు. ఆమె వెనకాలనే.

ఎర్రకళ్ళ, గళ్ళచొక్కావాడు ఆమెను జుట్టు పట్టుకుని పైకెత్తాడు, రాక్షసంగా.

దుబ్బుజుత్తువాడు ఛళ్ళున ఆమెమొహం మీద కొట్టాడు, కసిగా, బలంగా.

'ఆగండి' అన్నాడతను.

వాళ్ళు క్రూరంగా అతన్ని చూసారు.

'ఏమిటీ దౌర్జన్యం ? !'

'ఏమిటి బే ?'

'ఎవర్డా నువ్వూ ?'

'మర్యాదగా నీదార్ని నువు పో. నీకనవసరం'

'నీకు ప్రాణాలమీద ఆశలేదా ?' – అని వాళ్ళు ఆ అమ్మాయిని చిత్రహింసలు పెట్టసాగారు. ఆమె జుట్టుచిందర వందరయింది. చీరచిరిగి పోయింది. ఆమె శరీరం వాళ్ళ దవుర్జన్యానికి గురవుతుంది. నిస్సహాయంగా మూల్గింది ఆమె. ఒకస్త్రీని శిక్షించటాన్కి ఎగబడ్తున్నారు వాళ్ళు! మగధీరులు. అసమాన మయిన ప్రతాప విరాజితశూరులు !

' అమ్మా ' బాధగా మూలిగింది ఆమె. గిలగిలలాడింది. వల వలా ఏడ్చింది.

ఆమె మొహాన్ని కరిచాడు గళ్ళచొక్కావాడు, ఒకజంతువు లాగా. ఎర్రగా అయింది ! అదిచూసి అతని గుండెల్లో మంటరేగింది. ఎక్కడలేని శక్తితో, ఎగిరి ఒక్కతన్ను తన్నాడు, ఆ ఇద్దరినీ. పది నిముషాలపాటు ముష్టియుద్ధంసాగింది. ఆయాసంతోవగర్చి, దెబ్బలుతిని వాళ్ళు ఇద్దరూ కాలికి బుద్ధిచెప్పారు. ఎక్కడిదీ బలం ? ! మొత్తాన్కి తనూ బలవంతుడే ! శౌర్యంగలవాడే !

ఆమె ఏడ్చింది.

' ఇక ఫర్లేదు. వెంటనే ఇంటికివెళ్ళు ' – అన్నాడతను.

ఆమె ఏడ్చింది.

' నాకూ ఇల్లు లేదు ' అంది.

' అయితే సరే. మాఇంటికిరా. ' అని అతనునడిచాడు. ఆమె అతన్ని అనుసరించింది. అతని వెనక నడుస్తూనే – తనకథ చెప్పింది.

తల్లిలేదు. తండ్రి రెండోపెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లిపోరు. తండ్రి నిస్సహాయత. సవతితల్లికి ఆమెమీదపగ. అపగతోనే జులాయిగా తిరుగుతున్న – తనతమ్ముడికి కట్టబెట్టాలని చూసింది. ఆమె తప్పించుకుని పారిపోయింది. వాళ్ళు వెంటబడ్డారు. ఆగళ్ళచొక్కా వాడే ఆమె సవతితల్లి తమ్ముడు !

గుమ్మంలోనే – కూర్చుని వుండిపోయి–

గాజుకళ్ళతో అతనికోసం ఎదురు తెన్నులు చూస్తూవుంది అతని తల్లి.

' నాన్నా. ఇప్పటిదాకా ఎక్కడికెళ్ళావు ? ' అని అడిగింది ఆదుర్దాగా

' పన్లోకి వెళ్ళానమ్మా. '

' పనా ? ! '

' ఆ పన్చేస్తున్నాను. పన్చేయ్యకపోతే డబ్బు ఎక్కడ్నుంచొస్తుంది ! నిన్ను ఎలాచూసుకోనూ ? నేనుగాకపోతే నిన్ను మరెవరు చూస్తారు ? ' అన్నాడు, ఆర్ద్రంగా.

అమ్మ ముసలిమొహంలో ఆనందం ఘండటం అతను గమనించాడు, అతను తృప్తిగా నిట్టూర్చాడు. క్రీనీడలోనుంచున్న ' ఆమె ' ని గమనించింది ముసలామె. అది గ్రహించి – ' ఈమె నాస్నేహితురాలు. నేను ఇంట్లోలేనప్పుడు నిన్ను చూసుకుంటుందని నీకు సాయంగా వుంటుందని, తీసుకొని వచ్చాను. లేకపోతే ఎలా ? ' అన్నాడు.

అమ్మ ఆమోదసూచకంగా తల ఆడించింది.

దొడ్లో కాలుచేతులు కడుగుకుని, తువాలుతో మొహం తుడుచుకుంటూ వసారా గుమ్మంలోకి వచ్చాడతను.

మనిషికి అర్హత కావాలి. తన కాళ్ళమీద తను నిలబడ్నప్పుడే ఆ అర్హత అతనికి అంది వస్తుంది– ఋజువయిన జీవనమార్గం వెంట బ్రతుకు బండి సులువుగా నడవగలుగుతుంది. ఆత్మ విశ్వాసమే దాని ఇంధనం. ఆ ఇంధనం పుష్కలంగా లభించే తరగని గని ఇన్నాళ్ళకి తనకి కనిపించింది. అదే తన తృప్తి.

లోపల్నుంచి అమ్మ పిలిచింది. అతను ఆలోచనల్ను ఆపి వెనుదిరిగేడు. లోపలికి వెళ్ళబోతూ అతను స్విచ్ వేసేడు.

దీపం వెలిగింది !

చీకటి, దాన్ని ఆవరించుకుని వున్న భయం దూరంగా పారిపోయాయి. ఎంతో సంతోషంతో – అతను భోజనాన్కి వెళ్ళేడు.

((((((•))))))

# విరహాంకానికి తెర

డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డి

ఈ సిరాబిందువుల్లా
కన్నీళ్ల నాబాధల్ని
నీ చెవిలో వూదగలిగితే
నీ ఎదపొత్తంపై రాయగలిగితే
ఎన్ని యుగాల వూసుల్ని వూదుతాయో !
ఎన్ని గాథల బాధల్ని విప్పుతాయో!!

> ఇప్పుడొస్తావ్
> ఇంకాస్సేపటికొస్తావ్
> అనుకుంటూ
> అనుక్షణం నిరీక్షిస్తూ
> కళ్లు కాయలుకాచేలా
> వొళ్లంతా కళ్లుచేసుకొని
> నీకోసం
> నీ ఆగమనం కోసం

తనువు అలాగేవుంది, కానీ
మనసు మరీ 'వీక్' అయిపోతోంది
మాటిమాటికీ
ఆశ్రయాన్ని వెదికే తీగలా
విడదీబోతే కుంటుపడ్తూ
కొంతదేహాన్ని కోల్పోతూ

> నువ్వు చెంత కల్పవృక్షంలా లేకపోతే
> అణువణువునా నన్నల్లించుకోకపోతే
> మృత్యుధూళిలో
> తుది శ్వాసతో నేను

వయసు మీరేకొద్దీ
వద్దనువ్వులేకున్నా
వుండాల్సిందిపోయి
ఇదేమిటి ?
నువులేకుండా నిలిచేందుకు
క్షణమైనా జంకుగా

ఏండ్లుపైబడేకొద్దీ
శిశుత్వం వస్తోందా !
అమ్మచల్లనివొడికోసం
తాపత్రయం నాడు
నీ వెచ్చనివొడి బడిగా
తమితో తపనతో నేడు
నామెదడులోని వ్యథా తరంగాల్ని
కొల్చేందుకు ఊపిచ్చిగీతలు
ఏమూలకు ?
అందుకే మళ్లీ
నా మేథాసమాధిలోకివెళ్తా
నీతో ఆడుకున్న వూసుల్ని
పంచుకొన్న మధురస్మృతుల్ని
కలలగనుల్ని త్రవ్వి
తలకు పోసుకుంటా !!

"ఇదేం పిచ్చివాడు ?
రాలేనందుకు కారణాల్ని
వినడు - చెప్పనీడు
అదంతా నాకనవసరం
ఎందుకురాలేదు ? - అంటాడు
అమావాస్యరా బాబు
చందమామ వుండదు - అంటే
ఊహూఁహూ ! నాక్కావాల్సిందే
చందమామ - అనే
అమాయక మొండిపిల్లవాడికి
నీకూ ఏం భేదం ?"
అంటావేమో నువ్వు
"భేదముందని నేం చెప్పటంలేదే !
అసలెందుకుండాలి భేదం ?
చందమామను తెచ్చిస్తుందోలేదో తల్లి
వాటి కనవసరం !
నీవు రాకపోవడానికి చెప్పేకారణాలు
నాకూ అనవసరం !!"

నీవు దగ్గరేకపోతే
ఎంత నీరసం
కోపం, తాపం, నిస్సహాయత
ఒకటేమిటి ? అన్నీ ! అన్నీ !
ఆకోపంలో ఏమనుకున్నానో
అవిచేస్తే !
వందవాచీలు, వందపెన్నులు
నా రచనల పుస్తకాలు
నా తల్లోని వేలాది వెంట్రుకలు
ఎన్నోతలలు
ఛిన్నాభిన్న మయ్యేవి

ఌవ్ ఇపుడు రావనుకుంటే
న, తాగ బుద్ధిగాదు
దువుపై బుద్ధిపోదు
ద్రపో మనసొప్పదు
ందుకే అంతులేని ఆవేదన
త్రులక్షణాల వేటినిట్టూర్పులతుమ్మలో
మిలిపోతూ
ళ్లిపోతూ

నేను వస్తుంటే
నువ్వొస్తావా ?
ఊపిరున్నన్నాళ్లూ
సిద్ధమే వస్తుండేందుకు

ను నీకర్పించింది
శరీరాన్నేనా ?
దు — కాదు
నసునూ, ప్రాణాన్నికూడా
ందుకే, నువ్ లేనప్పుడు
చెప్పుచేతల్లో వుండవవి

తాకట్టుపెట్టిన సొమ్మును
విడిపించుకోవచ్చు గానీ
మార్వాడీలను మించిన నీకు
ఏం వడ్డీచెల్లించి
నామనసును విడిపించుకోగల్ను
ప్రేమ వడ్డీని ముందే
సమర్పించుకున్న
బుక్కాఫకీరుగాణ్ణి !

నీవిక్కడలేనప్పుడల్లా
నాకేదో చిత్రవధ
నరనరాల్లో వ్యధ
"కారణం నీమనోదౌర్బల్యమే
మగనికి దూరంగా భార్యలు
వుండరా కొన్నాళ్లు
ఇలాగే ఏడ్చి
మొత్తుకుంటుంటారా మొగుళ్లు ?"
అంటావు నువ్వు
నిజమే నాలా వుండరు
పొగో మందో
మరో మగువో
వాళ్లకు తోడుంటుంది
పెళ్లాన్ని కాస్తయినా మరిచేందుకు
మరినాకో ?

నీమీద ఒట్టుపెట్టించుకొని
పొగ మాన్పించావు
చుక్కమాటే ఎత్తవద్దన్నావు
మరోమగువ జోలికిపోయి
నాగొంతు కోస్తావా ? అన్నావు
అన్నివిధాలా బందీనినేను
భార్యావిధేయుణ్ణి నేను
మరణ శిక్షలో తాడు వాడ్డం
క్రూరమని కోర్టులెక్క
బతికి పోతున్నారు ఖైదీలు
నాకోర్కెల్ని నీవిరహంతాడుతో
వురివేయకు అని
అభ్యర్థించేందుకు నీవుతప్ప
ఏకోర్టుకు వెళ్లను ?

పోయినదశకంలోనేను సెక్సుపిచ్చిగాణ్ణి
ఇప్పుడు పెళ్లాం పిచ్చిగాణ్ణి
నువ్ నాకెదురుగా
నుంచుంటే చాలు
మూర్తీభవించిన ప్రేమలా
మరేమి కోరనుగాక కోరను

ఏంకావాలి నాకింకా
ఒక జన్మకు సరిపడా
ఆనందం పంచిచ్చావ్
పుష్కరంపాటు పుష్కలంగా
'కామం' కట్టిపెట్టి
'ప్రేమ'తో సరిపుచ్చుకోగల్ను

ఆరోజులేగదా డియర్
వారంకూడా తిరగలేదే
అంటావునువ్వు ఆశ్చర్యంగా
కాలాన్ని వారం మీటర్లతో
కొలుస్తావు నువ్వు
క్షణాల మిల్లిమీటర్లతోనేను
నీవు వద్దనుంటే నేను
కాలాన్ని సంవత్సరాల్తో కొల్చగల్ను
జీతంబిల్లుల్తో నెలల్ని
గుర్తుచేసుకోగల్ను
ఆనందాన్ని క్షణాల్తో లెక్కవేయగల్ను

నన్నింత క్షోభపెట్టే నిన్ను
వస్తూనే ఏంచేద్దామా ?
అనుకుంటాను క్రూరంగా
మిడతా అనుకుంటుంది
అగ్నిజ్వాలల్ని
అమాంతం మింగేద్దామని
నేనూఅంతే

నిన్నుచూస్తూనే
క్షణాలే యుగాలుగా
పడిన వేదనల్ని
కిటికీగుండా గిరాతేసి
నాశరీరాన్ని నీప్రేమకు
గుడిగా మలుచుకుంటాను
నీ వొడిని నాప్రేమ బడిగా
నిలుపుకుంటాను

అంతటితో విరహాంకానికి తెర
ప్రణయాంకానికి సిద్ధంగా మరోదృశ్యం



# మృత్యువు

ఇచ్ఛాపురపు రామచంద్రం

## సీరియల్

( గతసంచిక తరువాయి )

**2**

అక్కడ – వాతావరణం చాలా ఉత్సాహంగా ఉంది. ఆ హాలులో రంగురంగుల దీపాలు. అతిఖరీదయిన ఆసనాలు. విలాసవంత మయిన ... అద్భుతంగా అలంకరించబడిన – ఆ హాలులో పాతిక మంది కంటె లేరు. వారిలో ఒకడు చుక్కల్లో చంద్రుడిలా వెలిగి పోతున్నాడు.

అక్కడ – మంద్రస్థాయిలో సంగీతం ... మత్తుగా వొంపులు తిరుగుతోంది. చక్రవర్తులలా అలంకరించుకున్న సేవకులు అందిస్తున్న ఖరీదయిన విదేశీ మద్యాలు ఎడతెగకుండా పారుతున్నయ్. ప్రతిటేబులు మీదా చిన్న చిన్న కొండల్లా రకరకాల ఖాద్యాలు. వాటిలో మాంసాహారమే అధికం. అతిముఖ్యమయిన భాగంలో తప్ప మిగిలినచోట ఆచ్ఛాదన లేని అత్యంత సుందరీమణులు నలుగురు రంగురంగుల దీపకాంతులలో స్నానాలాడుతున్నట్లు మైకంగా నాట్యంచేస్తూ అతిథుల నత్యంత ఆనందపరవశులని గావిస్తున్నారు. ఉత్సాహమూ ఉల్లాసమూ ఉరకలు వేస్తున్నాయక్కడ.

అది – అమెరికా. సి. ఐ. ఎ. అనబడే సెంట్రల్ ఇంటలిజెన్స్ ఏజన్సీ సాధించిన ఘనవిజయానికి అభినందనసభ జరగబోతూందక్కడ. ముందుగా – యీ విందు. న్యూయార్క్ మహానగరంలో ఎవరికీ తెలియదీ విందు గురించి – అక్కడకు ఆహ్వానం అందిన అతిప్రముఖ రాజకీయనాయకులకూ తదితర – కొద్దిమందికీ తప్ప. వాళ్ళు అమెరికా రాజ్యాంగానికి మూలస్తంభాలు.

విందు పూర్తయింది. ఒక్కసారి నిశ్శబ్దం నెలకొంది. అమెరికన్ ప్రెసిడెంట్ – వేదికమీదకు వొచ్చాడు. ఏవిధమయిన

లాంఛనాలూ పాటించకుండా - సి. ఐ. ఏ. డైరెక్టరుని కనుసైగతో తనచెంతకు ఆహ్వానించాడు.

వాతావరణం నిశ్శబ్దంగానూ గంభీరంగానూ మారింది. కె జి.బి. కంటె ముందుగా - చురుకుగా విశేషమయిన వార్తను గ్రహించ గలిగినందుకుగాను సి.ఐ.ఏ. డైరెక్టర్ ఛార్లెస్ ను భుజంతట్టి అభినందిస్తూ - కర్తవ్యం గుర్తుచేశాడు ప్రెసిడెంట్. సోవియట్ రష్యా మీద లభించిన యీ ముందడుగును శాశ్వతంగా నిలిపి - అమెరికా పేరు ప్రతిష్టలు నిలుపమని కోరాడు. సి.ఐ.ఏ. డైరెక్టరు కృతజ్ఞతలు తెలిపి - అధ్యక్షుని అభినందనలు - తనకేకాక సి.ఐ.ఏ. అంతటికీ చెందుతాయన్నాడు. ముఖ్యంగా - భారతదేశంలోని సి.ఐ.ఏ. శాఖ చాలా అభినందనపాత్ర మన్నాడు. తెలుసుకున్న వార్త పూర్వాపరాలు విచారించడమేగాక దాని అభివృద్ధి మార్పులూ వగయిరాలను పరిశీలించేందుకై కట్టుదిట్టమయిన ఏర్పాట్లు జరిగాయని హామీ యిచ్చాడు. అభినందనసభ ముగిసింది.

* * *

అతిరహస్యం - బట్టబయలు.

పెదవిదాటితే - పృధివి దాటిందన్నమాటే. రెండింటికి రెండూ తిరుగులేని నిజాలు. లోకాన్ని ... మనుషుల మనస్తత్వాన్ని కాచి వడపోసి - నిగ్గుతేల్చిన నిజాలు.

33 పెదవిదాటిన పలుకు - పృథివంతా వ్యాపిస్తుంది. ఎటొచ్చీ కొంచెం కాలం పట్టవొచ్చు. అంతే. సి.ఐ.ఏ. డైరెక్టర్ని అభినందించిన ఐదవరోజున -

చైనా రహస్య సమావేశం జరిపింది. రాజకీయ ధురంధరులు.. పాలక ప్రముఖులు ... ఆర్థిక నిపుణులు ... ఒకరేమిటి ... వివిధ శాఖలకు చెందిన నిపుణులందరూ ఉన్నారాసమావేశంలో. శాస్త్రజ్ఞులలో మేటివారందరూ సభలో ఆసీనులైయున్నారు. అందరి ముఖాలలోనూ- ఏదో విపత్తు సంభవించబోతూందని తెలిసినట్లు ఆత్రతా .. భయమూ.. దిగులూ గూడుకట్టుకొని ఉన్నాయి. అక్కడందరూ ఎందుకో విపరీతంగా భయాక్రాంతులై ఉన్నారు. ఆహూతులకి అందించబడిన వేడి వేడి ఆకుపచ్చని అద్భుతమైన తేనీరు కూడా వారికి కొంచెమూ ఉల్లాసాన్ని కలిగించలేకపోతూంది.

ప్రధాని రావడం ... లాంఛనాలు నెరపడం ...సభ ప్రారంభ మయింది. వక్త కంఠం బహుభారంగా ఉంది. "స్నేహితులారా !..." సభనుద్దేశించి - సంబోధించి - ఒక క్షణం ఆగి వారందరి ముఖాలలోకి చూశాడు వక్త.

జనాభా దృష్ట్యా ప్రపంచంలో ప్రథమస్థానం చైనాదే. భారత దేశపు పొరుగుదేశమిది. ఈ దేశానికీ తనదంటూ సంస్కృతి ఉంది. ఆచార వ్యవహారాలున్నాయి చైనాను రూపొందించినదీ కొంతవర పార్టీయే. పాశ్చాత్య గాలులిక్కడ అంత బలంగా వీచలేవు. పడ నాగరికత యిక్కడ అంతగా తన ప్రభావం చూపజాలదు. తనదం సంస్కృతిని చైనాదేశం చాలా పట్టుదలగా కాపాడుకుంటూ వొస్తూ సగటు చైనీయుడికి తనసంస్కృతి అన్నా...పార్టీ అన్నా...దేశమ అత్యంత అభిమానం. ఈ దేశ చరిత్రలోకూడా పార్టీని పెంచే దించేందుకు ... పార్టీ వ్యతిరేక కలాప నిర్వాహకులకు 101 వ వంటి భయంకరమయిన శిక్షలుండేవి. పార్టీ ద్రోహులకు మొ చీకటికొట్టు ... జైలు. అక్కడ వారి శారీరక మానసిక శక్తుల చాలామట్టుకు హరించేస్తారు. ఎప్పుడో వస్తుంది ఆజ్ఞ ... ఖైదీ 101 వ గదిలోకి తీసుకొని వెళ్లబడతాడు. అక్కడ అతని మీ ఒక ఊచల బోను - దాదాపు ముసుగులాగ. అందులో అతనికి క చరణాలు ఆడవు. కదలికలకు అవకాశముండదు. ఆ బోను ఒక పె క్క్రరపెట్టె కభిముఖంగా - దానిని తగులుతూ నిలపెట్టబడి ఉంటుం ఆ బోనుకానుకొని ఉన్న క్కరపెట్టెలో - ఎలకలుంటాయి. ఎలకలం ఎలకలు కావు. పందికొక్కులంతేసి ఎలుకలు. వాటి కళ్లు గోళ్ల పెద్దవీ ప్రకాశించేవీ. ఆ యెలుకలసంగతి కొందరిల్లాళ్లకు బాగాతెలుస పసిపాపలను పరాకున వొంటరిగా వొదిలి- వంటింట్లోకి వెళ్లొచ్చేంతలో ఎలుకలు ఆ పాపలనెత్తుకుపోయి - ఎముకలయినా మిగల్చకుం తినేసిన ఉదంతాలు ఎన్నో ఎన్నెన్నో. ఆ మూషికసింహాల ముందు పెద్దవాళ్లే వొంటరిగా వెళ్లేందుకు భయపడతారు. వాటికి తెలివితే లెక్కువ. క్రూరత్వం ఎక్కువ ఆకలి మరీ ఎక్కువ. అటువం ఎలుకలలో గడ్డువి- యీ క్కరపెట్టెలో ఎదురుచూస్తూ ఉంటాయి"బలి కోసం - మహా ఆత్రతగా.

బోనులోబందీపై ప్రశ్నలపరంపర.అతనప్పటికే ఎన్నోవిధాలై శిక్షలకూ హింసలకూ గురిచేయబడి దాదాపు శూన్యం ఐపోతాడ చర్మందిగువ ఎముకలే తప్ప మాంసమూ కండలూ మిగలవు. మెదడు ఆలోచన మిగలదు. జీవచ్ఛవం ఐపోయి ఉంటాడు. ఐనా అతని వదలరు. అతని మెదడునుంచీ - రక్తంనుంచీ - పార్టీ వ్యతిరేకభా సంపూర్ణంగా లుప్తమయితే తప్ప అతను చనిపోయేందుకు కూ అర్హుడు కాడు. బందీ పూర్తిగా మారాక అప్పుడతని మీదకు ఎలుకల వదులుతారు. చెక్కపెట్టె తలుపు తెరచుకోడమే మిటి, ఎలుకలు .. పదులు ... వందలు ... వేల సంఖ్యలో బోనులోకి ఉరుకుతాం అమితోత్సాహంగా. నల్లని ... బలిష్టమయిన .... క్రూరమయిన .. ఆకలిగొన్న ... ఎలుకల సమూహం.

ఓ నిముషం ఆర్తనాదాలు ... హాహాకారాలు ... అం ఎలుకలు వెనక్కి - క్కరపెట్టెలోకి వొచ్చేస్తాయి బుద్ధిగా - ఏ

గనట్లు అవి కొంచెంసేపు కీచుకీచుమంటూ తమ అనుభవాలు ుకుంటాయి. "మనిషినాలుక ఎంత మెత్తగా రుచిగా ఉంటుందనీ!"

"మెదడులో- తడితడిగా ... ముద్ద ... అది బలే తియ్యన..."

" మానవుడి జననేంద్రియాల రుచి మరివేటికీ రాదు."

"ఎముకలు నమిలి - పొడిచేసి మింగుతూంటే ... ఆహ్ !"

అవి - మళ్లీ నిశ్శబ్దం ఐపోతాయి. గారడీ చేసినట్లు ఊచల నులో ఏమీ ఉండదు.

ఇలాగ - చైనాదేశమంటే - సంస్కృతి .... పోర్టీ.

"స్నేహితులారా! ..." మళ్లీ మొదలు కొచ్చాడు వక్త. కని గంభీరవదనం చూస్తూంటే - అతను మాటలు తూచి తూచి వదల్చుకున్నట్లుంది.

"భారతదేశం....మన పొరుగునున్న భారతదేశం - అవివేకంగా ంపెట్టిన ఒక వెర్రి పనివలన ఆ దేశమూ మనదేశమూ .... గావత్ప్రపంచమూ కూడా విపత్కర పరిస్థితిలో పడబోతూంది. పలే ప్రపంచ జనాభా హద్దుమీరి పెరిగిపోయింది. ముఖ్యంగా - చైనా, రతదేశాలు అత్యధిక జనాభా అనే రోగంతో తెగ బాధపడుతున్నాయి. టుంబనియంత్రణ ... పిల్లల పరిమితిని శాసించే చట్టాలు ... గా మందులన్నీ కొంచెం మేరకే పనిచేస్తున్నాయి తప్ప కావలసినంత భివృద్ధి చూపలేక పోతున్నాయి. అందుకే - ఉత్పత్తి నెంత పెంచినా ది ఏమాత్రమూ దేశంమీద కనిపించడంలేదు. మంది ఎక్కువయిన ద్దీ మజ్జిగ పల్చన అనేది సహజసత్యమే కదా ..." చిన్న విరామం. తను ఒక్కసారి మనసులో మావోని తలచుకున్నాడు ఇన్స్పిరేషన్ సం. అతని రక్తం వేడెక్కింది. గుండెలు పొంగాయి. ఉద్రేకం రిగింది.

"యుద్ధాలు, ... వ్యాధులు ... వరదలు ... వంటి ప్రకృతి రణాలుగా జనాభా తగ్గటంలేదు. అంటే - డెత్ రేట్ వలన జనాభా ద్దు కాపాడబడడంలేదు. నేటికాలంలో యుద్ధాలను ప్రకటించేందుకూ చ్చ లేదు. కూటములు అడ్డుపడతాయి. అంతర్జాతీయంగా విమర్శలు లరేగుతాయి. విషమపరిస్థితు లెదురౌతాయి. అందుకే ...యుద్ధాలు కనే ... దేశాలు జనాభా రోగంతో పీడించబడుతున్నాయి. ముఖ్యంగా ాడవ ప్రపంచదేశాలని - హేళనగా పిలవబడుతున్నా యనేకదేశాలు. టిలోనిదే భారతదేశమూ. జనాభా పెరుగుదలవల్ల ఆర్థికాభివృద్ధి లోపయి - ఏదేశం ముందుకయినా భిక్షాపాత్రతో సిద్ధమయ్యే భారత దేశం - యిటువంటి పిచ్చిపని తలపెట్టడం - కొరివితో తల గోక్కోడమే అని నేను ఘంటాపథంగా చెప్తున్నాను."

శ్రోతలు ఊపిరి బిగపట్టుకొని వింటున్నారు - వక్త ముఖం కండలు చించుకొని ఉద్రేకంగా ఉపన్యసిస్తూంటే. భారతదేశం తలపెట్టిన పిచ్చి పనేమిటో - అంతవరకూ తెలియని శ్రోతలు - అదేమిటో ఉపన్యాసం అయ్యేలోగా చెప్పకపోతాడా అని ఆత్రతతో ఎదురుచూస్తున్నారు. అతని మాటలు వింటూంటే - భారతదేశం తలపెట్టిన పని - చైనా దేశానికి పులిమీద పుట్రలాగే ఉందనిపించక మానదు. వక్త తెగ బాధపడుతున్నాడు. ఖేద పడిపోతున్నాడు. శ్రోతలని యిబ్బంది పెట్టేస్తున్నాడు.

వెయ్యక్షరాల - బొమ్మలలాటి లిపి చైనీయులది. అన్ని అక్షరాలూ రావడమే పాండిత్యం ఆ భాషలో. మావో సూక్తులు అక్కడ వేదాలూ ఉపనిషత్తులూ. కమ్యూనిజం తాలూకు రెండవశాఖ చైనాది. జనాభా ... వ్యవసాయ సంస్కృతుల విషయంలో భారత దేశానికి అక్కచెల్లి లాటిది చైనా దేశం. పొరుగుదేశాలు రెండూ.

అక్కడున్నది - చైనీయులందరి రిప్రజెంటేటివ్‌లూ. విషయం స్పష్టంగా తేలకపోయినా ... వక్త శాఖాచంక్రమణం గావిస్తున్నా - ఆ ప్రతినిధులు ... వారి వెనుక చైనీయులూ భయపడుతున్నారు.

విసుక్కుంటున్నారు. ఆ క్షణంలో వారికి భారతదేశం అంతటినీ నమిలి మింగేద్దామన్నంత ఆగ్రహంగా ఉంది.

వ్యాపారదేశంగా పరిగణించబడే బ్రిటన్‌కూడా ఇండియామీద కారాలూ మిరియాలూ నూరుతూనే ఉంది. ఉండి ఉండి ఇండియా కిటువంటి బుద్ధి పుట్టిందెందుకని ? ఇటువంటి ప్రాజెక్టులు విశ్వమానవ కళ్యాణానికి దోహదం చేస్తాయన్న పేరేకాని నిజానికి వాటివల్ల వొరిగేదేమీ ఉండదు మనిషికీ దేశానికీ. మనిషంటే వ్యాపారం. దేశ మంటే యుద్ధం. అదే సరయిన నిజం. దేశాలు ఒకదానితో ఒకటి యుద్ధం చేస్తూండాలి. వాళ్లకి ఆయుధాలు తాము సరఫరా చేస్తూఉండాలి. ఇదే సవ్యమయిన పద్ధతి. లేకపోతే ప్రపంచపు పరిస్థితే మారిపోతుంది. వ్యాపారమూ, యుద్ధమూ వీటిని మించినది మరేమీ లేదు. ఈ నిజం గ్రహించకుండా భారతదేశం పిచ్చిపనులు తలపెట్టడమేమిటి ? - విసుక్కుంది బ్రిటన్.

ఏదేమయినా - ఒక్కసారి ప్రపంచంలోని అన్నిదేశాల దృష్టి భారతదేశం వేపు ప్రసరించింది. భారతదేశాన్ని చూసి - అది తలపెట్టిన ప్రయోగం నిజమౌతుందేమో అని వాళ్లందరూ లోలోపల భయపడసాగారు. కచ్చితంగా చెప్పాలంటే - భారతదేశం తన ప్రయత్నంలో విఫలం కావాలని వెయ్యి విధాల కోరుకుంటున్నారందరూ.

అందుకు కారణం లేకపోలేదు.

గతమే తప్ప వర్తమానం లేని భారతదేశం తన పేదరికంతో మూడవ ప్రపంచదేశంగా దిగజారిపోయింది. చరిత్రలోనే తప్ప దానికి ఉన్నతమయిన స్థానమేమీ లేదు. ఏ దేశమయినా అభివృద్ధి చెందితే ఫరవాలేదుకాని అది తమను మించి పోతుందంటే యితర దేశాలకు కన్నెర్రగానే ఉంటుంది.

అదీకాక —

ప్రపంచ చరిత్రలోనే కొన్ని అంశాలు సువర్ణాక్షరాలతో లిఖించదగినవిగా ఉంటూంటాయి. అటువంటి వానిని సాధించడంలో ప్రతి దేశమూ శాయశక్తులా ప్రయత్నిస్తూంటుంది. ప్రపంచ చరిత్రలో 35 ఘనమైన స్థానం సంపాదించడమంటే సామాన్యం కాదు. ఆ దేశానికది అత్యంత గర్వకారణం.

భారతదేశం అటువంటి స్థానం సంపాదించబోతూందేమో అని యితర దేశాలు భయపడుతున్నాయి. అంతేకాదు. నిజంగా భారతదేశం కాని విజయం సాధిస్తే — మనిషి మనుగడకే మౌలికమయిన మార్పు వొస్తుంది. మనిషి ... జీవితం ... అతని ఆలోచన ... ప్రవర్తన... అన్నిటిలోనూ అద్భుతమయిన మార్పులు వొచ్చితీరతాయి. మానవ పరిణామ సిద్ధాంతం - తప్పని రుజువౌతుంది. ఇంతవరకూ ఒక క్రమంలోనూ దిశలోనూ వొస్తున్న మానవచరిత్ర - కాండం కొంత ఎత్తు ఎదిగాక కొమ్మలుగా విడినట్లు - గతి తప్పుతుంది. ఇంకా- దీనివల్ల అనేక విషమ పరిస్థితులెదురౌతాయి. దేశాల ... ప్రపంచ.... స్వరూప స్వభావాలు మారుతాయి. ఆర్థికశాస్త్రం కూడా పస కోల్పోతుంది. మార్పులకి లోనౌతుంది.

అంతా తిరగబడుతుంది.

అస్తవ్యస్తమౌతుంది.

వైద్య శాస్త్రం ... మానవ పరిణామవాదం .... సర్వైవల్ ఆఫ్ ద ఫిట్టెస్ట్ ... అన్నీ ... అన్నీ ... విలువలు కోల్పోయి... నానా మార్పులకి తలవొంచి ...

ఎంత సంక్షోభం కలుగుతుంది !

ఎంత కల్లోలం చెలరేగుతుంది !

ఏ మహాత్ముడు ... ఏ మహర్షి ...

ఎవరాపగలరు దీన్ని ?

నిజంగా అలాగ జరుగుతుందా ?

దేశ దేశాలన్నీ తల్లక్రిందు లౌతున్నాయి యిటువంటి ఆలోచనలతో. వాటి ఆలోచనల నిండా భయం. భవిష్యత్తు ఏమౌతుందో అన్న భయం !

సర్వ ప్రపంచదేశాల దృష్టిని ఒక్కసారి భారతదేశం వేపు ఆకర్షించిన అతడు - ఆంధ్రుడు !

పదహారణాల ఆంధ్రుడు !

* * *

## 3

అతనతి సామాన్యుడు. అతని పేరు చయనులు. ఆయుర్వేద వైద్యమూ... జ్యోతిశ్శాస్త్రములలో అతను దిట్ట. సంస్కృతాంధ్రాలలో పండితుడు. వైద్యమూ, జ్యోతిషమూ ఆయనకు జీవికలు. ధనం కంటె మనిషికీ; కాగితం కంటె నోటిమాటకీ ఎక్కువ విలువ వుండే బంగారు కాలమది. ఆ గ్రామంలోనే కాక ఆ చుట్టుపక్కల నాలుగైదు గ్రామాలలో ఎవరు నుయ్యి తవ్వించబోయినా ముహూర్తమూ స్థలనిర్దేశమూ చయనులుగారే గావించాలి. ఎవరికి వ్యాధి వచ్చినా చయనులుగారే ఔషధం యివ్వాలి. ఆయన హస్తవాసి మంచిది. ఆయన వాక్కు శుద్ధి కలది. ఆయన మనస్సు ప్రలోభాలకి లొంగని పరిశుద్ధమయినది.

వారికి ఐశ్వర్యం లేదు. ఉన్న సంపదల్లా సంస్కృత విద్యే. ఒక యిల్లు తప్ప స్థిరాస్తి లేదు. పాండిత్యమే వారి ధనం. క్షుద్రమూ, అశాశ్వతమూ, చంచలమూ ఐన సిరికోసం వారేనాడూ తాపత్రయ పడలేదు. తనని చేరే ప్రజల శ్రేయస్సునే కోరుతూ వచ్చినవారిలో ప్రతిఫలాపేక్ష అనేది ఉండేదికాదు తానిచ్చే ఔషధం రోగి రుగ్మతను నివారించాలి. తాను సూచించే ముహూర్తం సర్వానుకూలం కావాలి. తాను చూపే స్థలం - జలభాండం కావాలి. తాను పలికే పలుకు పవిత్రమూ.... సర్వ జనామోదమూ కావాలి. అదీ ఆయన ధ్యేయం. అదీ ఆయన మతం. అదీ ఆయన జీవితం. ఆయన తన కాలాన్ని వ్రతంలా... నిష్ఠలా...నియమంలా గడుపుకు వొస్తున్నారు. ఐతే-

ఆయన కన్నులముందే కాలం మార్పులు తెచ్చుకుంటూంది. కొ త్త వలువలు....కొత్త విలువలూ దిద్దుకోసాగింది. ఈ మార్పుల నాయన హృదయం అంగీకరించనూలేకపోతోంది, ఆమోదించనూలేక పోతూంది. కన్నులముందు మారుతున్న కాలాన్ని చూస్తే ఏమిటో ఆవేదన....గుండెల్లో బాధ. అది వొకరికి చెప్పుకోలేనిది.

ముద్దుగా... బొద్దుగా ఉన్న పాప... ఊరీ ఊరని ఊరయగా వంటి వచ్చీరాని మాటలతో తల్లినలరిస్తూ ఉంటే, ఒక్కొక్కప్పుడు ఆతల్లి కొక చిత్రమయిన ఊహ వొస్తుంది - ఎప్పటికీ యీపాప యిలాగే ఉండిపోతే ? ఆ వూహ ఒకరికి చెప్పుకునేదికాదు. అది ఎంత అసంబద్ధమో ఆమెకే తెలుసు. అది - ఫలించే ఆలోచనా కాదు. ఆ చిత్రమయిన కోరికకు బలం తక్కువ. ఊరికే కోరుకునే వరమే తప్ప- ఇంకేమీ కాదు. ఆపాప పెద్దదవక మానదు. కావాలికూడా. చయనులుగారి మనసులో కూడా సరిగ్గా అటువంటి భావనే మెదులు తోంది. అటువంటి బాధే కలుగుతోంది.

కాలం రంగులు మారుతుంటే కలిగే బాధ... మానవత్వపు విలువలు మారుతుంటే కలిగే తాపం...ఏదో మార్పు.... ఆయన కనిపిస్తూంది - ఈమార్పు నిశ్చయంగా మంచివేపుకి కాదు- అని.

అప్పటికి - విజయనగరం మహారాజా కాలేజి మాత్రమే ప్రసిద్ధి చెందింది మద్రాసు వరకూ. విశ్వవిద్యాలయం - విశాఖపట్నంలోనే ఉంది- మద్రాసుకీ కటకానికీ మధ్య. ఆంగ్లవిద్య లేకపోలేదు కానీ - అరుదుగా మాత్రమే అభ్యసించబడేది ఆంధ్రదేశంలో. వీరేశలింగంగారి హితకారిణీ సమాజానికి కూడా ఎక్కువ పేరు ప్రఖ్యాతులుండేవి. ఒక విధంగా అది సత్యకాలం. చయనులు సత్తికాలం మనిషి. అందుకే కనులముందు త్వరత్వరగా జరుగుతున్న మార్పులకి ఆయన కంగారు పడిపోయారు. బెంబేలెత్తిపోయారు. ఉపద్రవం ముంచుకొచ్చినట్లు ఉద్రేకపడిపోయారు. ఎదురుగా జరుగుతున్నవన్నీ మహాఘోరాలుగానే కనిపించసాగాయి.

జ్యోతిశ్శాస్త్రం దిగజారిపోతూంది...కాదు... స్వార్థపరులు... ఏపూట కాపూట పబ్బం గడుపుకోవాలనుకునే తేలిక మనుషులు... డబ్బు మనుషులు... పవిత్రమూ మహాశక్తిమంతమూ ఐన జ్యోతిశ్శాస్త్రాన్ని కూటి విద్యగాదిగజార్చేస్తున్నారు. జ్యోతిశ్శాస్త్రమే హస్తసాముద్రిక మన్నట్లు - శుచీ శుభ్రమూ...వేళాపాళా... నియమమూ నిష్ఠా పాటించ కుండా- చేయిచూసి... కమ్మని కలలు రేపే తీయని అబద్ధాల కబుర్ల స్థాయికి దింపేస్తున్నారు రోడ్డుపక్క చెట్టుక్రింద సాముద్రికులు. నీచుడి పాలబడిన పవిత్ర స్త్రీకిమల్లె యిక జ్యోతిశ్శాస్త్రానికి మంచిరోజులు మిగిలినట్లులేదు. పంచాంగమంటే, చక్రమంటే .... రాశంటే ... లగ్నమంటే...నక్షత్రమంటే ఏమిటో తెలియనివాడు కూడా భూత భవిష్యద్వర్తమానాలు చెప్పేస్తా నంటూ మొనగాడిలా బయలుదేరు తూంటే వరాహమిహిరుడు విచారంతో ముఖం వేలాడేసుకోక ఏం చేస్తాడు ? చీట్లపేకతో భవిష్యత్తు చెప్పేదొకడు ! పాచికలతో గతం చెప్పేదొకడు! చిలకలతో పలికించేదొకడు, ఎద్దుకొమ్ములతో చెప్పించే దింకొకడు. ఇలాగ అస్తవ్యస్థమూ, కుక్కలు చించిన విస్తరి ఐపోతూంది జ్యోతిషం.

సంస్కృతమా !... తలుచుకుంటే దుఃఖమొస్తూంది. ఎంత దయనీయమయిన దీనావస్థలో ఉందని! దేవభాష... మనిషి దైవాంశ నుంచి రాక్షసాంశవేపు పరుగుపెడుతూ- గీర్వాణ భాషను కూడా నిర్లక్ష్యం చేసేశాడు. ఇంక యీ అతిమధురమూ మహత్తరమూ మహోన్నతమూ ఐన సంస్కృత భాషకీ కాలం చెల్లిపోయినట్లే. పోషణా... ప్రాచుర్యమూ లేని యీ భాష తన ప్రాణాన్నింకా మంత్రాలలోనే నిలుపుకుని ఉంది. ఈ కొనఊపిరి మాత్రం ఎన్నాళ్లు! కాలపు ధోరణి చూస్తూంటే వేదాలూ మంత్రాలూ కూడా ఆంగ్లంలోకే హిందీలోకో అనువదించబడేటట్లున్నాయి. లేక- ప్రాంతీయభాషలలో తిరగవ్రాస్తారేమో. వేదాలను ఆంగ్లంలోకి జార్చి - పాప్...రాకెన్‌రోల్.. జాజ్ వరుసలలో అరవడం మొదలుపెడతారేమో యిక. ఇంక వేదా లకు పట్టేముంటుంది ? వేదానికయినా మంత్రానికైనా పట్టు-స్వరమే. ఆపట్టు జారాక- పతనంకాక మరేమి మిగులుతుంది? ఏం మనుషులు.., మహారాజు సింహాసనం మీద శోభిస్తాడే తప్ప మామూలు మనిషిగా ప్రకాశించడని గ్రహించరేం ? సంస్కృతానికి కళ తప్పడం అంటే - సంస్కృతికి విచ్ఛిన్నం ఆరంభమయిందన్నమాటే. తెలుగు ఊపిరి సంస్కృతంలోనూ; తెలుగువాడి ఊపిరి తన సంస్కృతిలోనూ మాత్రమే ఉందని చయనులుగారి ప్రగాఢ విశ్వాసం. ఆయన విశ్వాసా లకే దెబ్బకొడుతూంది మారుతున్న కాలం.

( ఇంకా వుంది )

((((((•))))))

# మళ్ళీమళ్ళీ అదే కథ

—శ్రీ మధుర్‌జీ



37



డిశెంబరునెల

చలి ఎముకల్ని కొరుక్కుతింటోంది నిర్దాక్షిణ్యంగా. చిరుచీకట్లు ముసురుకోక మునుపే చలి తన విజయపతాకాన్ని గర్వంగా ఎగురవేస్తోంది. పూరి గుడిశెల్లోనూ- ఆరుబయట ఆకాశం క్రింద తలదాచుకున్న దిక్కులేని దీనులమీద— పగబట్టినట్లు కసికసిగా విజృంభించి మరీ కొరుక్కుతింటోంది— కనిపించని తన కోరలతో.

ఒక్కమాటలో— ద్విగుణీకృతోత్సాహంతో చలి లోకంమీద విజయవిహారం చేస్తున్న శీతాకాలమది.

ఎండిన బడుగుదేహాల పాలిట శాపమది !

బక్కచిక్కిన దీనజనుల శరీరాల కోతల కాలమది !!

పల్లె.

రాత్రి ఏడుగంటలవేళ - చలికి స్వాగతం పలకటం యిష్టంలేక తలుపులు బిడాయించుకుని వెచ్చదనం ఒడిలో హాయిగా పడుకుంది గ్రామం. ఆ నిశ్శబ్ద నిశీధిలో చలిగాలి మూసిన తలుపులకేసి కోపంగా చూస్తూ— తలుపులే లేని పూరిగుడిసెలకేసి హుషారుగా పరుగులు తీస్తోంది...మధ్య మధ్య ఆకాశం కప్పుక్రింద 'మూడంకె' వేసి తల

నాచుకున్న శిథిల శరీరాన్ని ఆనందంగా చప్పరిస్తూ. తమ శరీరాల్ని వేధిస్తున్న దెవరో తెలియక- పిచ్చి కోపంతో ఊరకుక్కలు వుండి వుండి ఆకాశంకేసి మోరలు సాచి 'గో' మంటున్నాయి.

మెరక వీధి.

మెరకవీధిలో వరండాలేని పెంకుటిల్లు. పడిపోవటానికి సమాయత్తమౌతున్న ఆ పెంకుటింటి ముందు- వెలగనా మాననా అని ఆలోచిస్తూ గుడ్డిగా వెలుగుతున్న వీధి దీపం. వీధిదీపం క్రీనీడలో కాళ్లూ,తోక పొట్టలోకి ముడుచుకుని దీనంగా పడుకున్న ముసలికుక్క.

పెంకుటింటి అరుగుమీద- విలయతాండవం చేస్తున్న వెర్రి చలిలో మూటలా ఓ ఆకారం. మూసిన ఆ పెంకుటింటి తలుపుల వెనుక వెచ్చని ఓ పడుచు జంట

అరుగుమీద ముడుచుక కూర్చున్న ఆ ఆకారం వయస్సు ఆరుపదులు. పేరు రామభద్రుడు. ఆరుపదులు వయస్సును పైనేసుకుని శిథిలావస్థకు చేరువయిన ఆ బక్కచిక్కిన రామభద్రుని దేహాన్ని, చలి కనీస జాలికూడా లేకుండా నిర్దాక్షిణ్యంగా- తన కోరలతో కనిపించిన ప్రతిచోట కసిగా కొరుకుతోంది. చలికోరల బారిన పడకుండా తన ముసలి దేహాన్ని రక్షించుకోవాలని- చిరుగుల దుప్పటి సాయంతో రామభద్రుడు ఎంత ప్రయత్నించినా సాధ్యం కావటం లేదు.

చీకటి ఆకాశంలో చుక్కల్లా- ఆ గుడ్డివెలుగులో దుప్పటినిండా చిరుగులు మెరుస్తున్నాయి.

రామభద్రుడు మరింతగా, మ....రిం....త...గా.... ముడుచుక్కూర్చున్నాడు.

ప్చ్.... లాభం లేదు.

చలి....చలి....చలి....చలి.

క్షణక్షణానికి బలపడుతున్న చలిగాలులు!

మరింత వాడిగా పదునెక్కుతున్న చలికోరలు!!

రామభద్రుడు తన దుప్పటివంక దిగులుగా చూసుకున్నాడు. ఇక నీ శరీరాన్ని రక్షించడం నావల్ల కాదన్నట్లుగా చిన్నబోయి మౌనంగా చూసింది దుప్పటి.

తలమీదినుండి జారిన దుప్పటిని మళ్ళీ తలపైకి లాక్కున్నాడు. తనకు దొరికిన ఒక్కక్షణం అవకాశాన్ని చలి సద్వినియోగ పరుచుకుంది— చెవుల్లోకి రివ్వున దూరి.

వీధి దీపం క్రింద ముసలికుక్క మరింత ముడుచుకొని— చీకట్లోకి చూస్తూ 'గో' మంది దీనంగా.

'ప్చ్.... పాపం ముసిల్ది నాకు మల్లేనే
సలికి సచ్చిపోతున్నాది—రామభద్రుడు
కుక్కమీద జాలితో గొణుక్కున్నాడు.

రామభద్రుడు కూర్చున్న అరుగుక్రింద యెప్పుడో కోళ్లకొరకు కట్టించిన ఓ గూడుంది. ఆ గూట్లో పడుచుకుక్క వెచ్చగా పడుకుంది.

'యెదవది...ఈ పడుసుకుక్క ఆ యీదిలో పడుకొని..పాపమా ముసల్దాన్ని యెచ్చంగా గూట్లో పడుకోనీరాదూ...'

కానీ - రామభద్రుడికి తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది.

'యిదేటి... తనిట్టా తలగిందులుగా ఆలోసిత్తున్నాడు...యెక్కడైనా ముసిలోల్లు బయటా...పడుసోల్లు లోపలేగా రివాజు...'

చలిగాలి రివ్వున వీచి -యింటి ముందున్న కొబ్బరి చెట్టాకుల్ని పలుకరించింది.

'దీన్నిగదరగ...యియ్యాల సలి మా సెడ్డగా వుంది. బీడీముట్టిచ్చి రెండు దమ్ములాగాల్సిందే -'

రామభద్రుడు కప్పుకున్న దుప్పటి జారకుండా జాగ్రత్తగా జేబులోనుండి బీడీ తీసి ముట్టించి- గుండెల నిండుగా పొగపీల్చాడు.

వెచ్చటి అనుభూతి.

ఆ అనుభూతిని దూరంచేస్తూ దగ్గుపొర వచ్చింది.

ఖణేల్...ఖణేల్...ఖణేల్...

"మీ ముసలాడు నిద్దరపట్టక సత్తున్నాడు లాగుందే...అదేంటో పాడుదగ్గు. ఛీ...ఛీ..." కోడలు విసుక్కుంటోంది.

'పొద్దుటాల కూడుదిన్న కాన్నుంచీ..యాప చెట్టు నీడన బడి గురక లెడుతూ నిద్దరోవటమే....మరి రాత్తిరి నిద్దరపట్టమంటె యెట్టా పడ్తది_' కొడుకు వ్యంగ్యంగా వివరిస్తున్నాడు.

కోడలు మళ్ళీ ఏదో గొణుగుతూ అడిగింది. కొడుకు నవ్వుతూ జవాబిచ్చాడు. కొడుకు జవాబుకు కోడలు పడీ పడీ నవ్వుతోంది.

రామభద్రుణ్ని ఆ నవ్వు చలికంటే కూడా బాధించింది.

అవునుమరి – చలిబాధ శరీరానికేగాని మనసుకు కాదుకదా!

—'సీ....సీ.... యీ యెదవ సరీరంల సత్తువుడిగినాక మరింక బతక్కూడదు. బతికినా కన్నవోల్లకి దూరంగా నాలుగీదులు బిచ్చమెత్తొకుని బతకాల. అదీ శాతగాకపోతే సెర్లోదూకి సావాల. గట్లా కాకుండా యిట్లా కన్నవాల్ల కాల్లకిందబడి ....ఆల్ల సూటీపోటీ మాటలంటూ .... కోడల్ల యీసడింపులు బరిచ్చి .... శెవంనాగుండేదాని కన్న సావటం నయం...'

రామభద్రుని కళ్లు చెమ్మగిల్లాయి.

మనసు బాధతో విలవిలలాడింది.

ఇంట్లోనుండి మాటలు వినరావటం లేదు.

కొడుకూ, కోడలూ తలుపులు, కిటికీలు బిగించుకుని — వెచ్చని కంబళి కప్పుకొని హాయిగా నిద్రపోతున్నారు.

బయట అరుగుమీద ఆకాశంక్రింద చిరుగుల దుప్పటితో తంటాలు పడుతూ - శిథిల శరీరాన్ని చలికి ఆహారం చేస్తున్నాడు ముసలితండ్రి రామభద్రుడు.

చీకటి మరింత చిక్కబడింది.

చలికి మరింత బలం పెరిగింది.

ముసలి శరీరంలో రక్తం మరింత చల్లబడింది.

చలి .. చలి... చలి...

చర్మాన్ని కోసే...ఎముకల్ని కొరికే.. కండల్ని పిండే—చలి. చలి—చలి,

రామభద్రుడిలో వణుకు మొదలయ్యింది.

39 అరుగుమీద చలిలో చిరుగుల దుప్పటితో పడుకోవటం సాధ్యమయ్యేలా లేదు.

రామభద్రుని మనసులో ఆంజనేయస్వామి గుడి మెదిలింది.

గుడిలోని వెచ్చదనం రారమ్మని ఆహ్వానించింది.

అరుగు .. గుడి. గుడి....అరుగు

చలి.... వేడి.... వేడి .. చలి....

శరీరం కదలమని బలంగా ప్రోత్సహిస్తోంది.

మనసు పదపదమని మరింతగా తొందర పెడుతోంది.

—కాని బుద్ధి రామభద్రుని అంత చలిలోనూ అరుగుమీదే కదలకుండా కట్టి పడేసింది.

సాయంకాలం జరిగిన సంఘటన రామభద్రుని కళ్లముందు కదలాడింది.

రామభద్రుడు వేపచెట్టు క్రింద కుక్కిమంచంలో కూర్చుని - బీడి కాల్చుకుంటున్నాడు ... మధ్య మధ్య దగ్గుకుంటూ.

కొడుకు విసురుగా వచ్చాడు వీధిలోనుంచి. చేతిలోనున్న వస్తువేదో కోపంతో ఓ మూలకు గిరాటేశాడు. రామభద్రుడు మౌనంగా కొడుకును గమనిస్తున్నాడు.

'ఏమేవ్ ... ' పెళ్లాన్ని గొంతు చించుకుని కేకేశాడు.

ఇంట్లోనుండి కోడలు బయటికొచ్చింది ప్రశ్నార్థకంగా చూస్తూ.

' యీ వూళ్లో నేను తలెత్తుక తిరగాలనుకున్నరా ... లేదా...' కొడుకు కంఠం ఖంగున మ్రోగింది.

'యేం జరిగిందేటి ... ?'

'యింకేం జరగాలి ... నాకు తల కొట్టేసినట్లయ్యింది...అగో... ఆ ముసలాయన మూలాన్న ...'

రామభద్రుడు కుక్కిమంచంలో వులికిపడ్డాడు.

' నేనేటి సేసినాన్రా ... '

'యేటిసేసినావా ... నా బతుకు బజారు కీడ్చినావు ... నా పర్వు గంగల కల్పినావు ... అవునూ ... నేనింకా బతికున్నాననుకున్నావా... సచ్చినాననుకున్నావా ... '

' అదేటిమాటరా ... ' రామభద్రుడి కంఠంలో మమత, బాధ.

'కాకుంటే... రాత్తుర్లు ఆంజనేయస్వామి గుడికాడ - బిచ్చగాల్ల సందున మరెందుకు పడుకుంటున్నవ్ —'

విషయం అర్థమయ్యింది రామభద్రునికి. అవును. నిజమే. ఓ వారం రోజుల్నుంచి చలి మరింత ఎక్కువయ్యింది. అందువలన - వీధి అరుగుమీద చలికి ముడుచుకుని పడుకొని ... నిద్ర పట్టక ... బాధ పడలేక ... గుడిలోకి వెళ్లి పడుకుంటున్నాడు రామభద్రుడు.

మరి గుడిలో తలదాచుకోవటానికి అభాగ్యులు కాక మరెవ్వరొస్తారు ? కానీ - రామభద్రుడికి కొడుకు మాటకు భయమూ, సిగ్గూ కలుగకపోగా చిర్రున కోపమొచ్చింది.

'అహా ... మరి తండిరి సుగం కోరేవాడివి ... సల్లో యెందుకు పడేశావ్ —'

'అవున్నద ... యియ్యాల్టినుంచి నువ్వు లోపల యెచ్చగ పడుకుంటే - నేనూ నీ కొడుకూ బయటరుగుమీద సల్లో ముడుసుక పడుకుంటాం —' కోడలు సూటిగా విసిరింది.

రామభద్రుడు కోడలువైపు కోపంగా చూశాడు.

కానీ — అతనికి చేతకాని పేదవాని కోపం... సామెత అనుభవరీత్యా తెలుసు.

'ఇగో... యీ దుప్పటి సూడండ్రి . చచ్చినోళ్ళ తర్వాత దిక్కులేని శెవాల్మీద కప్పటానిక్కూడా పనికిరాదిది .... కుస్టోడి శెరీరంలా దీన్నిండా కంతలే. దీన్ని కప్పుకోని - నువ్వూ నీ పెల్లాం వో రాత్తిరంతా అరుగుమీద పండుకుంటే తెలుస్తాది .... నేనెందుకు బిచ్చగాల్లతో గుడికాడ పడుకున్నానో -

నీకంత పోరు సమూడిపడతా వుంటే - యిదిగో - ఓ మాంచి కంబడి కొనిపెట్టు - యిక్కన్నే మనరుగుమీనే పడుకుంటాను కాయలి పక్కకు మల్లే - '

రామభద్రుడు తన గుండెల్లో దాచుకున్న వుక్రోషాన్ని వెళ్లగక్కాడు. నోరుమూసుక పడుండక తన మాటకు నాలుగురెట్లుగా బదులు చెపుతున్నందుకు ముసలితండ్రి మీద ఆగ్రహం వెయ్యింతలుగా పెరిగింది కొడుక్కు.

'ఆహాఁ ... యిక్కడ నువ్వు సంపాయిచ్చి యిచ్చినేదంతా దాస్కోలేక చచ్చిపోతున్నా - మరింక కంబడి కొనకుంటే యెట్లా - ' కొడుకు వత్తి వత్తి పలుకుతూ ఈసడించాడు.

'కంబడైతే యేంబాగుంటాది.... పట్నమెల్లి రొండొందలు పోసి వుల్లను రగ్గు కొనుక్కోరారాదూ.... యెచ్చగుంటాది - వూరు వూరెల్ల కొడుకును మెచ్చుకుంటాది - ' కోడలు చేతులూ, మూతి త్రిప్పుతూ దెప్పి పొడిచింది.

రామభద్రుడి మనసు కోపంతో కుతకుత మంటూ భగ్గున మండింది. చేతకాని ఆవేశంతో పిడికిళ్లు పిసుక్కున్నాడు.

చేతిలో చిరుగుల దుప్పటి.

కళ్లముందు కోరుకుంటున్న కంబళీ.

'ఇగో - ఆకరుమాట సెపుతుండా .... మల్లా మల్లా ఆ గుళ్లో బిచ్చగాల్లతో పడుకుంటే— మర్యాదక్కదు గాక దక్కదు - రాయే-'

కొడుకూ, కోడలు విసురుగా యింట్లో కెళ్లిపోయారు.

రామభద్రుడు మౌనంగా కన్నీళ్లు తుడుచుకున్నాడు. పిచ్చివానిలా దీనంగా శూన్యంలోకి చూస్తూ కూచున్నాడు.

...... ముసలికుక్క అరుపుకు వులికిపడ్డాడు. చలిబాధకు తట్టుకోలేక ముసలికుక్క ఒక్కసారిగా విదిలించుకుని లేచింది. అదీ రామభద్రుడితోపాటు గత వారం రోజులుగా గుడిదగ్గరే రాత్రి తలదాచుకుంటోంది - వున్నంతలో వెచ్చగా. కానీ - ఈ రోజు తన యజమాని అరుగుదిగి - యింకా గుడికేసి కదలక పోవటంతో అది విసుగుతో, బాధతో తొందర పెడుతోంది.

ముసలికుక్క రామభద్రునిచూసి తలాడించింది రా రమ్మన్నట్టు.

'పిచ్చిముండ .... గుడికాడికి రమ్మంటున్నాది నన్ను ... దానికేటి తెలుసు యీయెదవ మడుసులకు బతుక్కంటే బోడి మరియాద లెక్కువని .. '

రామభద్రుడు గొణుక్కున్నాడు.

నాలుగయిదు నిమిషాలు చూసి యిక లాభం లేదనుకుని ముసలికుక్క అరుగు దగ్గరికి వచ్చింది. వెంటనే అరుగుకింద గూట్లో వెచ్చగా పడుకున్న పడుచుకుక్క 'గయ్‌య్——' మంటూ లేచింది— తన గూట్లో యెక్కడ దూరుకుంటుందో ముసలికుక్కని.

'ఒసేవ్.... ఆ ముసల్ది నినుగన్న తల్లే——'

ముసలికుక్క భయంతో ఒక్కసారిగా వీధి దీపం కిందకు పరుగెత్తింది.

రామభద్రుడు తలయెత్తి ఆకాశం వంక చూశాడు.

'గొరకొయ్యలు' నడినెత్తి మీదకు వచ్చాయి.

'అద్దరేతిరైనా యీ యెదవ సలికి నిద్దర పట్టిసావటంలా ——'

నిదురరాని మనసు నిండా ఏవేవో ఆలోచనలు ముసురుకోవటం ప్రారంభమయ్యింది.

'అదేటి యిచ్చిత్రమోగాని నిరుటిదాకా బాగా సూసుకున్నడు కొడుకు. ఆ పెల్లాం పిల్ల వచ్చి ఆర్నెల్లయినా తిరక్కముందే—— నేనంటే యీసడించుకుంటున్నడు సీటికి మాటికి కసురుకుంటున్నడు. నాకు కూడెట్టమే దండగని అస్తమాను గొనుకుంటున్నడు. ఇగ కడుపు జించుక పుట్టినోడే యిట్టాగుండే—— నిన్న మొన్నొచ్చిన పరాయిపిల్ల మాత్తరం సదరంగా సూస్తదా——పాడా—— ?!'

కొడుకు కోడళ్ళ ఆలోచనలతో రామభద్రుడి గుండెలు బరువెక్కాయి.

అర్ధరాత్రి దాటిందని హెచ్చరిస్తూ కోళ్లు కూతలేస్తున్నాయి. రాత్రి గడిచేకొలదీ ఈదురుగాలులకు మరింత బలం పెరిగింది. చలి కోరల పదునూ పెరిగింది.

కప్పుకున్న చిరుగుల నూలు దుప్పటి చలిగాలికి, సన్నని మంచుకూ పూర్తిగా చల్లబడిపోయింది.

వణుకు .... వణుకు వణుకు.

రామభద్రుడికి ఎముకల్లో వణుకు ప్రారంభమయ్యింది. ఎంతగా మునగదీసుక్కూర్చున్నా .... ఊహుఁ ... చలినుండి శరీరాన్ని కాపాడుకోవటం సాధ్యం కాలేదు. ముసలిదేహం - సుడిగాలిలో ఒగుటాకులా చలిగాలులకు వణికి పణికి పోతోంది.

కళ్లముందు వెచ్చని కింబళీ మెదిలింది.

కప్పుకున్న చిరుగుల దుప్పటిని యీసడింపుగా చూస్తూ 'ఛీ' అనుకున్నాడు. తనను పట్టించుకోని కొడుకు ప్రవర్తిన మనసులో ముల్లయింది.

( 58వ పేజీ చూడండి )

# నేనొక మహారణ్యాన్ని

శ్రీ కవులూరి గోపీచంద్

నేనొక మహారణ్యాన్ని
అందమైన పిట్టలనేకం నాలో గూడు కట్టుకున్నాయి
పిచ్చిపాటలు పాడుకుంటూ ఎగురుకొంటూ
తిరుగుతూంటాయి

నా నిండా అల్లుకుపోయిన సాలీళ్ళ గూళ్ళల్లో
నాకు తెలిసి ఎన్నోపిట్టలు తగుల్కొన్నాయి
వాలని రెక్కల యీకలు, నా నిండా రాలిన
ఆకుల కుప్పలు

నాలో నిత్యం ఏదోమూల దావానలం
సగం కాలి మిగిలిన చెట్లఘోష
కొన్ని లతలేనాడో మాడి మసైపోయాయి
కొన్ని మానుల్ని కౌగలించుకొని ఏడుస్తున్నాయి

మహారణ్యపు కటిక చీకట్లు నా వొంటరి తవం
నేను కన్నుమూస్తే చాలు, నాలో క్రూరమృగాల కదలిక
సౌకుమార్యపు లేళ్ళను తింటూ విజృంభిస్తాయి
విషసర్పాలు పక్షి గూళ్ళలోకి చేరతాయి
వేలమైళ్ళు విస్తరించిన చీకటి నిండా క్రూరమృగాల
ఆటల అడుగుజాడలే

ఏ బాధకి ఏ భావానికి ఏ కొమ్మ ప్రతినిధో
ఏ జంతువు కోర ఏ యుగానిదో తెలీదు

భూగోళపు అట్టడుగు పొరల్లో యీ అరణ్యపు
వేళ్ళకొసలు కన్పించవచ్చు
ఎక్కడో వూహకందని లోతుల్లో సన్నగా పొగలా
ప్రారంభమై అడవి అంతా అల్లుకుపోయిన వేలస్వరాలు
నా చూపులు చీల్చలేని యీ చీకట్లలోకి ఏ సూర్యుడు
ఉదయించగలడు ?
అరణ్యపు అంతంలోనో ఆదిలోనో చీకటి కట్టిన గుహలో
నిద్రపోతుంది నగ్న మానవ శక్తి శిశువు

ఏ మహర్షి చూపో ఏ కర్మయోగి పిలుపో
కావాలి, దాని యుగాల నిద్రని అంతంచెయ్యటానికి

ఈ కదలే అరణ్యం ప్రపంచంలో శాంతిపుష్పం
పూయిస్తుందట
యీ అరణ్యంలో నేను ఎ చెట్టుకు ఏ జెండా కడితే
ఏమయినట్టు ?
నన్ను నేను సమూలంగా నరుక్కోవాలి అప్పుడుగాని
సేద్యం సాధ్యం కాదు
పేరు లేదుకదా అని పిచ్చిమొక్కకి "శాంతి" పేరు
పెడతావా ?
ఎందరైతే శాంతి సేద్యం సాధిస్తారో అందరే యీ
దేశజనాభా





ఆమె మూడుమెట్లు చాలా నెమ్మదిగా ఎక్కినా, గుండె వేగంగా కొట్టుకొని ముఖమంతా చెమట పట్టింది. పొడవుగానున్న వరండా అంతా ఖాళీగానే ఉంది. చివరనున్న గదిలో అతను చదువుకుంటూ ఉంటాడు. ఏదైనా కారణంచేత ఆలస్యమయి రాలేకపోతే, మెల్లిగా తన గది తలుపుమీద రెండుసార్లు కొట్టమన్నాడు. వెంటనే బయటికి వస్తానన్నాడు.

ఆమెలో ఏదో భయం, పిరికితనం అడుగు ముందుకు పడ కుండా అడ్డుపడుతున్నాయి. గౌరవము, మర్యాద మొదలైన మంచి విషయాల కన్నిటికీ తిలోదకాలిచ్చి, అందరినీ విడిచిపెట్టి ఆమె పారి పోతున్నది.

అడుగులో అడుగు వేసుకుంటూ. వరండా చివరనున్న గది చేరుకుంది. తలుపుకు చెవి ఆన్చి విన్నది. లోపలనుంచి ఏశబ్దము రాలేదు. దీపం వెలుగుతున్నట్లు కూడా తెలియడంలేదు. ఎవరికయినా సరే, ఒకొక్కప్పుడు నిద్ర ముంచుకొనివస్తే, ఎటువంటి పని అయినా మరచిపోయి, చేసిన వాగ్దానాలను వాయిదా వేసుకుంటూ వస్తుంది. అందు కోసమే అతను చాల ముందాలోచనను పోయి, ఈ సలహా ఇచ్చాడు.

ఆమె గది తలుపు దగ్గిర ఒక అయిదు నిమిషాలు నిలబడింది. ఆలోచనలు అంతంలేకుండా ఆందోళన కలుగజేస్తున్నాయి. ధైర్యం తెచ్చుకుంది. మెల్లిగా రెండుసార్లు తలుపుమీద కొట్టింది. కాని వెంటనే ఏమీ జరుగలేదు. ఎవరూ తలుపులు తీసుకొని బయటికి రాలేదు. ఆమె ముఖం చెమటతో నిండిపోయింది. చీర చెరగుతో గబగబ తుడుచు కుంది. చేతిలోనున్న చిన్న తోలు సూట్‌కేస్ క్రిందను పెట్టి, ధైర్యం కూడ దీసుకొని మళ్ళా తలుపుమీద రెండుసార్లు పూర్వంకన్న కొంచెం గట్టిగా వినపించేటట్లు కొట్టింది.

ఆ ఇల్లు సందు చివరన ఉంది. దాని తరువాత మరి యిళ్లు లేవు. ఒక కాలువ ఉంది. దానిని దాటి వెళ్తే కొబ్బరితోట. దాని నిండా రిక్షావాళ్ల గుడిసెలు. అందుచేత అతను తలుపు తీసి రాగానే, ఇద్దరూ ఆమె వచ్చినతోవనే పోయి, అక్కడ రోడ్డు పట్టుకోవాలి, ఏదో రిక్షామీద స్టేషనుకు పోయి, రైలెక్కితే చాలు.

ఈ సారి తలుపులు తెరుచుకున్నవి. అవి వరండా చివరనున్న కొట్టు తలుపులుకావు. మధ్య నున్న పెద్దగది తలుపులు అవి. ఆమెను కాళ్లు వణుకుతున్నవి. నీరసంవచ్చి పడిపోతున్నట్లయింది. పారిపోదా మన్నా మరేదీ దారి లేదు.

"ఎవరది?" ఒక స్త్రీ కంఠం వినిపించింది.

బయటికి వచ్చిన ఆవిడ వరండాలో లైటు వేసింది.

"నువ్వా?"... ఆమె వచ్చిన దానిని గుర్తించింది కాబోలు, వెంటనే లైటు ఆర్పింది.

ఆ వచ్చిన ఆవిడ రంగనాయకమ్మ.

"సరస్వతీ! ఇలా నాతో రా!"

ఆవిడ చెప్పి విగి వీధి మధ్యగది నిలుచింది.

వె్రి వేషాలు వెయ్యకు. ఎవడినో చూసి మీ నాన్న ముడిపెడతాడు. నీ మేలు గురించి ఆలోచించావుకాని, మావాడి పరిస్థితి గురించి ఏమైనా ఆలోచించావా? మా వాడు ఈ కుటుంబం విడిచిపెడితే ఏమవుతాడో తెలుసా?''

సరస్వతి కళ్లు తుడుచుకుంది.

''ఈ యింటికి రామాచారి పెద్ద కొడుకు. వీడి తరువాత అలమేలు పెళ్లికి సిద్ధంగా ఎదిగి కూర్చుంది. వీడికి వచ్చిన కట్నంతో పిల్ల పెళ్లి చెయ్యాలి. అంతకు మించి మా దగ్గిర ఆస్తి ఏముంది? లేకపోతే ఉన్న ఇంటిని అమ్ముకోవాలి. వీడికి ఎంత డబ్బో ఖర్చుపెట్టి చదివిస్తున్నాము. ఉద్యోగం చేసి ఈ కుటుంబాన్ని పోషించే భారం వాడిమీదే ఉంది. ఈవిషయాలన్నీ నువ్వుగాని, వాడుగాని ఆలోచించారా? మిమ్మల్ని అనవలసిన పనిలేదు. పెద్దవాళ్లు మీరు విచ్చల విడిగా తిరగడానికి అడ్డుపడకుండా ఉన్నన్నాళ్లు ఇటువంటివే జరుగుతాయి. వెంటనే ఇంటికిపో. ఇటువంటి పొరపాటు చెయ్యకు. చిన్నతనం-తల్లిలేని పిల్లవు. నలుగురి నోళ్లలో పడితే పెళ్లి పెడాకులు లేకుండా ముసలి దానివయి పోతావు.''

మరేమీ చెప్పకుండా రంగనాయకమ్మ మెట్లెక్కి పెద్దగది వేపు నడిచింది. అక్కడే తలుపు దగ్గిర నిలబడ్డ రామాచారి సరస్వతికి క్షణం కనిపించాడు. తరువాత తలుపులు మూసుకున్నాయి.

సరస్వతి తొందరగా ఇంటివేపు నడిచింది. తాను ఒక్కరితే ఎక్కడికీ పారిపోలేదు. పెరటిద్వారం సమీపించింది. తలుపులు మెల్లిగా తెరుచుకుని లోపలికి ప్రవేశించింది. చేతిలోనున్న పెట్టె కిందనుపెట్టి తలుపులు వేసింది. నూతి పావంచామీద ఒక పది నిముషాలు కూర్చుంది. జీవితంలో ఆమె ఎదురు దెబ్బలు ఎన్నో తింటున్నది, ఇది మరొకటి.

మెల్లిగా మెట్లెక్కి మేడ మీదనున్న తన గది వేపు నడిచింది. ఆగదికి వెళ్లాలంటే నాన్న పడుకున్న గది పక్కనుంచే వెళ్లాలి. లోపల ఏవో మాటలు వినిపిస్తున్నాయి. వాళ్లకు తన సంగతి తెలిసిందేమో! గుండె ఝల్లుమంది. కాళ్లాడక సరిస్వతి ఆ గది తలుపుదగ్గిర నిలబడిపోయింది.

''మీకెంత చెప్పినా బుర్రకెక్కదు,'' అది పిన్ని గొంతుక

''శకుంతలా? నన్నేమి చెయ్యమన్నావో చెప్పు'' అది నాన్న గొంతుక.

''చెయ్యడానికేముంది, బుద్ధిగా సరస్వతికి పెళ్లి చేయడమే.''

''నేనూ అదే అనుకుంటున్నాను. కాని డబ్బెక్కడుంది? దాని చదువు కోసం వాళ్లమ్మ తన వొంటి మీద బంగారమంతా అమ్మి ఇరవై వేల రూపాయలు బ్యాంకులో వేస్తే, పదివేల రూపాయలు నా రెండో పెళ్లికింద ఖర్చు పెట్టాను. మిగిలిన పదివేల రూపాయలు నీ పేర బదిలీ చేశాను.''

''అదే! ఈ విషయాలన్నీ మీరు ఏకరువు పెట్టనక్కరలేదు. నాకన్నీ తెలుసు. మీరు నా మెడలో తాళికట్టిననాడే, నాకో ఎదిగిన సవతికూతురుందని, దానికి పెళ్ళిచేయకుండా దానితండ్రి తనే చేసుకుంటున్నాడని తెలుసు. అటువంటప్పుడు మీరు పెళ్ళి మానీలేక పోయారా?''

''ఉద్యోగం చెయ్యాలికదా! అందులోకి రివెన్యూ ఇనస్పెక్టరు ఉద్యోగం- ఏవేళకు ఇల్లు చేరుతానో... నాకు మొన్ననే నలభై నిండాయి. మిగిలిన జీవితం ఎలాగడుస్తుంది?''

''అయితే మరి పెళ్లాడినందుకు విచారం దేనికి. కాని ఒక్క సంగతి ఆలోచించండి! పిల్లకు పద్దెనిమిదేళ్లు నిండాయి. కాపురము చేయవలసిన వయసు. అది యింట్లో తిరుగుతుంటే ఏపనిచేసినా తప్పుగానే కనిపిస్తుంది. ఈ విధంగా మీరు రోజులు గడిపితే మరో ఆయిదు సంవత్సరాలకేనా దానికి పెళ్ళిచేయలేరు. నాకు సరదాలెప్పుడు తీరుతాయి.?''

''అవును. అన్నీ గడ్డు సమస్యలే!''

''ఏదో ఒక నిశ్చయానికి రావాలి. సరస్వతికి పెళ్ళి చేయాలి.''

''నాపరిస్థితులు చెప్పాను కదా! నువ్వు తెలివైన దానివి. మరేదైనా ఉపాయం ఉంటే ఆలోచించు.''

''అమ్మా! ఇప్పటికి గుర్తించారన్నమాట నాకూ ఈ యింటి బాధ్యత మీ కన్నటే హెచ్చుగా ఉంది అన్నట్లు చెప్పడం మరచి పోయాను. ఈ పండుగకు మావాళ్లు పిలుస్తున్నారు. వారం రోజులు సెలవు పెట్టిరండి.''

''బాగానే ఉంది! వాళ్లు పిలవడం సబబే! కాని నాకున్న ఇబ్బందులు నావి. పెళ్లాంపోయి నాలుగు నెలలయినా కాలేదు. ఒక సంవత్సరం వరకు పండుగలు, పర్వాలు... ''

ఆ మాట పూర్తి కాకుండానే శకుంతల అంది: ''... మరి సంసారం చెయ్యడానికి ఈ సాకులేమీ అక్కరలేదు కదా! అయినా, నాకెందుకు! నేను మాత్రం పదిహేను రోజులు ముందే వెళ్ళిపోతున్నాను.''

''శకుంతలా! ఎప్పుడైనా నిన్ను పద్దన్నానా!'' అతడు లాలింపు ధోరణిలో పడ్డాడు.

సరస్వతి చప్పుడు చేయకుండా తనగదిలోకి పోయింది.

నిస్సత్తువగా మంచమీద కూలబడింది.

ఆమె తల బద్దలవుతున్నది వేయి శకలాలుగా !

తన పెళ్ళి సవతితల్లి చేతులలో ఉంది.

సవతితల్లి వచ్చి ఇంకా నెల్లాళ్ల కాలేదు. అమ్మపోయిన దుఃఖం ఇంకా తగ్గలేదు. నాన్నకు అమ్మ అంటే ఎంతో అభిమానం. ఎందుకింత తొందర పడ్డాడు రెండో పెళ్ళికి ? పెళ్ళయిన మరునాడే పిన్ని కాపురానికి వచ్చింది. ఆమె చిన్నదేమీకాదు. పాతికేళ్ళకు పైబడిన వయసు. టీచరుగా ఉద్యోగం చేస్తున్నది. ఆమె బదిలీకై నాన్న ప్రయత్నిస్తున్నాడు. ప్రస్తుతం ఆమె సెలవుపెట్టి కాపురం చేస్తున్నది.

ఆవిడకు తన గురించి ఏమి తెలుసు ?

ఒకనాడు తనుగదిలో కూచొని రాసుకుంటుంటే వచ్చింది. తన చదువుసంధ్యల గురించి అడిగింది. తన సర్టిఫికెటు చూచింది. తాను ఫస్టుక్లాసులో పచ్చినందుకు సంతోషం వెలిబుచ్చలేదామె.

''ఎందుకీ క్లాసులు ? పెళ్ళి చేస్తాయా ? ఆస్తులిస్తాయా ?'' అంది విసుగ్గా.

తను ఫస్టు క్లాసులో రావడమే కాదు, ర్యాంకుతో వచ్చింది. తనకు చదవాలనే ఉంది. అమ్మఉంటే తప్పకుండా ఎంట్రెన్సు పరీక్షకు కూర్చొని మెడిసన్‌లో జాయనవవలసిందే. కాని అప్పుడే అమ్మ చచ్చిపోయింది. నాన్నతో ఈ విషయం రెండుమూడు సార్లు ప్రస్తావించినా, అతను పట్టించుకోలేదు. బియస్సీలో చేర్పించడానికి కూడా అతను కాళ్ళు తేలవేశాడు.

ఈ యింట్లో ఉండడం కష్టంగా ఉంది.

పిన్ని ఏమీ అనడం లేదు.

కాని ఆమె వాలకం చూస్తే ఏమీబాగులేదు.

నాన్న ఉన్నంతసేపూ చాలా తియ్యగా, అభిమానంగా మాట్లాడుతున్నది. అతను గడప దిగడమేచాలు నెత్తిమీది బరువును ఎలా తొలగించు కోవాలని విసుక్కుంటున్నది.

పౌరుషంగల వాళ్ళకి ఆ యింట్లో ఉండడం కష్టం.

## 2

సరస్వతి తండ్రి ఆనందరావు క్యాంపు వెళ్ళిపోయాడు. శకుంతల పండుగకని పుట్టింటికి వెళ్ళిపోయింది. ఆలస్యంగా నిద్రలేచినా సరస్వతి వంటకోసం తొందరపడలేదు. తలంటి పోసుకుంది. తరువాత వండుకొని భోజనం చేసింది. వంటింటిపని ముగించుకొని మేడెక్కేసరికి పదకొండున్నర మాత్రమే అయింది. వారపత్రిక కొంచెంసేపు చదివింది. తరువాత మంచం తెచ్చి హాలులో వేసుకుంది.

సరస్వతి వాళ్ల అద్దెకున్న యిల్లు ఒక మాదిరిగా ఉంటుంది. మేడమీద పెద్దగది, చిన్నహాలు, చిన్నగది, వరండా, చిన్నడాబా, క్రిందను వంటకు భోజనాలకు ఒక గది ఉన్నాయి. పెరటిలో నుయ్యి, కాంపోండువాలు ఉన్నాయి. క్రిందనున్న భాగంలో మరొకరు ఉంటున్నారు. క్రిందనో నడవ ఉంది. దానిలోంచి పైవాళ్లు రావచ్చు. ఎవరికీ ఇబ్బంది ఉండదు. పెరడు రెండిళ్ళవాళ్ళకి కలిసేఉంది.

విశాఖపట్నంలో రెండే కాలాలు. ఒకటి ఎండాకాలం. రెండవది వానాకాలం. ఎండకాలమే హెచ్చు. డిసెంబరు వెళ్ళి జనవరి వచ్చినా చలికాలమనిపించదు. అంతా ఎండగనే ఉంది. మంచి ఎండల్లో చల్లని సముద్రపుగాలి వీస్తుంది. వర్షాకాలం ఏ అక్టోబరులోనో వస్తుంది. జల్లులుగా మొదలుపెట్టి గాలివానలతో ముగుస్తుంది. సరస్వతికి ఈ వూరి గాలి, ఎండ, వర్షం అంటే ఎంతో ఆనందం.

ఇప్పుడు సరస్వతికి ఒకటే ఆలోచన, ఆయింటినుండి ఎంత వేగం వెళ్ళి పోవాలని. ఇంతకు ముందు ఈ ఆలోచన లేదా ?... అమ్మ బ్రతికి నన్నాళ్లు ఎప్పుడూ ఇటువంటి ఆలోచన కలుగలేదు. అమ్మ చనిపోయిన తరువాత ఏ అలోచనకి తావేలేక పోయింది. కాని, పిన్ని ఇంట్లో కాలుమోపిన క్షణంనుండి ఈ ఆలోచన భూతంలా వెంట తరుముతున్నది.

కాలేజీలో చదువుకున్నప్పుడు సరస్వతి స్టూడెంట్సు అసోసియేషనుకు సెక్రెటరీగా ఉండేది. డిబేట్లలో పాల్గొనేది. కాలేజీకి పేరు తెచ్చింది. నాటకాలు వేయించింది. కుర్రాళ్లతో కలిసి చాల ఫార్వర్డుగా తిరిగేది. అప్పుడే రామాచారి పరిచయమయింది.

రామాచారి ఒడ్డూ, పొడవూ ఉన్నవాడు. ముఖం గుండ్రంగా ఉంటుంది. చాయ తెలుపు. మీసాలు అసలు ఉంచుకునేవాడు కాడు. కళ్లకిజోడు. బట్టలు మంచివి కట్టేవాడు. మంచి ఇంగ్లీషు మాట్లాడతాడు మగవాళ్లలో అతను, ఆడవాళ్లలోతను, ఆ యేడాది ఎలక్ష్యూషన్లలో బహుమతులు పొందారు. అప్పుడప్పుడు పలకరించుకునేవారు, నవ్వుకొని వెళ్లిపోయేవాడు అతను.

రామాచారి తనకన్న రెండేళ్లు సీనియరు. తను ఇంటరులో చేరి నప్పుడు అతడు బి. కామ్. చేస్తూ ఉండేవాడు. రామాచారి తండ్రికి ఉద్యోగంలేదు. పెరటిలో కొబ్బరి చెట్లున్నాయి. పెద్ద యిల్లుంది. వాళ్లు ఒక పెద్ద భాగంలో ఉండి నాలుగు పోర్షనులు అద్దెకిచ్చారు. రంగనాయకమ్మ కొబ్బరి కాయలమ్మి, ఇంటద్దెలు వసూలు చేసి ఇల్లు నడిపిస్తున్నది. పెద్ద కొడుకుని కాలేజీలో చదివిస్తున్నది.

తనుకూడా ఎప్పుడూ ఈ విషయం అతనితో ప్రస్తావించలేదు. అమ్మ పోయిన తరువాత వచ్చి పరామర్శించాడు. తరువాత ఎప్పుడైనా వీధిలో కనపడితే పలకరించేవాడు.

పిన్ని ఇంటికి రాగానే సరస్వతికి ఏదో భయం పట్టుకుంది. పిన్నివి పిల్లి కళ్లు. ఆమె నవ్వుతున్నట్లే ఉంటుంది. జాగ్రత్తగా చూస్తే పళ్లు కొరుకుతున్నట్లు తెలుస్తుంది. వచ్చిన మొదటి రోజునుండీ ఆమె ఇల్లు తన అధీనం చేసుకుంది. తన అధికారం వ్యక్తంచేసింది. ఇంట్లో ఉన్నవాళ్లు-అంటే తనూ, నాన్న, అమె చెప్పినట్లు వినాలి. ఆమె గొప్ప కింద దోసిలి పట్టాలి. ఆమె అటువంటివేమీ అనదు. కాని ఆమె అభిప్రాయం మాత్రం దృఢం చేసుకుంది.

అమ్మ వంటిమీద బంగారం ధరవచ్చిందని అమ్మింది. ఇరవై వేల రూపాయలు బ్యాంకిలో వేసింది. వాటిలో పదివేలు నాన్న రెండో పెళ్లికి ఖర్చు పెట్టాడు. మిగిలిన పదివేలు పిన్ని తన పేర మార్పించు కుంది. ఈ యింటివారి ప్రాణాలన్నీ ఆమె తన పిడికిటిలో పెట్టుకుంది.

నాన్నకి అన్ని విషయాలు తెలుసు. అసలే అమాయకుడు. ఆమె చెప్పినవన్నీ విని అమోదిస్తాడు. ఇల్లు ఒక విధంగా నరకంగా మారింది సరస్వతికి.

పిన్ని వెళ్లిపోయి వారం రోజులుపైగా అయింది. పండుగ అయిదు రోజులుంది. పండుగ వెళ్లిన పది రోజుల తరువాత ఆమె వస్తుంది.

ఇంతకి తను దురదృష్టవంతురాలు.

పిన్ని అ రోజు నాన్నతో కలిసి సినిమాకి వెళ్ళింది. తనను రమ్మన్నా తల నొప్పని వెళ్లలేదు. పిన్ని పైకి విచారం నటించినా, లోపల సంతోషించింది.

రామాచారి ఒక్కడే చీకట్లో వెళ్తున్నాడు. తను బజారువేపు వెళ్తున్నది. అతనే ముందు తనను పలకరించాడు.

"సరస్వతిగారా! క్షేమమా?"

"క్షేమమే"

"మీ గొంతుక మాత్రం ఏదో ఆందోళన వ్యక్తం చేస్తున్నది."

"నిజమే"

"మీ అమ్మగారి గురించి బెంగ పెట్టుకుంటే ఎలా మరి? జీవిం చాలి- ధైర్యంగా ఉండాలి."

"అదే... నేనూ అనుకుంటున్నాను. కాని ఏదో మానసికమైన వ్యధను తట్టుకోలేక పోతున్నాను."

"అలా డాబా గార్డెన్సు పార్కులో కూచుందామా? మీరు మీ కష్ట సుఖాలు చెప్పండి. నాకు తోచిన సలహా ఇస్తాను. సహాయం చేయడానికి ప్రయత్నిస్తాను."

సరస్వతి మరేమి జవాబు చెప్పలేదు. అతని వెంట పార్కుకు నడిచింది. ఇద్దరూ ఒక మూలనున్న బెంచీ మీద కూర్చున్నారు.

"నా సంగతి మీకు కొంత వరకూ తెలుసు. అయిదేళ్ల క్రింద మేము ఈ యింట్లో దిగిన దగ్గిర నుండీ నన్ను రోజూ చూస్తునేఉన్నారు. ఒక్కర్తెనే కూతురునని మా అమ్మ గారాబంగా నన్ను పెంచలేదు. నేను బాగా చదువు కోవాలని, స్వతంత్రమైన అభిప్రాయాలు కలిగి ఉండాలని, జీవితంలో ఒడిదుడుకులను ధైర్యంగా ఎదుర్కోవాలని తను ఆశించింది. ఆమె నన్నొక డాక్టరుగా రూపొందించాలని శత విధాలుగా కృషి చేసింది. కాని ఫలితం చేతికందే వేళకు లేకుండా పోయింది. అక్కడితో నా చదువు ఆగి పోయింది. మా సవతి తల్లి వచ్చిన తరువాత పరిస్థితులు పూర్తిగా మారి పోయాయి."

"మీరు కొద్దికాలం ఓర్పు వహిస్తే, ఏ అయ్యనో కట్టుకొని అత్తవారింటికి వెళ్ళి పోతారు."

"పెండ్లి అయితే ఈ యింటి నుండి బయటపడవచ్చు. కాని ఆ అవకాశం దూరంగా ఉంది. ఇంట్లో ఉన్నంత కాలం మరొకరికి భయపడుతూ, వారిని ద్వేషిస్తూ ఉండడం కష్టం. కాలేజీ జీవితం ఆడుతూ, పాడుతూ గడిపి వేశాను. అమ్మ చనిపోయిన తరువాత కూడా. ఏ యిబ్బంది లేకుండా గడిపాను. కాని పిన్ని ఇంట్లో అడుగుపెట్టిన ఈ నెల రోజుల నుండీ, రోజొక యుగంగా గడుపుతున్నాను."

"మీ పరిస్థితి దయనీయంగా ఉంది. ఏమైనా ఆలోచించారా?"

"ఏమిటాలోచించను ? ఇల్లు వదలి పారిపోవాలని అను కుంటున్నాను."

"ఒంటరిగానా?"

"అవును."

"మగతోడు లేకుండా మీవంటి అందమయిన అమ్మాయి వీధి పడితే మర్యాదగా బ్రతకడం కష్టం. అడవాళ్ల కోసం తోడేళ్లు కాచుకొని కూర్చుంటాయి. అటువంటి పని మాత్రం చెయ్యకండి.

"మరేం చేయడం? నన్ను పెళ్ళి చేసుకునే మగవాడు దొరుకుతాడా?"

"మీ దృష్టిలో ఎవరైనా ఉన్నారా!"

"అన్నీ సమస్యలే? ఎవరిని చేసుకోవడానికి, ఆమనిషి మంచి చెడ్డలు తెలియాలి కదా! ఈ పొగ నుండి తప్పించుకోవాలని నిప్పులోకి దూకడం సమంజసం కాదు."

"ఈ పద్ధతి విడిచిపెట్టి, మరేదేనా దారి ఉందా?"

"అప్పటికీ మా నాన్నను బతిమాలాను. కనీసం టీచరు ట్రెయినింగుకేనా పంపమన్నాను. ఆ విధంగా నయినా మరొక ఊరు పోవచ్చు ననుకున్నాను. ఈ ఊళ్లో అయినా సరేనన్నాను. కాని ఆయన దేనికి అంగీకరించలేదు."

"అయితే ఏం చేయ దలిచారు?"

"ఏమున్నది - ప్రాణం విసిగిపోతే ఉరి పోసుకు చావాలి"

"అటువంటి పని చెయ్యకండి - బ్రతికుంటే మంచి రోజులు వస్తాయి."

"మళ్ళా ప్రసంగం మొదటికే వచ్చాము. పోనీ! ఒక్క సంగతి. మీరు మరో విధంగా అనుకోరు కదా! మీరు, నేను కలిసి పారి పోదాం-పెళ్ళి చేసుకుందాం. ఉద్యోగాలు చేద్దాం?"

సరస్వతి మాటలువిని ఒక్కసారి రామాచారి నిశ్చేష్టుడయాడు.

"నేను అనాకారిని కానని మీరే ఒప్పుకుంటున్నారు. ఇంటరు ఫస్టు క్లాసులో పాసయాను. మీరు, నేను ఇద్దరం ఉద్యోగాలు చేసుకుందాం. ఏ దూర దేశమో పోయి హాయిగా ఉందాం."

అపదలో నున్న అబలకు సహాయం చేయబోయి రామాచారి చిక్కులో పడ్డాడు.

"ప్లీజ్! మీరు బాగా ఆలోచించండి. వేడుకుంటున్నాను. న
సహాయం చేయండి. మీరు ముందుకు రాకపోతే నే నీవిధంగా ఆ
చించి ఆలోచించి కొద్ది రోజులలోనే పిచ్చి దాని నవుతాను."

రామాచారి ఆలోచించాడు.

"నాకు కొంత వ్యవధి ఇవ్వండి. మీ పరిస్థితి వేరు. నా కిం
వరకు సమస్యలన్నవి లేవు. కాలేజీ-చదువు-ఇల్లు-షికార్లు-సినిమా
పెళ్ళి గురించి ప్రస్తావనే లేదు. అమ్మాయిల వేపు చూడడం, మా
డడం-అది కేవలం అద్వాంచరే. మీకు సహాయం చేయాలని ఉం
మీ వంటి అందమయిన అమ్మాయి, చదువుకున్నది దొరకడ
అదృష్టమే. నన్ను ఆలోచించనివ్వండి. మళ్ళా మనం రెండు, మూ
రోజులతో కలిసి మాట్లాడుకుందాం."

ఆ రోజు అలా గడిచిపోయింది. మరునాడు రామాచా
కలియాలని సరస్వతి చాల ప్రయత్నించింది. అతను దొరకలేదు.
రాత్రి కూర్చుని ఉత్తరం మొదటిది వ్రాసి చాల శ్రమపడి మరునా
దానిని అందజేసింది. ఆవిధంగా వారం రోజులలో మూడు ఉత్తరా
పంపించింది. ఈ కొద్ది రోజులలోను బాగా చిక్కి పోయింది. క
లోనికి పోయాయి. ఎప్పుడూ ఆలోచనే. చివరకు ఒక సాయంకా
ఇద్దరూ మళ్ళా కలుసుకున్నారు. ఎక్కడికేనా పారి పోయి పె
చేసుకొని తిరిగి వస్తే పెద్దవాళ్ళేమీ అనలేరు. అప్పుడు రామాచారిం
పడి ఉండవచ్చు. రంగనాయకమ్మగారు చాల మంచివారు. తల్లి
పిల్లను ఆమె నిరాకరించదు. సరస్వతిలో ఒక వారం రోజులలో వచ్చి
మార్పు చూసి, రామాచారి ఆర్రాత్రే ఆమెతో కలిసి మద్రాసు పో
డానికి, అక్కడ రెండు నెలలు ఒక స్నేహితుడి యింట్లో గడి
రిజిస్టరు మారేజ్ చేసుకొని తిరిగి రావడానికి అంగీకరించాడు.

కాని దైవం అంగీకరించలేదు.

ఆ అవకాశం దాటి పోయింది.

పిన్ని ప్రయత్నాలు ఇంకా బిగుసుకుంటున్నాయి.

ఏం చెయ్యాలి ?

సరస్వతికి తలకొట్టుకోవాలని అనిపించింది.

(ఇంకా ఉం



## ......ఎంత దౌర్భాగ్యుణ్ణి!

ఓ చానా!
ప్రకృతిలోని తిర్యక్కులన్నీ
నీ అంగాంగాల సొబగుల్ని
సొంతం చేసుకొని

చిత్తరించు చూపులతో
కలకలలాడుతునాచేయి!
కుహూ రవాలతో
కమ్మగా పాడుతున్నాయి!
అల్లల్ల అడుగులు వేస్తూ
తీవిగా అల్లాడుతున్నాయి!
పించియం విప్పి
నలువుగా నర్తిల్లుతున్నాయి!

కాని ....
మనిషినయిన "నేను"
నీ హృదయంలో "మెలుకుమనే"
అచ్ఛాచ్ఛమయిన అనురాగాన్ని
కైవశం చేసుకొని
గగురునొందలేక పోతున్నాను!
నీలో సగంగా లీనమై
ఒడబడలేక పోతున్నాను!
వామదేవునిగా మారి
అమృతానందాన్ని కొల్లగొనలేక పోతున్నాను!
హా హా! ఎంత దౌర్భాగ్యుణ్ణి!!!

## మీ విలువ లింతే!

కళ్ళల్లో నీళ్ళు,
ఎదల్లో పాలు
పొరలు చుండే
నువ్వేమో "కరుణామూర్తివి!"

నీ కళ్ళల్లోని నీళ్ళను వదలి
ఎదల్లోని పాలను గ్రోలుతూ
లీలగా తిరుగులాడుచుండే
వాడేమో "పరమహంస!"

అనాది నుంచి
ఈ సంఘంలో
మీ విలువ లింతే!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు



ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# బీద దేశాల మేలులోనే ధనిక దేశాల క్షేమం

### బీద దేశాల మేలుకు వ్యూహం :

దారిద్ర్యంతో బాధపడుతున్న తృతీయ ప్రపంచ ప్రజలకు ప్రపంచ మానవ సమాజమంతా సహాయం చెయ్యవలసిన ఆవశ్యకత ఉన్నది. అందుకుగాను ఈ ప్రపంచంలోని వర్ధమాన, బీద దేశాల్లో ఆర్థిక వృద్ధి వేగాన్ని పెంచాలి. ప్రపంచ ఆర్థిక మాంద్యం అభివృద్ధి మీద దెబ్బ కొట్టింది. ఇందువల్ల అందరికంటె తక్కువ ఆదాయాలున్న దేశాలు ఎక్కువ బాధ పడుతున్నయ్యి. ఈ పేదరికపు బాధల్ని తొలగించడానికి అంతర్జాతీయ మానవ సమాజము దయ, పట్టుదల గల్గి, నేర్పుతో తగిన అభివృద్ధి వ్యూహాన్ని తయారు చెయ్యాలి. వర్తమానం చూపిస్తున్న సత్యాలు, గత కాలం నేర్పిన గుణ పాఠాలు భవిష్యత్ శ్రేయస్సును ఏర్పర్చడానికి పనిచేసే ఆర్థిక వ్యూహానికి పునాది కావాలి. ఈ వ్యూహం విజయవంతం కావడానికి అభివృద్ధి ప్రక్రియలో విశ్వాసం వుండటం అత్యవసరం.

### గుణపాఠాలు :

గత కొద్ది కాలం నుండి పారిశ్రామిక ప్రపంచానికి ఈ అభివృద్ధి ప్రక్రియలో విశ్వాసం తగ్గింది. 1950, 1960, 1970 దశకాల్లో తృతీయ ప్రపంచ ఆర్థికాభివృద్ధి ప్రక్రియను బలపర్చే ప్రయత్నంలో సాహసము, ఉత్సాహము కన్పించినై. ఈ ప్రయత్నం కొత్త మార్గాల వెంట, ఇంతవరకు చేయని పద్దతుల్లోనూ జరిగింది. అయినా కొన్ని తప్పుడు మలుపులు తిరిగాము. ముందు మార్గాన్ని చూడలేనప్పుడు కూడా ప్రయాణించాము. అందువల్ల వుచ్చుల్లో తగులుకున్నాము. అయితే, తరువాత మన తప్పులనుండి గుణ పాఠాలు నేర్చుకున్నాము. సమస్యల్ని బాగా అర్థం చేసుకున్నాము. పద్ధతుల్ని మెరుగు పర్చుకున్నాము. సాధించిన విజయాల్ని సాధించవలసిన సత్ఫలితాలకు ఆధారం చేసుకున్నాము.

### నేర్చుకున్న వివరాలు :

అభివృద్ధిని నిర్మాణంచేస్తూ మూడు విషయాలు నేర్చుకున్నాము. (1) అభివృద్ధి నిర్మాణంలో తమ విజయం సాధించేందుకు వర్ధమాన దేశాల స్వీయ ప్రయత్నాలే కీలకంగా పనిచేస్తాయి. (2) వర్ధమాన దేశాల అభివృద్ధిని సాధించేందుకు అంతర్జాతీయ ఆర్థిక సహాయం తప్పనిసరిగా కావాలి (3) ఆర్థికాభివృద్ది ప్రక్రియ ముందంజ వేస్తూనే ఉన్నది. ఇందువల్ల, ఇందుకు విరుద్ధంగా అభివృద్ది విషయ ప్రవీణులు భవిష్యత్తులో వస్తాయని చెప్పిన చెడు ఫలితాలు రాలేదు. కాని అభివృద్ధి మాత్రం చాలా మంది ధైర్యంగా అనుకున్నదాని కంటె ఎక్కువగానే లభించింది.

### ధనిక దేశాల అలసట కారణాలు :

కాని నేటి పారిశ్రామిక ప్రపంచంలో చాలా భాగం వర్ధమాన దేశాల అర్థికాభివృద్ధికి సహాయంచేసి అలసిపోయినట్లు కన్పిస్తున్నారు. మూడు దశాబ్దాలుగా ఈ అభివృద్ధి ప్రయత్నానికి చేసిన అంతర్జాతీయ దోహదంవల్ల ఫలితం కన్పించడంలేదంటున్నారు. బిలియన్ల సంఖ్యలో కరెన్సీ అప్పిచ్చి ఖర్చుచేసినా వర్ధమాన దేశాల్లో బీదల సంఖ్య యిది వరకటి కంటె ఎక్కువయ్యిందంటున్నారు. అందువల్ల అభివృద్ధి సహాయాన్ని రెట్టింపు చెయ్యమని ఎలా అడుగుతారు? అభివృద్ధి చెందిన దేశాలు ఎలా చేస్తయ్యి అని అంటున్నారు. వర్ధమాన దేశాల ప్రజలు మరింత పేదరికంలోకి పోతూ, మేమెవ్వరిని ధనవంతుల్ని చెయ్యము అని అంటున్నారని విమర్శ వినబడుతోంది.

ఈ సహాయ అలసటకు పారిశ్రామిక దేశాలే తగినంతగా కారణమని చెప్పవచ్చు. తృతీయ ప్రపంచాభివృద్ధి ఆవశ్యకతను ప్రపంచానికి నాటకీయ ఫక్కీలో చెప్పడానికి ప్రయత్నించి పారిశ్రామిక దేశాలు కాని విషయాలకు ప్రాధాన్యత నిచ్చినయ్యి. వందల మిలియన్ల ప్రజలు తృతీయ ప్రపంచంలో బాధపడుతూ వుండటం చూస్తే మనకు నిజంగ నే

బాధ కల్గుతుంది. ఆ దుర్భర పరిస్థితిని మార్చడం ఎంత కష్టమో తృతీయ ప్రపంచ ప్రజలకు తెలిజెప్పాలి. అలా తెలియ జెపుతూ వున్నప్పుడు వర్ధమాన దేశాలు అభివృద్ధి చెందవని నిరాశ చెంద కూడదు. ఈ సందర్భంగా ఆశను వదులుకుంటే తృతీయ ప్రపంచం సమస్యల్ని పరిష్కరించలేమనే అనుమానం కల్గుతుంది.

## అభివృద్ధివల్ల ఆశ :

అభివృద్ధి జరగడమే ఆశా సందేశము. అభివృద్ధి నెమ్మదిగా జరగవచ్చు. కాని ఇందువల్ల వందల మిలియన్ల ప్రజలకు ఏ కొద్ది పాటైనా మేలు జరుగుతూనే ఉన్నది. ఈ మేలు జరుగుతూనే ఉంటుంది, దారిద్ర్య వలయంలో ఇంకా కూడా చిక్కుకుని వున్న వారికి కూడా ఇందువల్ల మంచి జరిగేట్లు చెయ్యవచ్చు. అయితే ఇందుకుగా అంతర్జాతీయ మానవ సమాజము దీక్ష వహించి సహకరించి పని చెయ్యాలి.

## బీద దేశాల్లో వృద్ధి రావడం లేదనడం నిజం కాదు :

పారిశ్రామిక దేశాలనుండి ఆర్థిక సహాయం అందినప్పటికి తృతీయ ప్రపంచ దేశాలు ఆర్థికంగా వృద్ధి చెంద లేక పోతున్నావని చెప్పడంలో ఎంత నిజముందో ఆర్థిక చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుంది. ఈనాటి అభివృద్ధి చెందిన దేశాలు తమ పారిశ్రామికీకరణ దశకు చేరే ముందు కాలంలో సాధించిన సగటు అర్థిక వృద్ధి రేట్లను, ఈనాటి వర్ధమాన దేశాలు ఈ శతాబ్దం మూడో భాగంలో సాధించిన ఆర్థిక అభివృద్ధి రేట్లతో పోల్చి చూస్తే ఆశ్చర్యకరమైన సత్యాలు బయటపడగలవు. ఒక దశాబ్దం క్రితం ఈవిషయ పరంగా ప్రొఫెసర్ సైమన్ కుజ్‌నట్స్ నేడు పారిశ్రామిక దేశాలుగా ఎంచబడుతున్న పద్నాలుగు దేశాలను గురించి సమాచారం సేకరించి ప్రచురించాడు. ఇందులో పది యూరోపియన్ దేశాలుకాగా మిగతావి అమెరికా సంయుక్త రాష్ట్రాలు జపాను, కెనడా, ఆస్ట్రేలియా. ఈ దేశాలన్నీ కూడా 1860 నుండి 1960 వరకు సాలీనా, తలసరి ఆదాయంలో, రెండు శాతం సగటు వృద్ధి రేటును సాధించినవి. ఈ దేశాలు 1830-1870 కాల వ్యవధిలో ఆధునిక అర్థికాభివృద్ధిలో కాలు పెట్టినయ్యి. ఈ సమయంలో ఈ దేశాలు ఇతర దేశాల కంటె ముందంజ వేసే ఉన్నయ్యి. ఆనాటికే, సాపేక్షికంగా, ఈ దేశాల తలసరి ఆదాయం ఇతర దేశాల కంటె హెచ్చుగా ఉన్నది.

## బీద దేశాల్లో వ్యతిరేక పరిస్థితులు :

ఇరవయ్యవ శతాబ్దం మధ్యలో ఆర్థికాభివృద్ధికి నూతన ప్రారంభం చేసిన నేటి వర్ధమాన దేశాలకు ప్రారంభ స్థాయిలో పై చెప్పిన అనుకూలత లేదు. ఈ వర్ధమాన దేశాలకు ఆర్థిక వృద్ధి చరిత్ర లేదు. ఆర్థిక వృద్ధి కవసరమైన పూర్వావసరాలు. నేటి వర్ధమాన దేశాల్లో బహు కొన్నింటికి మాత్రమే ఉన్నయ్యి. ఈ దేశాల్లోని రోగ నిర్మూలన కార్యక్రమాలు జనాభాను బాగా పెంచుతున్నయ్యి. ఈ స్థితిలో జనాభా వృద్ధిని అధిగమించగల ఆర్థిక వృద్ధిని ఈ వర్ధమాన దేశాలు ఏర్పాటు చేయలేక పోతున్నయ్యి. ఈ పరిస్థితుల్లో ఈ వర్ధమాన దేశాల సాలీనా వృద్ధి రేటు సున్నా నుండి కొద్ది శాతం వరకు మాత్రమే వుండగలదని ఆర్థిక విషయ నిపుణులు చెప్పారు. 1950, 1960, దశకాల్లో ప్రపంచ బ్యాంకు నిపుణులు పై రీతిలోనే చేసిన సూచనలు నిజంగా లేక నిరాశా జనకమైనవని తేలింది. కొలంబియా నుండి ఇండియా వరకు ఇంతే జరిగింది.

## వర్ధమాన దేశాల గొప్ప విజయాలు :

చాలా ఆశ్చర్యకరమైన ఆర్థిక వృద్ధి రేట్లను బీద దేశాలు సాధించినవి. 1955కు 1980కి మధ్యకాలంలో ఈ వర్ధమాన దేశాలు శూన్య శాతము, రెండు శాతము గాకుండా మూడు శాతంపైన వృద్ధి రేట్లను సాధించినవి. గణనీయమైన ఈ ఆర్థిక వృద్ధి కార్య నిర్వహణ ఫలితాలు ఆర్థిక శాస్త్ర వేత్తలను గాభరా పెట్టినయ్యి. అరవై ఆరు వర్ధమాన దేశాల్లో ఒక్కటికూడా 1961-1976 మధ్య కాలంలో 3 శాతం సాలీనా సగటు ఆర్థిక వృద్ధి రేటును సాధించ లేదని చెప్పారు. కాని నిజానికి పద్దెనిమిది వర్ధమాన దేశాలీకాలంలో మూడు శాతం సాలీనా సగటు ఆర్థిక వృద్ధి రేటును సాధించినయ్యి.

## పారిశ్రామిక దేశాల కంటె ఎక్కువ విజయం :

1955-1980 మధ్యకాలంలో చాల వర్ధమాన దేశాలు పారిశ్రామిక దేశాలకంటె ఆర్థికాభివృద్ధిని వేగంగా ముందుకు తీసుకు పోయినయ్యి. ఇలా ముందంజ వేసిన వర్ధమాన దేశాల్లో జనాభా వృద్ధి రేట్లకంటె ఆర్థిక వృద్ధి రేట్లు వేగంగా ముందంజ వేసినయ్యి. ఈ దేశాల పారిశ్రామిక ప్రాతిపదికలు విస్తృత మయినయ్యి. చరిత్రను సృష్టించే విధంగా ఆ దేశాలు వ్యవసాయోత్పాదన వృద్ధి రేట్లు పెరిగినవి. వాటి విద్యా వ్యవస్థలు కూడా వేగంగా అభివృద్ధి చెందినవి. ఆ వర్ధమాన దేశాల్లో మానవ ఆయుస్సు కాలం పెరిగింది. శిశుమృత్యు రేట్లు తగ్గడం కూడా జరిగింది.

## వర్ధమాన దేశాల సమర్థత :

విస్తృత ప్రాతిపదికపై చూస్తే పై ఫలితాలు చాలా మంచి అభిప్రాయాన్ని కలుగజేసినై. ఈ ఫలితాలకు వర్ధమాన దేశాల స్వయంకృషి హెచ్చుగా కారణం కావడం ఆనందించదగ్గ విషయము.

ఇంతకుముందు కంటె అనుకూలంగావున్న అంతర్జాతీయ ఆర్థిక వాతావరణాన్ని వీరు ఉపయోగించుకుని సత్ఫలితాలు సాధించగల్గారు. ప్రణాళికా రచన చేయడంలోను, తమ ఆర్థిక కార్యాలను బాగా నిర్వహించడంలోను వీరు తమ సామర్థ్యాలను పెంచడానికి తీవ్రంగా కృషి చేసారు. తమ దేశీయ పొదుపు, పెట్టుబడి రేట్లను అంతరాయం కాకుండా పెంచగల్గారు. విదేశాల నుండి తమ కందిన మూల ధన ప్రవాహాలను ఉత్పాదకంగా ఉపయోగకరంగావడాన్ని హెచ్చు చేయ గల్గారు. ఇంతవరకు వర్థమాన దేశాల్ని ఒక సమూహంగా ఎంచి చెప్పాము. అయితే ఈ దేశాల్లో వృద్ధి రేట్ల సాధన మొదలైన విషయాల్లో తేడాలున్నవి.

## 1970 తరువాత వర్థమాన దేశాల వెనుకంజ :

ఆర్థిక వృద్ధి రేట్ల లభ్యతకు సంబంధించిన సత్యాలు గమనార్హములు. 1955 - 1970 కాల వ్యవధిలో మధ్యరకం ఆదాయాల లభ్యమౌతున్న వర్థమాన దేశాల్లో తలసరి ఆదాయాలు సాలీనా సగటున మూడున్నర శాతం వృద్ధిని సాధించినవి. అయితే ఈ వృద్ధి రేటు 1970 దశకంలో మూడు శాతానికి పడిపోయింది. అయితే 1980 నాటికి ప్రపంచ జనాభాలో 47 శాతం ప్రజలుండి, తక్కువ ఆదాయాలు లభ్యమౌతున్న దేశాల్లో తలసరి సగటు సాలీనా ఆదాయం రెండు శాతం పెరుగుదలను మాత్రమే పొందింది. ఈ మాత్రం వృద్ధి రేటు కూడా చైనా గట్టి ప్రయత్నాలవల్ల లభ్యంకాగా, యింతకు కొద్ది కాలం ముందునుండి భారతదేశంలో కూడా సాలీనా సగటు తలసరి ఆదాయం ఇదేవిధంగా వృద్ధిచెందింది. కాని తక్కువ తలసరి ఆదాయాలుగల సబ్ - సహారన్, దక్షిణ ఆసియా దేశాల్లోని తలసరి ఆదాయం 1980 కు ముందున్న ఒక ఇరవై అయిదు సంవత్సరాల్లో సాలీనా సగటున 1.2 శాతం మాత్రమే పెరిగింది. గత దశాబ్దంలో అసలు పెరగనేలేదు.

## మధ్యరకం ఆదాయంగలవారి ముందంజ, తక్కువ ఆదాయం వారి వెనుకంజ :

పారిశ్రామిక దేశాల్లోని ఆదాయాలకు, మధ్యరకం ఆదాయాలు గల దేశాల్లోని ఆదాయాలకు మధ్యగల ఆదాయ వ్యత్యాసాలు నెమ్మదిగా తగ్గిపోవడం గమనిస్తున్నాము. కాని అతి బీద దేశాలుమాత్రం యింకా, యింకా వెనుకబడిపోతున్నవి. వర్థమాన దేశాల్లో కొన్ని వేగంగా అభివృద్ధిచెంది ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో పోటీకి నిలబడగల్గుతుండగా, కొన్ని వెనుకబడిన దేశాలు మాత్రం, ముఖ్యంగా సబ్ - సహారన్ దేశాలు తక్కువ వృద్ధి రేట్లతోను, వృద్ధిరేట్ల రాహిత్యతతోను సతమత మౌతూ, విస్తృతమైన బీదరికం సమస్యలలో చిక్కుపడిపోయి ఉన్నాయి.

## తక్కువ ఆదాయంగలవారి అభివృద్ధికి కావలసినవి :

వేగిత్వరణగల వృద్ధిని సాధించడానికి దశాబ్దాలు పడుతుందని, కొన్ని దేశాల విషయంలో శతాబ్దాలు పడుతుందని, చరిత్రలో కన్పిస్తోంది. తక్కువ ఆదాయస్థాయిలోనున్న దేశాల్లో వేగిత్వరణతో వృద్ధిచెంది దాన్ని నిలుపుకోగల శక్తినియిచ్చే నైపుణ్యంగల కీలక మానవ వనరుల్ని, భౌతిక అవస్థాపనకు, ఉత్పాదక మూలధనాన్ని సమరవంతమైన సంస్థలను సంపాదించడానికి బాధలతో, కూడిన దీర్ఘ ప్రక్రియ అవసరమౌతుంది.

## నూతన పారిశ్రామిక దేశాలనుండి ఆశ :

నూతనంగా పారిశ్రామికాభివృద్ధిని సాధిస్తున్న దేశాలు తక్కువ ఆదాయంగల దేశాల్లో కూడా వృద్ధిని పొందవచ్చుననే ఆశను కల్గించ గలవు. ముందజవేస్తున్న దాదాపు ఇరవైనాలుగు మధ్యరకం ఆదాయాలుగల దేశాలు — లాటిన్ అమెరికా, దక్షిణ ఆసియా, ఆసియాలోని పసిఫిక్ అంచున గల దేశాలు — వాటి వృద్ధి రేటును వేగంచేసుకోవడంలో విజయవంతమైనవి. ఈ దేశాలు వాటి వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో ఉత్పత్తినిపెంచి, ప్రపంచ మార్కెట్లలో చాలా భాగాల్ని తమ వ్యాపారంతో నింపగల్గుతున్నాయి. ఉదాహరణగా థాయ్‌లెండ్‌ను చెప్పవచ్చు.

## థాయ్‌లెండ్ ఆదర్శము :

గత ఇరవై సంవత్సరాల్లో థాయ్‌లెండ్ ఆర్థిక వ్యవస్థ సాలీనా ఎనిమిది శాతం వృద్ధిరేటు పొందింది. ఈ వృద్ధిరేటు పబ్లిక్, ప్రయివేటు రంగాలన్నింటా లభించింది. ఎగుమతులు సగటున సాలీనా పధ్నాలుగు శాతం పెరిగినవి. తలసరి ఆదాయం 1960లో 110 డాలర్లు రాగా 1980లో 670 డాలర్లకు పెరిగినది. ఇరవై సంవత్సరాల్లో ప్రపంచ బ్యాంకు, దాని అనుబంధ సంస్థలు థాయిలెండ్‌కు మూడు బిలియన్ల డాలర్ల అప్పుఇచ్చినవి. ఆదేశం ఆసహాయతిని సద్వినియోగం చేసుకుంది. ఈనాడు థాయ్‌లెండ్ అంతర్జాతీయ వ్యాపారంలో పాల్గొంటున్న వర్థమాన దేశాల్లో చాలా సచేతనమైన శక్తి. థాయిలెండు ఈ అనుభవం ముందురోజుల్లో తక్కువ ఆదాయాలుగల్గి బీదరికంతో బాధపడుతున్న దేశాల అనుభవంకాబోదని ఎలా చెప్పగలం ? ముందు వరుసలోవున్న పారిశ్రామిక దేశాలకు మధ్యరకం ఆదాయంగల దేశాలు సన్నిహితంకావడం తక్కువ ఆదాయంగల దేశాలకు ఆశా జ్యోతి కావాలి. కొత్తగా పారిశ్రామికమౌతున్న దేశాల పురోభివృద్ధి

ంటే తక్కువ ఆదాయంగల దేశాల అభివృద్ధి తక్కువగా కనిపించ వచ్చు. కాని తక్కువ ఆదాయ దేశాలు ఒక తరంలోనే వారి తలసరి వాస్తవ ఆదాయాన్ని రెట్టింపు చేసుకోవడంలో జయప్రదం కావడం దుదావహం.

## నిరాశ వద్దు : వ్యతిరేక పరిస్థితిలో గట్టిగా పని చేయాలి :

ఇటువంటప్పుడు చాలా తక్కువ ఆదాయ దేశాల ఆర్థిక సమస్యలను చూసి నిరాశ, నిస్పృహ, విముఖత చూపవలసిన అవసరమేముంది ? వారి సమస్యల్ని, ముఖ్యంగా సబ్ సహారన్ ఆఫ్రికా దేశాల సమస్యల్ని చూచి, ఆర్థిక సహాయ రంగంలో పని చేస్తున్న వారెవరూ కూడా వాటి భయంకర పరిమాణాన్ని తక్కువగా అంచనావేయడంలేదు. ఆ సమస్యలటువంటివారికి బాగా తెలుసు. వర్థమాన దేశాలు పురోగమనంచేసిన గత దశాబ్దాలలోని ఆర్థిక వాతావరణం కంటే నేటి ఆర్థిక వాతావరణం తక్కువ అనుకూలంగావున్నదనే సత్యాన్ని ఎవరూ కాదనడంలేదు. అందువల్ల ఈ సమస్యల పరిష్కారానికి పూనుకున్న అంతర్జాతీయ సమాజం శక్తిని అర్థం చేసుకుని బలపరచాలి. ఈ శక్తిని అందరూ అంగీకరించే వ్యూహంగా మార్చి తక్కువ ఆదాయంగల దేశాల వృద్ధిని వేగంగా సాధించడము, వాటి పేదరికాన్ని తగ్గించడము అవశ్యము.

## బీద దేశాల ఎగుమతులు పెరగాలి :

ప్రపంచం ఆర్థికంగా కోలుకోకుండా ఈ కఠినమైన సమస్యను పరిష్కరించడం ఎక్కువ కష్టమని చెప్పకుండానే తెలుస్తుంది. తక్కువ ఆదాయ దేశాల భవిష్యదార్థికవృద్ధి వారి భవిష్యత్ ఎగుమతుల వృద్ధిమీద ఆధారపడుతుంది. ప్రపంచ ఎగుమతుల్లో వారి ఎగుమతులు రెండు శాతంగా మాత్రమే వున్నవి. గత ముప్ఫయి సంవత్సరాల్లో ఈనాడు ఇంధనేతర వస్తువుల వాస్తవ ధరలు అతి తక్కువగా వున్నవి. పారిశ్రామిక దేశాల ఆర్థిక రక్షణ విధానంవల్ల వర్థమాన దేశాల ఎగుమతుల్ని వివిధ ముఖాల విస్తృతం చెయ్యడానికి వీలు పడటంలేదు. ముఖ్యంగా సబ్‌సహారన్ ఆఫ్రికా ఎగుమతులద్వారా తన ఆదాయాన్ని పెంచడం చాలా కష్టంగా ఉన్నది.

## ఆర్థిక మాంద్యం, ఉత్పాదన చక్ర రాహిత్యత వల్ల ముందంజ లేదు :

ప్రపంచ ఆర్థిక మాంద్యంవల్ల రాయితీరేట్లమీద ఆర్థికసహాయం చేయడంలో స్తంభన ఏర్పడింది. దాంతో ఈ సహాయం మీద ఎక్కువగా ఆధారపడే తక్కువ ఆదాయ దేశాల సమస్యలు పెరిగినవి. ఇందులో చాలా దేశాలు ప్రాథమిక వస్తువుల్ని ఎగుమతి చేసే దేశాలు మాత్రమే. ఇందులో కొద్దిగా తప్ప మిగతా వాటికి ఉత్పాదన చక్రం లేక పోవడంవల్ల, ఫ్యాక్టరీ వస్తువుల్ని తయారుచేసి అంతర్జాతీయ వ్యాపారంలో పాల్గొనే అవకాశం చెప్పదగినంతగా లేకుండా పోయింది. ఈ దేశాలకు ఉత్పాదన చక్రాలను ఏర్పర్చుకోవడము కష్టమైన పని. అందువల్ల వారు అంతర్జాతీయ వస్తుధరల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసి వస్తోంది.

## ఆర్థిక మాంద్యం మధ్యరకం ఆదాయం గలవారికి కూడా దెబ్బ

అతి బీద దేశాలమీద ప్రపంచ ఆర్థిక మాంద్యం వాస్తవ ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయరాదు. పడిపోయిన వస్తు ధరల ప్రభావాలు దేశ ఆర్థిక వ్యవస్థను బాగా చెడగొట్టగలవు. మధ్య రకం ఆదాయాలుగల సబ్ సహారన్ ఆఫ్రికా తలసరి జాతీయాదాయాన్ని కూడా తగ్గిపోయిన వారి వస్తువుల ధరలు చెడగొట్టగలవు.

## ఆర్థిక మాంద్యంవల్ల జాంబియాకు దెబ్బ :

ప్రపంచ మంతటా తగ్గిపోయిన రాగి ధరలు జాంబియా దేశ ప్రభుత్వ ఆదాయాన్ని బాగా తగ్గించి వేస్తున్నవి. ఆ దేశ ప్రభుత్వ బడ్జటు వాస్తవ రూపంలో 1982లో కంటె 1983తో ఇరవై శాతం తగ్గింది. ప్రతి సంవత్సరం వేసే ఆరోగ్య కార్యక్రమ సంబంధమైన బడ్జటు ఎక్కువగా తగ్గించి వేయబడింది. ఆరోగ్య రక్షణ కార్యక్రమాలకు ఖర్చుచేసే నిధులు బాగాతగ్గినవి. డబ్బులేక వాహనాల కుపయోగించే అదనపు సామాన్లు బాగుచేత, పోషణ తగ్గి ఆరోగ్య మంత్రిత్వ శాఖ ఉపయోగించే వాహనాలు పదిహేను శాతము పనిచెయ్యకుండా మూలబడి పోయినవి. అందువల్ల జాంబియా గ్రామీణ ప్రాంతాల్లో అమలు జరుపవలసిన ప్రాథమిక ఆరోగ్య రక్షణ కార్యక్రమాలకు కావలసిన వస్తువులు అందకుండా పోయినవి. ఒకే వస్తువుమీద ఆధార పడటంవల్ల వచ్చే ప్రమాదానికి, అనేక వస్తువుల నుపయోగించటంవల్ల కలిగే లాభం ప్రాముఖ్యతకు యింతకంటె మంచి ఉదాహరణ అవసరములేదు. సబ్ సహారన్ ఆఫ్రికాలోని అన్ని దేశాలకు ఈ విషయం వర్తిస్తుంది. ఆ దేశాల ప్రజలు అంతర్జాతీయ ఆర్థిక వాతావరణ మార్పులకు బలి అయిపోతారు సబ్ సహారన్ ఆఫ్రికాలోని తక్కువ ఆదాయ దేశాలు అనుసరించగల ప్రత్యామ్నాయ విధానాలు చాల తక్కువగా వుంటాయి. ఆ దేశాంమీద ప్రపంచ ఆర్థిక మాంద్యం చూపే చెడు ప్రభావాన్ని తొలగించడము కష్టమౌతుంది.

## కోలుకోవడానికి చిహ్నాలు :

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోను, యూరప్‌లోని కొన్ని దేశాల్లోను ఆర్థికంగా కోలు కొనడానికి గుర్తుగా కొన్ని చిహ్నాలు

కన్పిస్తున్నవి. మొత్తంమీద ప్రపంచ ఆర్థిక పరిస్థితులు కోలు కుంటున్నట్లు కన్పిస్తూ ఆశాజనకంగా ఉన్నవి. అయితే ఈ కోలు కోవడం ఎంతకాలం జరుగుతుంది? ఎంత బలంగా ఉంటుంది? అనేవి ఆలోచించవలసిన ప్రశ్నలు.

**ధనిక దేశాలు చేతులు ముడుచుకు కూర్చోరాదు :**

తక్కువ ఆదాయంగల దేశాలు, పేదరికంతో బాధలు పడే వారి ప్రజలు కోలుకొనే వరకు, అంతర్జాతీయ సమాజము చేతులు ముడుచుకు కూర్చోరాదు. సమస్యల పరిష్కారాని కవసరమైన అంతర్జాతీయ చర్యలను వాయిదా వెయ్యరాదు. ఆర్థిక మాంద్యంవల్ల గడ్డు సమస్యలు మరింత తీవ్రమైనవి. వాటి సమస్యలు పరిష్కారానికి రాకుండా బాగా ఎదురు తిరుగుతున్నవి. అయితే ఆర్థిక మాంద్యం రాక పూర్వంనుండి ఈ సమస్యలున్నయ్యనే విషయాన్ని మర్చిపోరాదు. ప్రపంచం ఆర్థిక మాంద్యం నుండి కోలుకున్నంతలోనే తక్కువ ఆదాయ దేశాల్లో ఆర్థిక వృద్ధి జరగదు కొద్దిపాటి ఆర్థిక వృద్ధి మాత్రం జరుగుతుంది. అంతర్జాతీయ వ్యాపార విస్తృతి నెమ్మదిగా జరిగే పని. బాగా తగ్గిపోయివున్న వస్తువుల ధరలు నెమ్మదిగా మాత్రమే పెరగ గలవు. ఈ ఆర్థిక మాంద్యం కాలంలో నెమ్మదించిన పెట్టుబడి వల్ల కలిగిన దుష్ఫలితాలు అర్థికంగా కోలుకున్న తర్వాత కూడా చాలా కాలం వరకు ప్రభావ శీలంగానే ఉంటాయి.

**అభివృద్ధికి వ్యతిరేకంగా జనాభా పెరుగుదల :**

ప్రపంచం ఆర్థికంగా కోలుకోవడంవల్ల మాత్రమే, తక్కువ ఆదాయ దేశాల్లో వేగిత్వరణ గల్గిన ఆర్థిక వృద్ధి జరగదు. ఆర్థిక వృద్ధి వల్ల మాత్రమే పేదరికం తొలగదు. మొత్తం జనాభాలో బీదలు తక్కువ అనుపాతం లోవున్నప్పటికి, జనాభా పెరుగుదల బీద ప్రజల సంఖ్యను బాగా పెంచుతోంది.

**బీద దేశాల సాంఘిక సంక్షేమ ప్రమాణాలు :**

అయితే తలసరి ఆదాయ వృద్ధి రేటు పెరుగుదల కుంటి నడక నడుస్తున్నప్పటికి, తక్కువ ఆదాయ దేశాల సాంఘిక సంక్షేమ ప్రమాణాలు వేగంగా పెరుగుతున్నవి. 1970 దశకం చివరికి వారి విషయంలో మంచి పరిస్థితులు కల్గిన వర్ధమాన దేశాల స్థాయి దగ్గరకు వెళ్లగల్గారు. ఈ ప్రమాణాలు ఇంకా పెరుగుతూనే ఉన్నవి. ఉత్తేజ కరమైన ఒక ఉదాహరణను చూడండి. వైద్య ప్రవీణులు రెండు తేలిక పద్ధతుల అవలంబనద్వారా శిశు, బాల మరణాలను సగానికి తగ్గించవచ్చని కనిపెట్టారు. (1) ప్రతి సంవత్సరం నిర్జలీకరణవల్ల అయిదు మిలియన్ల శిశువులు చనిపోతున్నారు. తేలికైన పునర్జలీకరణ వల్ల ఇందులోని నాలుగు మిలియన్లను చనిపోకుండా కాపాడుకోవచ్చు. (2) ఎక్కువ ఉష్ణోగ్రతను తట్టుకోగల స్థిర టీకా మందులు వచ్చినవి. వీటిని ప్రజలందరికి యివ్వడంవల్ల, అనేక రకాల రోగాలవల్ల చని పోయే అయిదు మిలియన్ శిశువుల్లో సగం మందిని కాపాడుకోవచ్చు. ఈ వైద్యాలను తేలికగా, తక్కువ ధరకు సమకూర్చగల్గడంవల్ల ఇవి అందర్ని ఆకర్షిస్తున్నవి.

**పరిస్థితి బాగుపడి జనాభా పెరుగుదల :**

తక్కువ ఆదాయాలు, మధ్య రకం ఆదాయాలుగల దేశాల్లో ఆరోగ్య, పౌష్టికాహారాల్లో పెరుగుదల రావడం వల్ల జనాభా వృద్ధి రేట్లు పెరుగుతున్నవి. ప్రపంచంలో సారవత్వ రేటు పెద్దదిగా గల సబ్ సహారన్ ఆఫ్రికాలో వేగంగా జనాభా వృద్ధి రేటు పెరగడంవల్ల సమస్యలు తీవ్రమౌతున్నవి. ఇందువల్ల ఆ ప్రాంతంలోని దేశాల ఆర్థిక వృద్ధి అవకాశాలు, జీవన సురక్షణాలు దెబ్బ తిని పోగలవు. అప్పర్ వోల్టాలో ఆరు మిలియన్ల జనాభా ఉన్నది. ఇది ప్రపంచ అతి బీద దేశాలలో ఒకటి. అయితే దాని సారవత్వ రేటు ప్రపంచ సార వత్వ రేట్లలో అతి పెద్దవాటిలో ఒకటి. ఈ సారవత్వ రేటును తగ్గించకపోతే 1980కి 2010 సంవత్సరానికి మధ్య కాలంలో ప్రసూతి, శిశు ఆరోగ్య సేవలు కావలసిన జనాభా రెండున్నర మిలియన్ల నుండి ఆరున్నర మిలియన్లకు పెరుగుతుంది. ఈ పరిస్థితికి కారణ భూత మైన పెద్ద సారవత్వ రేటు అప్పర్ వోల్టా ఆర్థిక, సాంఘిక పురో గమనంపై బాగా దెబ్బ తీయగలదు. పరిస్థితి బాగుపడితే జనాభా పెరుగుతుంది. జనాభా పెరిగితే పరిస్థితులు చెడతాయి. ఇదొక చిక్కు సమస్య. అందువల్ల జనాభా నియంత్రణ జరిగితీరాలి.

**జనాభా పెరుగుదల యెడ వేరు వేరు వైఖరులు ; వస్థాలు :**

వివిధ ప్రభుత్వాల వైఖరులు విభిన్నంగా ఉన్నయ్యి కొన్ని ప్రభుత్వాలు హెచ్చు జనాభా వృద్ధి రేటును కోరుతూంటే, మరికొన్ని ప్రభుత్వాలు స్పష్టమైన జనాభా నియంత్రణ కార్యక్రమాలను అమలు జరుపుతున్నవి. ఇందులో జనాభా నియంత్రణ కార్యక్రమాలను అమలు జరుపుతున్న దేశాల కార్యక్రమాలకు ప్రోత్సాహమిచ్చి బల పర్చాలి. లేకుంటే వాటి తలసరి జాతీయాదాయము బహు కొద్దిగా ఉండటమో లేక లేనిదానితో సమానం కావడమో జరుగుతుంది. అంతేగాకుండా పేదరికంపై దెబ్బ తీయడానికి, జనాభా పెరుగుదల బాగా అడ్డు పడు తుంది. పేదరికాన్ని తగ్గించడానికి సగటు ఆదాయం పెరగడం చాలా అవసరము. కాని చాలా వర్ధమాన దేశాల్లో సగటు ఆదాయానికి అతి బీద వారి ఆదాయాలకు మధ్య చాలా పెద్ద తేడా ఉన్నది. అందువల్ల ఆర్థిక వృద్ధి సాధనకు అమలు జరిపే వ్యూహం చట్రం లోపలనే ఆ అతి బీదల పేదరికం సమస్యల్ని పరిష్కరించడానికి ప్రత్యక్ష కార్యా చరణకు పూనుకోవాలి.

### బీదల ఉత్పాదకత పెరిగి పేదరికం పోవాలి :

ఈ అతి బీదల పేదరికం తగ్గింపుకు వారి ఉత్పాదకత పెరగడమూ కీలక పాత్రధారి కాగలదు. బీదల ఉత్పాదకత పెరగ కుండా వారి కొరకు సంక్షేమ కార్యక్రమాలను అమలు జరిపినట్లయితే ఆ సంక్షేమ కార్యక్రమాలు ఎక్కువకాలం నిలవవు సరి కదా, ఉత్పాదకతకు వ్యతిరిక్తం కాగలవు కూడా. వ్యాధి, ఆహార లోటు, విద్యా రాహిత్యత పేదల ఉద్యోగ సముపార్జనావకాశాలకు, వారి ఆదాయ సముపార్జనావకాశాలకు అడ్డు తగలకుండా ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవలసిందే. హెచ్చు సారవత్వమువల్ల కుటుంబం పెద్ద పరిమాణమువల్ల, ధనిక కుటుంబాలలో కంటె, పేద కుటుంబాలలో హెచ్చుమంది ఆధారితులను పోషించవలసిరాగా, వారి ఆదాయాలు చాలమంది మీద పంచబడటంవల్ల పలచబడిపోయి దారిద్ర్యం ఏమాత్రం కూడా తగ్గక పోవచ్చు సరికదా, పేదరికం పెరిగినా ఆశ్చర్యపడ నవసరం లేదు.

### మా న వా భి వృ ద్ధి :

పేదరికానికి సంబంధించిన ఈ ఆదాయేతర విషయాలు సృష్టించే సమస్యల పరిష్కారానికి ప్రభుత్వాలు పని గట్టుకుని మానవాభి వృద్ధి కార్యక్రమాలను అమలుజరిపి తీరాలి. అయితే మానవాభివృద్ధి కార్యక్రమాల్లోను, ఇతర కార్యక్రమాల్లోను ఎన్నిక చేయవలసి వస్తే ముఖ్యంగా రెండూ అవసరమైనపుడు రెంటిలో దేన్ని అవలంబించాలా అనేది పెద్ద గడ్డు సమస్య అవుతుంది. అందువల్ల ప్రభుత్వం చేయ వలసిన విధాన నిర్ణయాలు ముందు చెబుతున్న కారణాలవల్ల ప్రభావిత్త మౌతాయి : (1) ఆర్థికవృద్ధిని పెంచడానికి ఒకో ప్రభుత్వం యిచ్చే సాపేక్షిక ప్రాధాన్యత, (2) పేదల ఆదాయాలను పెంచడానికి చూపే సాపేక్షిక ప్రాధాన్యత (3) పేదరికానికి సంబంధించిన ఆదా యేతర విషయాల సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వాలిచ్చే సాపేక్షిక ప్రాధాన్యత. మానవాభివృద్ధికి చేసే పెట్టుబడి ఆర్థిక వృద్ధికి, పేదరికం నిర్మూలనకు తోడ్పడకుండా అడ్డు పడే శక్తుల్ని తొలగించ డానికి తోడ్పడుతుంది. కాని ఈ మానవాభివృద్ధికి చేసే ఖర్చుల్ని, అందువల్ల వచ్చే ప్రయోజనాలను రాశ్యాత్మకంగా చెప్పడం కష్టం కావడంవల్ల, మానవాభివృద్ధికి చేసే ఖర్చుల బడ్జెట్ పరిమాణాన్ని, ఆ ఖర్చుల వనరులను విద్య, ఆరోగ్యము, పౌష్టికాహారము, కుటుంబ నియంత్రణల మధ్య పంపిణీ చేయడము కష్ట మౌతుంది. ఈ మూటి లోని ప్రతి రంగంలోని వివిధాంశాలకు ఖర్చులనెలా పంపిణీచెయ్యాలా అనేది కూడా పెద్ద సమస్యగానే ఉంటుంది.

### ఆర్థిక వృద్ధి, మానవాభివృద్ధి మధ్య ఏంపిక సమన్వ :

పేదల ఉత్పాదకతను పెంచడానికి తీసుకోవలసిన చర్యలపై నిర్ధారణ చేయలేని స్థితి ఒకో దేశంలో ఒకో రకంగా ఉంటుంది. రాజకీయ, సాంఘిక ప్రాధాన్యతలలోని అంతరాలు, ఆదాయ స్థాయిల లోని తేడాలు, ఆర్థిక వృద్ధి అవకాశాలలోని అంతరాలు విభిన్న మార్గాల అవలంబనకు కారణ మౌతాయి. అయితే వర్థమాన దేశా లన్నింటా కూడా, పేదరికం తగ్గింపుకూ, మానవాభివృద్ధికి తీసుకో వలసిన చర్యలు ఇందుకు చేసే పెట్టుబడి యిచ్చే సత్ఫలితాలకు ప్రాధాన్యత ఇచ్చితీరాలి. ఈ సందర్భంగా తీసుకునే విధానంలో ఎంత చక్కగా ఈ రెండు విషయాలనూ సమ్మిళితం చేసినప్పటికి, రాత్రికి రాత్రే పేదరికం అంతరించి పోదు. పేదరికాన్ని వదిలించు కోవడానికి చాలాకాలం పడుతుంది. అయితే పేదరిక నిర్మూలన ప్రయత్నాలకు అంతర్జాతీయ సమాజం క్రియాశీలంతోను వివేకం తోను ప్రభావితం చేయబడిన మద్దతు నిచ్చినట్లయితే పేదరికాన్ని మనకు తక్కువ బాధాకరమయ్యేట్లు తగ్గించ వచ్చు.

### వర్థమాన దేశాల్లో బీదరికం తొలగింపుకు ప్రపంచ బ్యాంకు చ ర్య లు :

ఇప్పుడీ సందర్భంలో ప్రపంచ బ్యాంకు పేదరికం నిర్మూలన కవలంబించగల చర్యలేవో ఆలోచించి తగినవాటిని అమలు జరుపడం అవసరము. అప్పు లివ్వడంలోను, ఆర్థిక పరిశోధనా విశ్లేషణ కార్యక్రమాల్లోను, పేదరికం నిర్మూలనకు సంబంధించిన చర్యలకు గత దశాబ్దం పైగా ప్రపంచ బ్యాంకు హెచ్చు ప్రాధాన్యత నిస్తోంది. ఈ కార్యక్రమంలో ప్రపంచ బ్యాంకు ఏకాకిగా లేదు. చాలా వర్థమాన దేశాల మధ్య, ద్వైపాక్షిక, త్రైపాక్షిక సహాయ సంస్థల మధ్య బీదల ఉత్పాదకత పెంచడానికి గొప్ప ప్రయత్నాలు చెయ్యా లని ఒప్పందం కుదిరింది. దీని ఫలితంగా, తక్కువ ఆదాయ దేశాలకు, ప్రత్యక్షంగా హెచ్చుమంది బీద ప్రజలకు మేలు జరగ డానికి వీలున్న రంగాల్లోను, ఉప రంగాల్లోను ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ అభివృద్ధి అసోసియేషన్ చేసే ఆర్థిక సహాయాన్ని విస్తృతం చేసారు. గ్రామీణ, పట్టణ అభివృద్ధిమీద, ప్రాథమిక విద్యా వ్యాప్తి, జనాభా నియంత్రణ, ఆరోగ్య రక్షణ, పౌష్టికాహార సరఫరా, లఘు పరిశ్రమలు, త్రాగు నీటి సరఫరాలమీద ప్రపంచ బ్యాంకు తన దృష్టిని కేంద్రీకరించి సహాయం చేయనెంచింది. 1968 లో మొత్తం కావలసిన సహాయంలో తక్కువ ఆదాయ దేశా లకు 37 శాతం అప్పు యిస్తున్న ప్రపంచ బ్యాంకు 1979 - 1983 కాల వ్యవధిలో 58 శాతం యివ్వ నిర్ణయించింది. ఇది మంచి విధానమేనని అనుభవం వల్ల ప్రపంచ బ్యాంకుకు తెలిసింది.

**ఆర్థిక వృద్ధితోబాటు పేదరికం నిర్మూలన :**

నిలకడగల్గి, తగ్గకుండా ముందు కాలంలో కూడా సాగవలసిన అభివృద్ధికి ఆర్థికవృద్ధి, పేదరికం నిర్మూలన అనే రెండు ఆశయాలు సమ్మిళితమైన వ్యూహము అవశ్యమని, కీలకమని తేలింది. ఆర్థిక ప్రోజెక్టుల నిర్మాణానికిచ్చే రుణాలవల్ల చాల మంది బీదలకు మేలు జరుగుతుందని ప్రపంచ బ్యాంకు గమనించినట్లు ఆసంస్థ అధ్యక్షులు చెప్పారు. ముఖ్యంగా పేదరిక నిర్మూలనకు నిర్మించే ప్రాజెక్టులవల్ల ఈ లాభం పేదలకు బాగా జరుగుతుంది. ఈ ప్రాజెక్టుల నిర్మాణంలో, నిర్వహణలో తప్పులు జరగవచ్చు. అపజయాలు వచ్చి వుండవచ్చు. అయినా వాటి నిర్మాణ నిర్వహణ చాలా విషయాలను నేర్పింది. చిన్న రైతుల ఉత్పాదకతను ప్రత్యక్షంగా పెంచడంలో ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయంద్వారా అమలు జరిగిన ప్రాజెక్టులు చాల వరకు విజయం పొందినవి. మానవాభివృద్ధి, విద్య, ఆరోగ్యము, జనాభా నియంత్రణలలో పెట్టుబడిచేసి కూడా ప్రపంచ బ్యాంకు బీదల ఉత్పాదకతను పెంచింది. ఇటువంటి క్రొత్త రకపు ప్రాజెక్టులవల్ల వచ్చే ప్రతిఫలాలు ఇతర ప్రోజెక్టుల ఫలితాలంత గొప్పవిగానుఉన్నయ్యి. ఇటువంటి ప్రాజెక్టులు సత్ఫలితాల నివ్వడం గమనించిన ప్రభుత్వాలు, మరిన్నిసార్లు ప్రపంచ బ్యాంకునుండి అప్పు తీసుకుని, పెట్టుబడిచేసి, లభ్యమయ్యే ఫలితాలను మరిన్ని రెట్లుగా పెంచుకున్నవి. ప్రపంచ బ్యాంకు తనలో సభ్యత్వమున్న ప్రభుత్వాలతో సంప్రదింపులు జరపడం వల్ల, గ్రామీణ ప్రాంతాల ఆర్థిక వృద్ధికి తోడ్పడడంవల్ల, ప్రభుత్వ ఆర్థిక విధాన ప్రక్రియల్లోనికి పేదరికాన్ని తొలగించాలనే ఆదుర్దాను చొప్పించగల్గింది. ఇది ప్రపంచ బ్యాంకు ఆశయాలకు విజయమనే చెప్పాలి. జరిగిన ప్రపంచ బ్యాంకు సహాయానికి మంచి ప్రతిఫలాలు లభ్యమైనట్లు అనుభవం చెపుతున్నట్లయితే, బ్యాంకు సహాయం యింకా చాలా దూరం వెళ్లి సత్ఫలితాల నందించాలని, పేదరికం నిర్మూలన సంబంధంగా నేర్చుకోవలసింది చాలా ఉన్నదని చెప్పక తప్పదు. మన మధ్య వందలాది మిలియన్ల పేద ప్రజల తక్కువ స్థాయి జీవన పరిస్థితులే యిందుకు కారణమని చెప్పవచ్చు. ప్రపంచ బ్యాంకు అప్పు యివ్వడము బీద దేశాలు ఆర్థికాభివృద్ధికీ, పేదరికం నిర్మూలనకూ అప్పు తీసుకోవడము మంచి పనులు. జరుగుతున్న పనులు బాగా ప్రారంభమైనవి. ఇవి ముఖ్యమైనవి కూడా. రుణ దాతలు, రుణ గ్రహీతలు ఈ పనిని ప్రాజెక్టులను జోరుగా సాగించి పేదరికాన్ని ఆర్థికాభివృద్ధిద్వారా నిర్మూలించాలి. ఆర్థికాభివృద్ధి ఉద్యోగితను పెంచి, పంపిణీని న్యాయ సమ్మతంచేసినట్లయితే పేదరికం తొలుగుతుంది.

**రాయితీ రేటు రుణాలాకు లోటు :**

ఈ విషయాలు సహేతుకములని గ్రహించిన స్థితిలోనే పై జెప్పిన ప్రాజెక్టులకు ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయం చెయ్యడానికి, పేదరిక నిర్మూలనా ప్రయత్నాలు ధారావాహికంగా సాగించడానికి రాయితీ రేట్లపై అప్పు యిచ్చే నిధులలో కొరత ఏర్పడడము దుఃఖాంత మైన విషయమని చెప్పక తప్పదు. అంతర్జాతీయ అభివృద్ధి ఎసోసియేషన్ యిచ్చేటటువంటి ఆర్థిక సహాయం ఈ బీద దేశాలకు ఎప్పటి కంటె ఎక్కువ కావాలి. కాని ఆర్థిక మాంద్యం జరుగుతున్న రోజుల్లోనే ఇటువంటి ఆర్థిక సహాయం తీసుకోవడానికి వివిధ దేశాలు పోటీ పడుతూ ముందుకు వచ్చినవి. ఇందువల్ల అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ ఆర్థిక సహాయాన్ని తగినంతగా అందించలేకపోయింది. ఈ సంస్థ నిధులకు అమెరికా సమకూర్చే ధనము బాగా తగ్గడంతో అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ బీద దేశాలకిచ్చే ఆర్థిక సహాయం మరింతగా తగ్గింది. అమెరికా చేసిన తగ్గింపులను పూరించడానికి, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ వంటి దేశాలు, తమకు స్వయంగా బడ్జెట్‌లోటు సమస్యలున్నప్పటికి, చేసిన వాగ్దానాన్ని మించి అంతర్జాతీయ అభివృద్ధిసంస్థ నిధులకు ఎక్కువ ధనాన్ని అందించినవి. ప్రపంచ బ్యాంకు ఇందుకు కృతజ్ఞత తెల్పింది.

**అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ సహాయం వల్ల సత్ఫలితాలు :**

ప్రపంచ బ్యాంకులో సభ్యులైన తక్కువ ఆదాయ దేశాలకు మాత్రమే అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ ఆర్థిక సహాయం అందించ బడుతోంది. ఈ పెట్టుబడులు గొప్పగా సత్ఫలితాలనిస్తూనే వున్నవి. అభివృద్ధి సంస్థ సహాయం పొందుతున్న ప్రాజెక్టులు వందలాది మిలియన్ల ప్రజల జీవన ప్రమాణాలను మెరుగుపర్చుతూనే, అందుమీద సాలీనా పద్ధెనిమిది శాతం ప్రతిఫలాన్ని అందజేస్తున్నవి. ఈ సహాయం అలవాటుగా మారే చెడు పని కాదు. అంతర్జాతీయ అభివృద్ధి అసోసియేషన్ సహాయం పొందిన ఇరవై ఏడు దేశాలు అందువల్ల సత్ఫలితాలను సాధించి, ప్రపంచ బ్యాంకు సహాయానికి అర్హత సంపాదించినవి. ఇటువంటి దేశాల జాబితాలోవున్న దక్షిణ కొరియా, కొలంబియాలు ఇప్పుడు అంతర్జాతీయ అభివృద్ధి ఎసోసియేషన్ నిధులకు ద్రవ్యాన్ని సమకూరుస్తున్నవి. ఇది గమనార్హమైన గొప్ప ఆర్థిక విషయం.



జాతీయ రహదారి

### రాయితీ సహాయం ద్వారా ఆర్థిక సంస్కరణలు :

రాయితీ ఆర్థిక సహాయాన్ని యాభై ఒక్క తక్కువ ఆదాయ దేశాలు పొందుతున్నవి. ఇందులో ఇరవై ఎనిమిది సబ్ సహారన్ ఆఫ్రికా దేశాలు. ఇప్పుడు ఎక్కువ సహాయం కావాలంటున్నవి. ఈ సహాయం లేకపోతే ఈ బీద దేశాలు ఆర్థిక మాంద్యం ప్రభావాన్ని పేదరిక సమస్యలు పెట్టే వత్తిడిని తట్టుకోలేవు. ఇటువంటి ఆర్థిక సహాయం విధాన సంస్కరణల నిర్వహణ కవసరమైనచోట అందించ కుండా, బీద దేశాలు అంతర్గతంగా విధాన సంస్కరణలు ప్రవేశ పెట్టాలని, ఆత్మ పారిశుద్ధ్యంగల అంతర్జాతీయ సమాజంకోరదు.

### బీద దేశాలపై ఆర్థిక మాంద్యం దెబ్బ :

వర్థమాన దేశాలు చాలా కష్టకాలంలో ఉన్నయ్యి. ప్రపంచ ఆర్థిక మాంద్యం వాటిపై— ముఖ్యంగా తక్కువ ఆదాయ దేశాలపై— కొట్టిన దెబ్బతో వాటికి గుండెపోటు వచ్చింది. ఆర్థిక మాంద్యం తర్వాత కోలుకోవడానికి వాటికి చాలా కాలం పడుతుంది. కోలుకోవడానికి చాలా ఖర్చు చేయవలసి వస్తుంది. వాటి చట్ట భాగాలు కొన్ని బాగా దెబ్బ తింటయ్యి. **అవి ఆర్థిక వృద్ధిని పొంది, పేదరికాన్ని బాగా తగ్గించి ముందుకు సాగడానికి, వాటికి తీవ్రమైన ధారావాహిక అంతర్జాతీయ ప్రయత్న సహాయం కావాలి. వాటి కావిధంగా సహాయం చెయ్యడం పారిశ్రామిక దేశాల ప్రయోజన సాధనకు తోడ్పడగలదు** ఈ చెడు కాలంలోనే ప్రపంచం సంకటంలో పడిందని చెప్పడంకన్నా తగిన పదజాలంలేదు. తృతీయ ప్రపంచపు తీవ్ర ఆర్థిక తిరోగమనం పారిశ్రామిక దేశాలు ఆర్థికంగా కోలుకోవడానికి ఆటంకం కాగలవు. ఇందువల్ల ప్రపంచానికి సంకట మేర్పడింది. కాగా పారిశ్రామిక దేశాలు కోలుకోవడానికి ఆలశ్యం ఏర్పడితే వ్యాధిగ్రస్తమైన తృతీయ ప్రపంచ ఆర్థిక వ్యవస్థ రోగము మరింత తీవ్రమౌతుంది. మనందర్ని చుట్టు ముట్టే విషవలయం ఇంతకంటె మరేదీ ఉండదు. అటువంటప్పుడు ఈ సంకటం నుంచి మన మెలా బయట పడతాము? ఇందుకు రెండు పనులు తప్పనిసరిగా జరిగితీరాలి : (1) తృతీయ ప్రపంచానికి అంతర్జాతీయ మూల ధనం ప్రవహించడాన్ని తగ్గించరాదు. అంతేగాక ఈ మూల ధనాన్ని విస్తృతం చెయ్యాలి, (2) తృతీయ ప్రపంచం నుండి తమకు చేరే దిగుమతుల్ని ఆపివెయ్యాలనే గులగులను ఏమైనా సరే పారిశ్రామిక దేశాలు కట్టి పెట్టెయ్యాలి.

### బీద దేశాలకు రుణాలను ఆపరాదు :

అభివృద్ధి ప్రక్రియ జయప్రదం కావడానికి అంతర్జాతీయ ప్రయివేటు మూలధనం అవశ్యము. ఈ కష్టకాలంలో కూడా తమ పరపతి పొందే అర్హతా శక్తిని నిరూపించుకున్న వర్థమాన దేశాలకు వాణిజ్య బ్యాంకులనుండి అందే మూల ధన ప్రవాహాన్ని ఆపే తప్పుడు మార్గానికి కొన్ని దేశాలు వచ్చినై. వీరు వాణిజ్య బ్యాంకుల నుండి ప్రధానంగా రుణాలు తీసుకునేవారే. అయితే వారికి ధన ద్రవ్యత్వ రాహిత్య సమస్యలు ఏర్పడటం వల్లనే తృతీయ ప్రపంచానికి చేరవలసిన మూల ధనాన్ని వాణిజ్య బ్యాంకుల నుండి చేరకుండా ఆపుతున్నారు. అంతర్జాతీయ ద్రవ్యనిధి వాణిజ్య బ్యాంకులతో కలిసి ఈ ద్రవ్యత్వ రాహిత్య సమస్యల్ని తీర్చడానికి ప్రయత్నించినా కూడా మూల ధన ప్రవాహాన్ని ఆపే దేశాలు తమ వక్ర మార్గాన్ని విడనాడటంలేదు. కొద్దిమంది సమస్యలవల్ల హెచ్చు మందిని శిక్షించడం తగదు. కాని ఆ శిక్షల ఫలితాలు, వర్థమాన దేశాల్లో, పెట్టుబడి తగ్గింపులు, దిగుమతి తగ్గింపుల రూపంలో కన్పించుతూనే ఉన్నయ్యి. వాణిజ్య బ్యాంకులు తృతీయ ప్రపంచానికి సహాయం ఆపరాదు. బీద దేశాలకు పరపతి యివ్వడాన్ని తగ్గిస్తే ప్రమాదం వస్తుంది. ఇది రుణదాతకు, రుణార్థికి కూడా నష్టమే. అంతేగాక అంతర్జాతీయ విత్త సంస్థలకు నిధులను తగ్గించడమూ, ఆపడము కూడా తప్పే. తృతీయ ప్రపంచ ఆర్థికవృద్ధి పునరార్జనకు అంతర్జాతీయ విత్త సంస్థలు చేసే సహకార ప్రయత్నము అత్యవసరము. తృతీయ ప్రపంచానికి ఆర్థిక సహాయ కోటాను పెంచడంలో ముందంజ వెయ్యాలని అంతర్జాతీయ ద్రవ్యనిధితాత్కాలిక కమిటి చేసిన సిఫారసు స్వాగతం పొందడానికి అర్హతకల సిఫారసని చెప్పక తప్పదు. అయితే తృతీయ ప్రపంచానికి మూల ధనాన్ని స్థానాంతరీకరణ చేయించడంవల్ల యితరచోట్ల కలిగే నష్టాలను ఆ సిఫారసు నివారించలేదు.

### ప్రపంచ బ్యాంకు, దాని అనుబంధ సంస్థల సహాయాలను నరికివెయ్యవద్దు :

ప్రపంచ మార్కెట్లు, ప్రపంచ బ్యాంకు, ప్రయివేటు పొదుపుల్ని తృతీయ ప్రపంచాభివృద్ధికి కావలసిన పెట్టుబడి చేయడానికి సమర్థ వంతంగా మరల్చ గలిగే మాధ్యమం కాగలదని విశ్వశిస్తున్నవి. ఈ సమయంలో ప్రపంచ బ్యాంకు నుండి వెళ్లే ఆర్థిక సహాయన్ని తగ్గించ రాదు. ఒక దేశం మరొక దేశానికిచ్చే సహాయం తగ్గిపోతున్న సమయంలో, అటువంటి తప్పనిసరి సహాయాన్ని రాయితీ రేట్లపై అందించే అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ సహయ శక్తిని నరికి వెయ్యడం చాలా ప్రమాదకరము.

## స్వేచ్ఛా వ్యాపారం సాగ నివ్వండి :

ఒక దేశం స్వేచ్ఛా వ్యాపార విధాన విసర్జనకు పూనుకుంటే మరొక దేశం ఆర్థిక రక్షణకు పూనుకోవాలను కోవడం మంచిది కాదు. ఆర్థిక వాతావరణంలో మాంద్యం రావడము ఆర్థిక రక్షణల పూనికకు బలమైన కారణము. నష్టదాయకమైన పని ఒక దేశం చేస్తే, మరొక దేశం ఎదురు దెబ్బ తీయడానికి పూనుకుంటోంది. ఈ పందెంలో, తుది విజేత వుండడు. వర్థమాన దేశాలు తమ సరుకుల్ని అమ్ముకోలేక పోతే పారిశ్రామిక దేశాల వస్తువుల్ని కొనలేవు. ఆర్థిక రక్షణను అవలంబించిన దేశాల్లో ఈ రక్షణల వత్తిడివల్ల ఆర్థిక స్తంభన ఏర్పడుతుంది. తద్వారా ద్రవ్యోల్బణ వలయం ఏర్పడుతుంది. అందువల్ల ప్రతి ఒక్కరికీ దెబ్బ తగుల్తుంది. పారిశ్రామిక దేశాల ఆర్థిక వృద్ధి పునరుజ్జీవింపబడితే, తృతీయ ప్రపంచం కోలుకోవడానికి బాగా అవకాశాలు ఏర్పడతాయి. ఆర్థిక రక్షణ విధానాలు కొనసాగుతూ వుంటే, ఆర్థికంగా కోలుకోవడంవల్ల వచ్చే లాభాలు రాకుండా పోతాయి.

## ఆర్థిక సంకటాన్ని ఎలా తొలగించాలి ?

ప్రస్తుత ఆర్థిక సంకటాన్ని తొలగించాలంటే మూల ధన ప్రవాహాన్ని సాగించడాన్ని, ఆర్థిక రక్షణ విధానాన్ని ఆపడాన్ని చేయక తప్పదు. ఆర్థిక పురోగమనానికి నడుం బిగించాలనే పేరుతో తృతీయ ప్రపంచానికి మూలధన ప్రవాహాన్ని ఆపడము, ఆర్థిక రక్షణ విధానాన్ని అమలు జరపడము, తక్కువ బాధాకరమైన కఠిన మార్గాలుగా ఎంచబడవచ్చు. కాని దీర్ఘకాల వ్యవధిలో యివి సరైన మార్గాలు కావు. ఇందువల్ల పారిశ్రామిక దేశాలు తమ నడుమును బిగించుకోకుండా, గొంతుకను మాత్రం త్రాటితో బిగించుకో గలవు.

చివరకు స్వయంకృతగాయము సామాన్య యదార్థాన్ని చూడ లేకుండా ఉన్నది. వర్థమాన దేశాల ఆర్థిక వృద్ధివల్ల పారిశ్రామిక దేశాలకు చాల లాభాలు కల్గుతాయి. తృతీయ ప్రపంచంలో ఆర్థిక స్తబ్ధత, తిరోగమనమువస్తే పారిశ్రామిక ప్రపంచాని కంతా నష్టమే. అందువల్ల తృతీయ ప్రపంచ ఆర్థికాభివృద్ధి పారస్పరిక లాభాలన సమకూరుస్తుందని ఒప్పుకోక తప్పదు. ఇది సరియైన మాట. ఇంద పిల్ల ఇంగిత జ్ఞానాన్ని మంచి మార్గం అవలంబించమని చెప్పడమౌతుంది వర్ధమాన దేశాల్లో వచ్చే ఆర్థిక తిరోగమనము, మానవ నిరాశ ప్రపంచ భద్రతకు ప్రమాదము. ఈ ప్రమాదం బెదిరిస్తోంది. జాగ్రత్త పడాలి సుమా!

## ప్రపంచ భద్రతకు బీద దేశాలకు సహాయం :

ప్రపంచ మంతటికి భద్రత ఎంత ముఖ్యమో యూరోపు రాజకీయ వేదికకు కూడా ఆర్థిక భద్రత అంత ముఖ్యమే. గత ఇరవై సంవత్సరాల ప్రాక్-పశ్చిమ వైరుధ్యాగ్ని నుండి వచ్చే ప్రమాదకరమైన అగ్ని కణాల మెరుపులు తృతీయ ప్రపంచంలో కన్పిస్తున్నవి. వర్థమాన దేశాలు తమ ఆర్థిక పరిపక్వతకు, జీవన ప్రమాణాల సముపార్జనకు చేసే దీర్ఘమైన, కష్టాలతో కూడిన ప్రయత్నాలను స్వార్థంతోను హ్రస్వ దృష్టితోను పారిశ్రామిక దేశాలు అవినట్టయితే వాటికి ప్రమాదకరమైన వ్యతిరేకత ఎదురుకాక తప్పదు.

## మంచి మార్గం కావాలని గొప్పవారి తలంపులు :

వర్థమాన దేశాలు స్వీయాభివృద్ధికి ప్రయత్నించు కోవడానికి సహాయ పడటం పారిశ్రామిక దేశాలకు విజ్ఞతతో కూడిన స్వప్రయోజన మౌతుంది. యూరోపు దేశాలను గత ఇరవై అయిదు సంవత్సరాలుగా అభివృద్ధి చేసినవారు చాలా మంచి దూర దృష్టిగలవారు. సర్వజన శ్రేయస్సుకు అంతర్జాతీయ సహకారాన్ని అందించడము సౌభాగ్యాన్ని పొందడానికి శాశ్వత శాంతిని నిర్మించడానికి మంచి మార్గమని ఆ నిర్మాతలు తలపోశారు. అటువంటి దీక్ష ఈనాడు కావాలి. ప్రపంచ దేశాల సామూహిక శ్రేయస్సును ఏర్పాటు చేయడానికినాడు అటువంటి సహకారం ఇవ్వాలనే దీక్ష. ఈ రోజున కావాలి. ప్రపంచమంతా ఈ దీక్షను పూనాలని మరొకసారి చెప్పడం అందరికి మేలు చేయగలదు.



(40 వ పేజీ తరువాయి)

"వుహుఁ ... నాబం లేదు ... ఆడు కంబడి కొనడు ... నన్ను గుల్లో కెల్లి పడుకోనూ పడుకోనియ్యడు. పేనాలు తోడేసే యీ సలిలో ... సలికాలం తిరక్కుండానే యేదో వొకనాడు ... రేత్తిరికి రేత్తిరే సల్లో గడ్డకట్టుక సచ్చిపోతాను ... తప్పకుండా సచ్చిపోతాను —"

చావు ఊహ మనసులో మెదిలేసరికి గుండెలు ఝల్లుమన్నాయి. జీవితాంతం మనిషికి బ్రతుకు పట్ల మమకారం ... చావు పట్ల భయం. సృష్టి రహస్యం మరి !

హఠాత్తుగా రామభద్రుడి మనసులోని ఆలోచనలు ఆగిపోయాయి. ఎంత వద్దనుకున్నా మనసు నాలుగు పదుల కాలము వెనక్కి వెళ్ళింది.

* * * * *

రామభద్రుడి తండ్రి జ్వరంతో మూల్గుతున్నాడు.

జరాభారంతో, జ్వర తీవ్రతతో – ముందే పండిపోయిన మనిషి – రాలిపోవటానికి సిద్ధమయిన పండుటాకులా వున్నాడు.

రామభద్రుడి భార్య కాపురాని కొచ్చి అప్పటికి రెండు నెలలే అయ్యింది. క్రొత్త కాపురంలోని ఆకర్షణ, ఆనందం, వెచ్చదనం – యింకా తగ్గలేదు మరి !

రామభద్రుడు రెడ్డిగారి యింట్లో పాలేరు పని ముగించుకొని, వెచ్చని ఊహాలు మనసును తొందర పెడుతుండగా – ఆనందంగా ఈల పాటలు పాడుకుంటూ యింటికి వచ్చాడు. వాకిట్లోనే ఎదురు తెన్నులు చూస్తూ కూర్చుంది భార్య – భర్తకోసం వుత్సాహంతో సింగారించుకుని. కట్టుకున్న క్రొత్త చీర, జడలో తురుముకున్న మల్లెపూలూ కూడా వేగిరపడుతూ యెదురుచూస్తున్నాయి – తమను అక్కున చేర్చుక లాలించే వారికోసం.

రామభద్రుడు వాకిట్లోకి అడుగు పెట్టీపెట్టకుండానే భార్యను కౌగిలిలోకి తీసుకోబోయాడు తమకంతో.

'ఇస్' – అంటూ మూలన కుక్కిమంచంలో కళ్లు మూసుక పడుకున్న మామగారికేసి చూపింది – చూపులతో భర్తను వారిస్తూ.

పొంగే పాలమీద నీళ్లు చల్లినట్లుగా ఒక్కసారిగా చల్లారిపోయాడు రామభద్రుడు.

'హుఁ ... యీ ముసిలి ముండాకొడుకు యింకా యింటోనే మంచమ్మీదే మారాజులా తొంగున్నాడా ... యీ ముసిలాడి జొరమేంటోగాని ... పది నాల్లనుండి పడుసు పెల్లాంతో వూసులాడుకోటానిక్కూడా సందు దొరకటంలా ... సీసీ ...యెదవ పీడ ...

రామభద్రుడు మనసుతోనే ముసలి తండ్రిని శపించాడు — రోగం కుదరనందుకూ ... రోగంతో చావనందుకూ.

'మాపటేలకే తగ్గిందంటివిగా' — కంఠంలో నిష్ఠురత.

ఇదీ పరామర్శ. యవ్వనంలో నున్న కొడుకు – రాలిపోవటానికి సిద్ధంగా వున్న కన్నతండ్రి ఆరోగ్యం గురించిన పరామర్శ.

'కొన్చం తగ్గినాదిరా బద్దురుడూ —' నూతిలో నుండి మాటాడుతున్నట్లు బలహీనంగా ధ్వని.

'మరి తగ్గితే ... ఆ మూల్ని కుక్కిమంచంలో యెందుకూ గాల్తగలకుండా ... బయటరుగు మీదికి మంచమేత్తా — ఆయిగ పండుకో —'

కొడుకు మనసులోని 'కోరికను' అర్థ చేసుకోలేని పయసు కాదా ముసలి తండ్రిది. భార్యతో పొందబోయే మధురానుభవాల ముందు ముసలి తండ్రి ఆరోగ్యం ఏమాత్రం లెక్కలోకి రానిదనీ కూడా తెలుసు.

కానీ – ఆ వృద్ధుని మనసులో ఎక్కడో భయం.

ఎముకల్ని కొఱుక్కుతినే ఈదురు గాలిని గురించి భయం.

ముసలి శరీరాన్ని కరకర నమలగల చలి గురించి భయం. అందుకే కొడుకు మనసు తెలిసినా, కోరిక అర్థమయినా సరేనని తలూపలేక పోయాడు.

కానీ – ఆ వృద్ధుని అంగీకారం ఎవరి క్కావాలి ?

'ఇగో ... యిటు రాయే ... యీ మంచమలా కాల్లవేపు పట్టుకో...'

కొడుకూ, కోడలూ మంచాన్ని చెరోవైపున పట్టి – ముసలి దేహంతో సహా బయటరుగు మీదకు చేరవేశారు.

'ఇగో ... చలేత్తే యిది కప్పుకో —'

చిరుగుల నూలు దుప్పటి యిచ్చాడు కొడుకు రామభద్రుడు. క్షణం ఆలస్యం చెయ్యకుండా తలుపులు మూసుకున్నాయి. మూసుకున్న తలుపుల వెనుక తెరచుకున్న మధురానుభవాలు.

ఆ పెంకుటింటికి వరండా వేయించుకోలేక పోయినందుకు ఆ రాత్రి ఎంతో బాధపడ్డాడు ముసలి తండ్రి. కానీ ఆ రోజుల్లో తనూ, తన భార్య రెక్కలు ముక్కలు చేసుకుని ఆ ఒక్క గదైనా అతికష్టం మీద వేసుకో గలిగారు. రెక్కల కష్టంతో యిల్లు కట్టటం మాటలా ?

ఆలోచనలు చెదరగొడుతూ ఈదురు గాలి మొదలయ్యింది.

గాలితోపాటు చలి పెరిగింది.

చలి జ్వరాన్ని పెంచింది.

చలి...జ్వరం...వణుకు...బాధ...భయం...దుఃఖం.

అది - ఆ వృద్ధుని జీవితంలో ఎంతకూ తెల్లవారని కాళరాత్రి.

మరి కోడి కూసింది.

రామభద్రుడు రెడ్డిగారి యింటికి పాలేరు పనిలోకి పోతూ తండ్రి మంచం వంక చూశాడు.

అంతే ! ! !

ఒక్క క్షణం కొయ్యబారిపోయాడు - కొయ్యబారిన ముసలి తండ్రిని చూసి.

'ఆ ! !'—

భార్య కూడా బయటకు వచ్చింది. రామభద్రుడి కళ్లముందు లోకం మెదిలింది. భార్యతో ఏమో చెప్పాడు. ఇద్దరూ కుక్కిమంచాన్ని శవంతో సహా అరుగు దించి గదిలోకి తీసుకపోయారు.

తండ్రి శవం వంక చూశాడు రామభద్రుడు.

చిరుగుల దుప్పటిలో కొయ్యబారిన శవం !

'నా న్నో... !'

'మావోఁ...' !

ప్రక్క యిళ్ల వాళ్లకు వినిపించేంత బిగ్గరగా ఒక్కసారే యిద్దరూ ఏడ్పు ప్రారంభించారు.

ఆశ్చర్యం ?

ఇద్దరి మనసుల్లోనూ ఎక్కడో ఆనందం కదులుతోంది— యింత త్వరగా ముసలిపీడ విరగడయినందుకు.

వాళ్లూ, వీళ్లూ రావడంతో ఏడుపు మరింత పెంచబడింది.

* * * * *

తను కప్పుకున్న చిరుగుల దుప్పటి చూసేసరికి - ఎందుకో రామభద్రుడి గుండె ఝల్లుమన్నది.

'తను... తను... తప్పు సేసిండా... ముసిలి తండిరి కన్నాయం సేసెనా... నా సుకమే నే సూసు కున్నానా...
అందుకే... అందుకే యిప్పుడిలా— యిలా... తన కొడుకూ తనకు సేత్తున్నాడా... '

తను యవ్వనంలో తండ్రి గురించి చేసిన తప్పుకు యిన్నేళ్లకు రామభద్రుడు మనస్ఫూర్తిగా ఏడుస్తున్నాడు.

అందుకే ఏదైనా తనదాకా వస్తే తప్పు తెలియదన్నారు పెద్దలు

రామభద్రుడు దుప్పటితో కళ్లు తుడుచుకున్నాడు.

'యీడు రేపో... మాపో కంబడి కొనకపోతే... కొనక పోతే... తనూ... తన తండిరి లానే... యీ చిరుగుల దుప్పట్లో... ట్లో...

ఆపై ఊహించలేక కళ్లు మూసుకున్నాడు.

అలసిన మనసు, శరీరము చలిగాలి కూడా విశ్రాంతి కోరుకున్నాయి.

ఏక్కడో మళ్ళీ కోడి కూసింది తెల్లవారబోతున్న హెచ్చరికతో,

రెండు రోజుల తర్వాత—

మధ్యాహ్నం భోజనం చేసి - ఆంజనేయస్వామి గుడి అరుగు మీద పిచ్చాపాటి కబుర్లు చెప్పకుని యింటికి తిరిగి వచ్చాడు రామభద్రుడు.

అరుగుమీద కూర్చుని బీడి ముట్టించుకో బోతున్న రామభద్రుని కళ్లు యింట్లో తలుపువారగానున్న చెక్కపెట్టెమీద నిలిచి పోయాయి.

అంతే !

మనసు ఆనందంతో వశము తప్పింది.

పెట్టె మీద క్రొత్త కంబళీ !

బీడీ జేబులో వేసుకుని యింట్లోకి వెళ్ళి - క్రొత్త కంబళిని ఆప్యాయంగా స్పృశించాడు. గరకు గరకుగా - వెచ్చవెచ్చగా వుంది

ఆస్పర్శతోనే ముసలి మనసు ఆనందంతో పరవశించింది.

'అతు పైకలా కసురు కుంటాడుగాని... అడి మనసు నాకు తెలవదా... పాపం... అడి దగ్గరయినా యెంటనే కొంటానికి

సోమ్మెక్కడిది... అయితే నేటి నా కోసం కంబడి కొనేసినాడు గదా... యెంతైనా ఆడు నా కొడుకూ... నేనాడి తండిరిని...' ఆనందదతో గొణుక్కున్నాడు రామభద్రుడు.

కొడుకే పిలిచి 'తీస్కో నానో—' అని యిచ్చేంత వరకు తీసుకో కూడదనకున్నాడు.

చీకటి పడక ముందే కొడుకూ, కోడలు వచ్చారు.

ఆ తర్వాత ఊర్నుంచి వచ్చింది కోడలు తల్లి.

రామభద్రుని ఊరికే మాటవరుసకు పలుకరించినా - తన కూతురు, అల్లుడితో తెగ కబుర్లు చెపుతోంది ఆమె.

భోజనా లయ్యాయి.

'యిగో అత్తా... మామంచం వాకిట్లో యేత్తున్నా... యిగో కొత్త కంబడి... నీ కూతు సెప్పిందిలే నీక్కావాలని... అందుకే యివ్వాల మద్దినాల కొనేశా... సలికదా... కొత్త కంబడి యెచ్చ గుంటాది పడుకో—'

అంతే ?

ఆ తర్వాత రామభద్రుడికి యింకే మాటలూ వినిపించలేదు. ఊరకే పిచ్చివానిలా గుడ్లప్పగించి చూస్తున్నాడు.

చూస్తుండగనే మంచమెక్కి - వెచ్చగా క్రొత్త కంబట్లోకి దూరుకుంది వియ్యపురాలు.

ఇంట్లో నుండి మాటలు వినిపిస్తున్నాయి.

'మద్దినాల కొన్న కంబడి మా అమ్మకు నచ్చిందంట—' కోడలు గొంతులో సంతోషం.

'అది మీ అమ్మకేనే...'

'మరి మీ ముసలాడి కో...'

'ఓ స్సెరి మొగమా! అదికేలనే కంబడి, గింబడి... దుప్పటుంది కదా...' ఇక వినలేక విసురుగా చిరుగుల దుప్పటిని చెవుల మీదకు లాక్కున్నాడు.

రామభద్రుడు తన ఆలోచనలతో, బాధతో గమనించలేదు కాని వీధిలో ముసలి కుక్క కాలి గాయంలో బాధ పడుతూ, చలికి పడుకో లేక వూరికే దీనంగా మొరుగులోంది.

కొన్ని క్షణాల తర్వాత గూట్లోని పడుచుకుక్క వీధిలోని తల్లి దగ్గర కెళ్ళింది, మూత్తో దాని ఒళ్లు నిమిరింది. నాలికతో గాయాన్ని నాకింది. కాడిస్తూ తల్లి కళ్లలోకి చూస్తూ ఏదో చెప్పింది.

రామభద్రుడు కళ్లు మూసుకున్నాడు బాధ, అవమానం మనసును దహిస్తుండగా... చలి శరీరాన్ని వేధిస్తుండగా.

కొన్ని నిముషాల తర్వాత కళ్లు తెరిచాడు.

గూట్లో వెచ్చగా ముసలి కుక్క.

చలిలో వీధి దీపం క్రింద పడుచు కుక్క.

ఆ దృశ్యం—

ఇన్నేళ్లుగా అర్థంకాని క్రొత్త జీవిత సత్యాన్నేదో తెలియ చెప్పింది రామభద్రునికి.

'మానవ నాగరికతా పరిణామాన్ని' చూసి చలి నవ్వుతున్నట్లుగా —ఈదురు గాలికి కొబ్బరి చెట్టు రెమ్మలు శబ్దం చేశాయి.



# తేడా

## శ్రీ ఆదూరి వెంకట సీతారామమూర్తి

నీలాకాశంలో బారులు బారులుగా ఎగిరే
ఆ పక్షుల్ని చూడు.
అడ్డుపడే మబ్బు తునకల్ని కాల్దన్నుతూ
ఎదురయ్యే ఎండ పొడనీ
గాలి కెరటాల్నీ చీల్చుకుంటూ
ఎత్తుగా ఎంత ఉన్నతంగా
ఎగురుతున్నాయో చూడు.
ఆకాశ రాజ్యంలో ఐక్యతా రాజ్యం.
వాటిదే కులమంటావ్ ?

పంచదార పలుకుల్ని
జట్లు జట్లుగా వరుసల్లో తీసుకుపోయే
ఆ చిట్టి చీమల్ని చూడు-
శ్రమతో పాటు
గోడౌన్లో దాచుకున్న సంపద కూడా
అందరిదీను -
అదే మతం వాటిది.
మరో మతం లేదు వాటికి -

హిమోన్నగంపై పుట్టినా
అగాధాల లోయల్లోంచి వుబికినా
గంగ గంగే !

తనను తాను పంచుకోడానికి
ప్రాణికోటిలోని మతాల్ని వెదకదది
గోత్రాలతో వేరు చేయదు.
మరి.... నువ్వో....?



# చిరంజీవి

## భగ్వాన్

మల్లె పువ్వు
అంగుళ మంత,
గుబాళింపు
తోటంతా —

మినీ కవిత
బెత్తె డంత,
బ్రతికేది
కాల మంతా —



# కలగూరగంప

## ప్రబంధాలలోని కొన్ని కారక విశేషాలు

వాక్య సముదాయం భాష. ఈ వాక్యం అనేకములైన నిర్మాణాలతో కూడి ఉంది. నామములు, క్రియలు భాషా భవన నిర్మాణంలో ప్రధానమైన అంగాలని చెప్పవచ్చు. ఈ నామములకు క్రియలకు గల సంబంధాన్ని నిరూపించేదే కారకం. క్రియతో అన్వయం కలిగించేది కారకం అని వ్యాకరణాలు ప్రకటిస్తున్నాయి. ఈ కారకాలు విభక్తుల సహాయంతో వ్యక్త మౌతూంటాయి. విభక్తి రహితమైన భాష అస్పష్టంగా, అయోమయంగా, అర్థ విహీనంగా ఉంటుంది. కనుక ఈ కారకం భాషయొక్క ముఖ్యప్రయోజనాన్ని నెరవేరుస్తూ వివిధ విభక్తుల సహాయంతో వివిధార్థాల్ని బోధిస్తూ భాషకు ఒక ముఖ్యమైన అంగంగా పరిగణించబడుతూ ఉంటుంది. చిన్నయసూరి బాల వ్యాకరణంలో కొన్ని కారకాల్ని వివిధార్థాలలో నిరూపించాడు. బాల వ్యాకరణ శేష గ్రంథమైన ప్రౌఢ వ్యాకరణం మరికొన్ని కారకాల్ని నిరూపించి పూరించింది. పదహారో శతాబ్దం లోని కొన్ని ప్రబంధాలు బాల ప్రౌఢ వ్యాకరణాల్లోని కారక వైవిధ్యాన్నే కాక మరికొన్ని విశేషాల్ని కూడా అవి చూపిస్తున్నాయి. వాటిలో కొన్నింటిని ఈ దిగువ నిరూపిస్తున్నాను.

ఉద్దేశార్థంలో ద్వితీయకు గుఱిచి, గుఱించి, గుఱియించి అనే రూపాలు స్వతంత్రార్థంతోనూ, విభక్తి ప్రత్యయ రూపంలోనూ మనకు కనిపిస్తాయి,

గుఱిచి :—

“డిక్కులన్ గుఱిచి బుభుక్షకై చనుట”
(ఉద్భటా. అశ్వా. 3, పద్యం 274)

“పద్మాక్షు గుఱిచి తపంబు గావించి”
(పరమ. ద్వితీ. ఆశ్వా. పు. 404)

“పద్మజు గుర్రిచి తపంబు సేయ” (సకల. ఆశ్వా. 3, ప.254)

(చివరి ప్రయోగము సాధురేఫ యుక్తమగుట గమనించాలి.)

గుఱించి :—

“ఆ మృడుని గుఱించి నారదుఁ డనియెన్” (పాండు-3-117)

“మదీయ పుత్రి యేమి గుఱించియో” (ఆము-5-157)

“క్రొవ్విరు లుఱించి కోసె” (యయా-4-1౯)

“విరించి గుఱించి దూఱి దూఱి” (రామా-2-54)

“నాగవల్లి యొనర్చుకై గుఱింప” (రాజశే-3-174)

గుఱియించి :—

“ఈ నలినాక్షి యాత్మ గుఱియించిన విష్ణుఁడు నా విభుండ యౌనేని” (విష్ణుమాయా-2 అ. 162 ప.)

‘గుఱి’ అంటే లక్ష్యం. ఈ నామానికి ఇంచుక్కు చేరి గుఱి + ఇంచు = గుఱియించు, గుఱించు, గుఱిచు అనే రూపాలుగా మనకు గోచరిస్తున్నాయి. ఒకచోట ఈ మూడు రూపాలు లేకుండా వాని స్థానంలో కేవలం ‘కాన్’ అనే అన్నంత రూపం కనిపిస్తుంది.

“భూపరుఁ డొక్కనాఁడు వేఁటగాఁ జని” (సకల-2-181)

“క్షితిపతి యొకనాఁడు వేఁటగాఁ జని” ( ,, -2-278)

తోడ్తోన్, తోడ్తోన, తోడుతోన్, తోడ్తోడన్, తోడుతోడ, తోడన్, తోడ — ఈ రూపాలు ప్రత్యయాలుగానే కాక ‘వెంటనే’ అనే అర్థంతో కనుపిస్తాయి.

“మున్ను తోడుతోఁ జేసిన చేతకున్” (కపిక-3-224)

“కలయంపిఁ దోడ్తోన చిలికి చిలికి” (కపిక-5-19)

“తోడతోన నట్టి పుత్రకు లీరెను నవని బెరిగి బాల్యమును బాసి”
(సకల-4-12)

“కన్నీరు దోడ్తోన్ దెప్పలఁ జిప్పిలంగన్”
(శ్రీకాళ. మా-1-32)

“నీకు నీ కుమారునకు ఫలించె దోడుతోడ” (కకు-2-71)

“దేవి త్రికాలవేదిని గాన శిశువు భావించి తోడ రూపమున నేనెంచి” (అన్న-పు-6)

“గంధంబు మెత్త మెత్తఁ దోన పొడిపొడియై రాలు”
(రాధా-3-150)

'వెంట' అనే అర్థంలో తోన్ :—

"తమ్ములుఁ ద్రోఁ జనుదేర నరిగె" (చిత్ర-6-10)

"ద్రోవదియు న్సుభద్రయును ద్రోఁ జనుదేన్" (పారి-5-72)

తోన్ అనే విభక్త్యర్థంలో 'తోన' మఱియు 'తోనన'

"ఉద్యాన గతుఁడైన మత్స్వామి తోన (వసు-2-94)

"పురుషోత్తముల తోన" (సుభ-పు-55)

"వెన్నెల లారల తోన జాఱె" (వైజ-2-50)

"సింహంబు తోనను ... ... పల్కినన్"

(భానుకవి, పంచతంత్రము-1-172)

తోడ అనే విభక్తి సమాసంలో ఇత్వం చెంది తోడి అనురూపంలో సాధారణంగా మనకు కనిపిస్తుంది. తోడికి మాఱుగా "తోటి" అనే రూపం కొన్ని గ్రంథాల్లోఉంది. తోడ యొక్క ఔప విభక్తిక రూపమే 'తోటి'గా ప్రయోగింపబడి ఉండవచ్చును.

"హరిణాంకుని తోటి కూటముల్" (వసు-4-39)

"మా తోటి యేదవ పెద్ద తాత"... (పరమ-పు-533)

"రత్నముల తోటి యనర్ఘ విభూషణా వలుల్"

(ఉద్భ-2-137)

"మలహణు తోటి కూటమియే" (మలహణ-పు-39)

"నీ తోటి ఘన సంఘ మంటపా వాసమునను"

(చొక్క-8పు 271ప)

"అవ్వవ్వ నీ తోటి యన్నట్టు చేసి" (తోడన్)

(నవ-1పు-26ప)

'మెయి', అనే ప్రత్యయం సాధారణంగా తృతీయార్థంలో 'నిత'కు మాఱుగా ప్రయోగింపబడుతుంది. పాండురంగ మాహాత్మ్యంలో ఒకచోట ద్వితీయార్థంలో వాడడం కనిపిస్తుంది.

"అడవికి వేటమై నరిగి" (వేటగూర్చి అని అర్థం)

(పాండు-5-14)

వలన అన్న పంచమీ విభక్తి ప్రత్యయం ఇతరార్థాలతో పాటు గ్రహణార్థంలో కూడా మనకు కనిపిస్తుంది. ప్రబంధాలలో కొన్ని చోట్ల 'వలన' కు మారుగా 'చేత' ప్రయోగింపబడింది.

"భద్రమయాత్మచే, భువన పాలన ఖేలనుచే, సరస్వతీ ముద్రిత వక్త్ర చేత, నలుమోములు వేలుపుచే విరూరి వేద్రాది చమూ విభుండుగను నాయువు" (పాండు-1-3)

"కసవుచే, జెల్లుచే...ఆటవికులచేత వెలయు పీడలు"

(ఆంధ్రక-6-94)

"ఉత్సాహంబుతోఁ బాయుచున్" (అపాయార్థమున వలన ప్రయుక్తము కావలెను) (ఆంధ్రకా-6-12)

"అధిపులతోఁబాసి యాధార మెడలిన" (అధిపుల వలన బాసి)

(ఆంధ్రకా-6-65)

జన వ్యవహారంలో 'కొఱకు' ప్రత్యయానికి మాఱుగా 'కోసము' తఱచుగ వినిపిస్తూ ఉంటుంది. కొన్ని ప్రబంధాలలో ఈ వ్యావహారిక రూపం కనిపిస్తుంది.

"తన గిన్నె నొసంగెను బంటు కోసమై" (వైజ-4-5)

"వసుదేవ కుమారుని ముక్తి కోసమై" (అప్ప-4-314)

"జయ్యంటి కోస మనును" (నిరయ్-2-45)

"రాళ్ల కోసమై" (శ్రీకాళశత-28ప॥)

"వెన్నుని వేయి నామములు వేడుకచే పఠియించు కోసము"

(శుద్ధా-సీతా-3)

"కార్యాని కోసమే కడు చిక్కుపడెను" (సుభ-పు-25)

"బ్రతుకు కోసంబు" (సిద్దే-పు-39)

వలన, కంటె,పట్టి-ఇవి పంచమీ విభక్తి ప్రత్యయాలుగా పరిగణింపబడుతూ ఉంటాయి. 'పట్టి' అన్న ప్రత్యయం ప్రబంధాలలో అరుదుగా ప్రయోగింపబడింది. వలనన్ అనే పదంవలను శబ్దంయొక్క తృతీయా సప్తమ్యంత రూపంలో సమానమైనది. వలను శబ్దమునకు దిక్కు, పార్శ్వము, ఉపాయము మొదలైన అర్థాలు శబ్దరత్నాకరంలో కనబడుతాయి. వలన అనే శబ్దం హల్సంయోగంచేత 'వల్న' అయి, సమీకరణంచేత 'వల్ల' అన్న రూపమేర్పడింది. ఈ రూపం కూడా అక్కడక్కడ కనబడుతుంది. వ్యవహారంలో ఈ రూపంఉంది.

"చలిమల వల్ల సుల్లని లు" (మను-2-10)

"అందువల్లఁ బ్రజలందరు చేరుదురు" (ఆంధ్రకా-1-63)

"నీల ఘన పుంజమువల్ల" (అము-4-120)

"ఈతని వల్లనే తెఱంగును లేదు" (చౌక్క-పు-201)

"పవమాన సఖు వల్లఁ బాసి" (హరి-ఏకా-ప॥ 184)

అనుకూలార్థంలో ఈ 'వల్ల' శబ్దం పారిజాతాపహరణంలో కనుపిస్తుంది. ఇది రూపాంతర పరిణామ మందిన విశేషణ శబ్దము.

"దక్షిణాంస చూచుకనయన ప్రకంప గుణ సూచనలేమియు వల్లగావు" (పారిజా-1-73)

'పట్టు' ధాతువుయొక్క క్త్వార్థక రూపము పట్టి. ఇది హేత్వర్థంలోనే కాక అర్థాంతరలో కూడా ప్రయోగింపబడింది.

"నిర్మనుష్యంబైన యీశక్తి స్థానంబు నఁ జిరకాలంబునఁ బట్టి యుట్టు వేగించుచున్నదానవు" (చిరకాలమునుండి) (కళా-3-123)

"పెద్ద కాలంబునది బట్టి నా మనంబు తత్సందేహ కోలాందోళాయమానంబై యున్నయది" (పెద్ద కాలంబు నుండి) (విష్ణుమాయా-1-86)

సాధారణంగా వ్యవహారంలో 'డిండి'కి మారుగా దానిగుండా, కనిగుండా అన్నట్లు "గుండ" శబ ప్రయోగం మనకు కనిపిస్తుంది. అథర్వణుఁడు 'కుండా' అన్న రూపాన్ని గూర్చి చెప్పినాడనీ, ఆ కుండాయే 'గుండా' అయిందనీ ఆంధ్ర భాషనుశాసనం చెప్పినది. (ఆంధ్ర భాషనుశాసనము-పు 195)

ఇలాంటి రూపం ఒక్క చోట మాత్రం కనుపించింది.

"ఆక్రత గుండ నాలోకనముసేసి" (పరమ-ద్వి-పు 522)

'ఎవ్వాళ్ల నుండియో' అనడానికి మాఱుగా 'ఎన్నాళ్ల నోయుండి' అనే విశేష ప్రయోగం పాండురంగ మాహాత్మ్యంలో ఉంది. (పాండు-33) ఉండికి మారుగా 'కిన్' వాడబడిన రూపం కూడా ఉంది.

"నల్లని చీర మేనికిన్ దొలఁగఁగదీసె" (మేనినుండి) (ఉద్భట-2-184)

ఉండికి మారుగా 'నుంచి' శబ్దం చాలా అరుదుగా మాత్రమే కనబడుతుంది. "డించి ప్రయోగ మసాధువని కొందఱందురు కాని పూర్వలాక్షణికులు దీనిని సమ్మతించిరి. కవులు దీనిని బ్రయోగించిరి. "సనములలో నిది యున్నది" అని ఆంధ్ర భాషాను శాసనం చెప్పింది. (ఆంధ్ర భాషా-పు 195)

"అమ్మంత్రి యెచ్చోట నుంచి వచ్చె" (కృష్ణ విజ-4-26)

"మొదలి ఛందముపద్ద నుంచి వారడిగిన" (అప్ప-4-140)

లో. లోపల అనే షష్ఠీ విభక్తి ప్రత్యయాలు నిర్ధారణార్థంలో బాలవ్యాకరణం విధించింది. నిర్ధారణార్థంలోనే కాక అధికరణార్థం లోనూ వాడఁబడినట్లు ఈ క్రింది ప్రయోగాలు నిరూపిస్తున్నాయి.

"తామరపాకులో నీరి వోలె" (పరమ-ద్వి-పు 301)

"ఏ గుణంబు చూచి నాలో నుండి రక్షింపు చున్నాఁడవు" (వైరా-పు-111)

"జలములలోఁదేలినట్లు" (సకల-4-137)

'అందు' అనే పదానికి లో, లోపలన అనే విభక్తులు అనుబంధంగా చేరుతూండడం కూడా మనం చూడొచ్చు.

"అధిపతి నందులో మఱుఁగ్రదోచి" (ఇచట అందు స్వతంత్ర పదంగా వాడఁబడినది) (సకల-4-268)

'అందులోపల' (ఇచట కూడా స్వతంత్ర పదమే) (శిపర్వ-6-పు 150)

'మందార ద్రుమ మూల మందున' (శ్రీకృష్ణ-3-104)

'అందు' నకు 'ఉల' ప్రత్యయం చేరిన రూపాలు కూడా అక్కడక్కడ కనుపిస్తాయి.

'అందుల' (సకల-4-304)

'అందుల' (నవ-పు-71)

'అందుల' (శిపర్వ-31పు 70)

'అందుల మీద' (శృంగార శతకము-పు-130)

'ఋషమందు మీఁద' (సకల-2-26)

కవి సమాజంలోనివాఁడు. ఆతడు ఎంత లాక్షణిక పద ప్రయోగం కోసం ప్రయత్నించినా, తన చుట్టూరా ఉన్న వ్యావహారిక పద ప్రయోగ ప్రభావం నుండి పూర్తిగా తప్పించు కోవడం అసాధ్యం. కనుకనే ప్రబంధాల్లో కొంత వ్యావహారిక పదజాలం చోటు చేసుకుంది. విభక్తి పద ప్రయోగంలో కూడా అలాంటి ప్రభావం తప్పలేదు. కనుకనే కోసము, తోటిగుండా, వల్ల, నుంచి, వంటి అనేక రూపాలు ప్రబంధాల్లో చోటు చేసుకున్నాయి.

## పరిశీలింపఁబడిన గ్రంథాలు :


1. వసుచరిత్ర
2. మనుచరిత్ర
3. ఆముక్తమాల్యద
4. పాండురంగమాహాత్మ్యము

5. యయాతి చరిత్ర
6. రామాభ్యుదయము
7. రాజశేఖర చరిత్ర
8. ఉద్భటారాధ్య చరిత్ర
9. చిత్ర భారతము
10. పారిజాతాపహరణము
11. వైజయంతీ విలాసము
12. కవికర్ణ రసాయనము
13. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము
14. విష్ణుమాయా నాటకము
15. అన్నమాచార్య చరిత్రము
16. భానుకవి పంచతంత్రము
17. పరమయోగవిలాసము
18. ఆంధ్ర కామందకము
19. అప్పకవీయము
20. నిరంకుశోపాఖ్యానము
21. నవచోళ చరిత్ర
22. శృంగార శతకము
23. సకల నీతికథా విధానము
24. కకుత్స్థ విజయము
25. రాధామాధవము
26. శ్రీపర్వత పురాణము
27. ఆంధ్రభాషానుశాసనము

**డా॥ రావి భారతి**

# మీమాంసా దర్శనము

దర్శయంతీతి దర్శనాని. యధార్థ తత్త్వమును చూపించునవి దర్శనాలు. మానవులకు తత్త్వాన్ని సత్యాన్ని బోధించి, మోక్ష మార్గము వైపు పయనించు నటుల చేయుటయే వీని ప్రధాన లక్ష్యము. ఈ లక్ష్యములో వేర్వేరు దర్శనాలు తత్త్వాన్ని వేర్వేరు విధాలుగా ప్రతి పాదించినవి. ఆ భేదాన్ని అనుసరించియే ప్రధానముగా ఆరు దర్శనాలు ప్రసిద్ధి నొందినవి, వీటిలో అతి ప్రాచీనమైనది సాంఖ్య దర్శనము. దీని కనుబంధించినదే యోగ దర్శనము. తరువాత న్యాయ వైశేషిక దర్శనాలు. తదుపరి పూర్వ మీమాంసా. ఉత్తర మీమాంసా దర్శనాలు ఆవిర్భవించినవి. ఈ రెండు దర్శనాలు వేదముతో ప్రత్యక్ష సంబంధం కలవి.

[1] "ప్రత్యక్షేణాను మిత్యావా యస్తూపాయో నవిద్యతే
ఏనం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా."

ప్రత్యక్షాది ప్రమాణములచే దేనినైతే తెలుసుకొనలేమో అట్టి దానిని వేదము బోధిస్తుంది. ఈ వేదము రెండు భాగములు : సంహితా ఉపనిషత్తులు అని. మీమాంసా శాస్త్రము కర్మ కాండాత్మకమగు సంహితారణ్య భాగాన్ని విచారించు శాస్త్రముగుటచే పూర్వ మీమాంస అయినది. ఉపనిషత్తులు వేదము యొక్క చివరి భాగమునకు చెందినవి. అందుచేతనే వాటికి వేదాంతాలని పేరు. వీటిని వివేచించు శాస్త్రానికి ఉత్తర మీమాంస అని పేరు. కాని నేడు మీమాంసా పద వ్యవహారము పూర్వ మీమాంసకే వాడబడుచున్నది.

ఈ మీమాంసా దర్శనానికి ప్రవర్తకులు జైమిని మహర్షి. అతడు వ్రాసిన పన్నెండు అధ్యాయములుగల సూత్ర గ్రంథమే దీనికి ఆధారము. దీనిపై శబరస్వామి వ్యాఖ్య వ్రాసినారు. అదే శాబర భాష్యము. ఈ భాష్యమునకు కుమారిలభట్టు అతి విస్తృతమైన వ్యాఖ్య వ్రాసినారు. ఈ కుమారిలభట్టు మన తెలుగువాడు. శాబర భాష్యమునకే ప్రభాకరులు 'బృహతీ' 'లఘ్వీ' అను రెండు స్వతంత్ర వ్యాఖ్యల వ్రాసినారు. అందుచేతనే ఈ శాస్త్రంలో రెండు ప్రధాన సంప్రదాయాలు అవతరించినవి. అందు కుమారిల ప్రవర్తితము భాట్ట సంప్రదాయము. తదుపరి మీమాంసకులలో చాలా మంది ఈ సంప్రదాయాన్నే అనుసరించినారు. అద్వైత వేదాంతులు సైతము 'వ్యవహారే భాట్టనయః' అని భాట్ట సంప్రదాయాన్నే అనుసరించినారు. రెండవది ప్రభాకర సంప్రదాయాము. ఇదే గురువు తమని కూడా ప్రసిద్ధ దర్శనకారులు తమ తమ దర్శనాలకు తగినట్లుగా కొన్ని ప్రమాణములను అంగీకరిస్తూ ఉంటారు. మీమాంసా దర్శనములో భాట్టులు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి అనుపలబ్ధి అను ఆరు ప్రమాణములను అంగీకరించినారు. పూర్వ మీమాంసాదర్శనమున నాలుగవ సూత్రమున ప్రత్యక్షము. "[2] సత్సం ప్రయోగే పురుషస్య ఇంద్రియాణాం బుద్ధి జన్మా తత్ ప్రత్యక్షం" ఆత్మకు మనస్సుతో, మనస్సున కింద్రియముతో, ఇంద్రియమునకు అర్థముతోగల సంబంధము ప్రత్యక్షము అని నిర్వచింపబడినది. ఉదా- కంటితో పుస్తకాన్ని చూసి, నేను పుస్తకాన్ని చూసినాను అను జ్ఞానాన్ని పొందుచున్నాడు. మీదట పుస్తకాన్ని చూడాలని కోర్కెల ఆత్మ మనస్సును ప్రేరేపించడము, మనస్సు కంటిని ప్రేరేపించడం, కన్ను పుస్తకాన్ని చూడటము జరుగుచున్నది. ఇదే ప్రత్యక్ష ప్రమాణము. [3] "ఆత్మా మనసా సంయుజ్యతే, మన ఇంద్రియేణ, ఇంద్రియ మర్థేన, తతః ప్రత్యక్ష ముత్పద్యతే" అని నైయాయకులు కూడా అంగీకరించినారు.

రెండవ ప్రమాణము అనుమానము. ఇంద్రియ సంబంధములేకనే ఒక పదార్థాన్ని తెలిపేటట్లు చేస్తుంది. ఉదా : వంట యింటిలో అగ్ని ఉన్నప్పుడు పొగ ఉండటము, అగ్నిలేపుడు పొగ లేకపోవడము, దీనిని చూసి అగ్నికి పొగకూ ఉన్న సాహచర్యాన్ని నిర్ధారించుకొంటాడు. ఒకసారి పర్వత ప్రాంతానికి వెళ్ళి కొండపై పొగను చూసి, ఇక్కడ అగ్ని తప్పనిసరి ఉంటూంది అని నిర్ధారణ చేస్తాడు. ఇక్కడ అగ్నిని కంటితో చూడకపోయినా ఎక్కడైతే పొగ ఉంటుందో అక్కడ అగ్ని ఉంటుంది. ఉదా : వంటిల్లు అని వ్యాప్తి ని స్మరించి పర్వతమున పొగ ఉన్నది కావున అగ్ని ఉంది అన్న జ్ఞానము కలుగటానికి అగ్నికి ఇంద్రియమునకు ఎట్టి సంబంధములేదు. ఇదే అనుమానము.

మూడవది ఉపమానము - ఒక పదార్థమునకు ఇంకొక పదార్థమునకుగల సాదృశ్యానుభవము.[3] "ఉపమానమపి సాదృశ్యమ్. అసన్నికృష్టే అర్థే బుద్ధి రుత్పద్యతే. యధా గవయ దర్శనం గో స్మరణస్య. ఉదా: అరణ్యములో గవయ మృగము ఉంటూంది. అది గోవువలె ఉంటుంది. అని చెప్పగనే శ్రోతయొక్క బుద్ధిలో గోవులాంటి గవయ మృగము భాసిస్తూంది. గవయ జ్ఞానము కలుగుతూంది. ఇదే ఉపమాన ప్రమాణము. ఇక్కడ ఇంద్రియ సంబంధము అవసరములేదు. నాలుగవది శబ్ద ప్రమాణము - [4] "శాస్త్రం శబ్ద విజ్ఞానాత్. అసన్నికృష్టే అర్థే విజ్ఞానమ్" అని ఇంద్రియ పదార్థ సంబంధము లేకుండగనే శబ్ద శ్రవణ మాత్రముననే తత్ జ్ఞానము కలుగుతుంది. ఉదా: "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత." జ్యోతిష్టోమ యాగము చేస్తే స్వర్గము లభిస్తుంది అను శబ్దము వినినంతనే యాగ స్వర్గముల జ్ఞానము కలుగుచున్నది! యాగాన్ని గూర్చిగాని, స్వర్గాన్ని గూర్చిగాని తెలుసుకొనడానికి మరొక ప్రమాణమేమి లేదు. కేవలం శబ్దమువలననే జ్ఞానము కలుగుచున్నది.

ఐదవది అర్థాపత్తి. "అర్థాపత్తిరపి దృష్టః శృతోవా అర్థో అన్యధా నోపపద్యత ఇతి అర్థ కల్పనా." విన్నదిగాని, చూచినదిగాని ఇంకొక పదార్థము లేనిదే సంభవించదు అని ఆ పదార్థముల కల్పించుట అర్థాపత్తి ప్రమాణము.

ఉదా: "పీనో దేవదత్తః దివా న భుంక్తే" - దేవదత్తుడు బలిసియున్నాడు కాని పగలు భోజనం చేయడంలేదు అను స్థలమున భోజనములేకుండా బలముగా ఉండడము సిద్ధించదు, పగలు భోజనము చేయనప్పటికి రాత్రి భోజనము చేయుచున్నాడు అని రాత్రి భోజనాన్ని ఆక్షేపించు కొనుచున్నాము. ఇదియే అర్థాపత్తి ప్రమాణము.

ఆరవది అనుపలబ్ధి - "అభావోఽపి ప్రమాణాభావః నాస్తీత్య స్యార్థస్య అసన్నికృష్టస్య." అభావము ప్రమాణము కాదు. వస్తువుంటే కనిపించేది. వస్తువు లేదుకాన కనిపించడంలేదు అని అభావ జ్ఞానము కలుగుతుంది అని ప్రాభాకరులు అభావమును ప్రమాణముగా అంగీకరించరు. కాని భాట్టులు ప్రమాణముగా అంగీకరిస్తారు. ఉదా: కూజా కొరకు గదియంతా వెదకుతాడు. ఏక్కడ కనిపించనందున గదిలో కూజాలేదు అను అభావ జ్ఞానాన్ని పొందుచున్నాడు. అని మీమాంసకులు ఆరు ప్రమాణములను అంగీకరించుచున్నారు. కాని వీటిలో శబ్దమునకే ఎక్కువ ప్రాధాన్యమును ఇచ్చినారు.

ఈ శబ్దము రెండు విధములు. లౌకికము వైదికములని. లౌకికము పురుష నిర్మితము. కాన భ్రమ ప్రమాదాది దోషములకు అవకాశ మున్నది. వైదికమున అట్టి దోషములకు అవకాశము లేదు.

వ్యాసుడు రచించిన దానికి వైయాసిక్య మన్నట్టుల కాఠకము ముదలైన పేర్లు ఉండటం చేత అయా భాగాదులను కఠాదులు రచించినట్లు తెలుస్తున్నది గదా? అని ప్రశ్నింపచ్చును. దానికి మీమాంసకులు ఈ విధముగా సమాధానము చెప్పినారు. [5] "ఆఖ్యాః ప్రవచనాత్" ఆయా వేదశాఖలలో రచించలేదు కాని ఆ శాఖల ప్రవర్తింప జేసినారు కాన కాఠకము, కాపిలము ఇత్యాది నామములు వ్యవహరింపబడుచున్నవి. మరియు భారతము వ్యాస రచితము. రామాయణము వాల్మీకి రచితము అన్నట్టులే వేదమునకు కూడా రచియితలుంటే తప్పనిసరిగా స్మరింపబడి ఉండెడివారు. అలా లేరు కాన వేదము అపౌరుషేయము. ఈ వేదము కర్మకాండను బోధిస్తూంది. ఈకర్మకాండను మీమాంసాదర్శనము కామ్య, నిత్య, నైమిత్తికములుగా ప్రతిపాదించుచున్నది. కామమనగా కోరిక. తన కోర్కెల సిద్ధింప జేయడము కొరకు ఆచరించు కర్మలు కామ్య కర్మలు. ఉదా: "పుత్ర కామేష్టి" పుత్రులు కావాలనుకొంటే ఈ ఇష్టిని చేయాలి సంతానము సంప్రాప్తిస్తుంది. కోరికలు లేనివాడు ఈ కామ్య కర్మల నాచారించి స్వర్గము కావాలనుకుంటే జ్యోతిష్టోమము చేయాలి. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని. ఇక్కడ ఒక సందేహము. యాగము సమాప్తి కాగానే నశించుచున్నది. ఫల మప్పటికి పుట్టలేదు. చాలా కాలము తరువాత ఫలము కలుగుచున్నది. అలాంటప్పుడు నశించిన యాగము ఏ విధముగా ఫలాన్నిస్తుంది అన్న ప్రశ్నకు మీమాంసా దర్శనము ఈ విధముగా సమాధానము చెప్పుచున్నది. యాగము చేయగానే కర్త యొక్క ఆత్మలో ఒక 'అపూర్వము' లేదా అదృష్టము కలుగుతుంది. పుణ్య కర్మలవలన పుణ్యాపూర్వము లేదా పుణ్యాదృష్టము పుడుతుంది. పాప కర్మలవలన పాపాపూర్వం లేదా పాపాదృష్టం పుడుతుంది. అది కర్మలు నశించినను నశించక కర్తయొక్క ఆత్మను ఆశ్రయించుకొని ఉండి తగిన కాలంలో ఫలాన్ని ఇస్తుంది. కర్మఫల దాత ఈశ్వరుడు అని వేరు దర్శనాలు చెప్పినట్టుగా వీరంగీకరించరు. కర్మ ఫలాన్ని అదృష్టమే ఇస్తుంది. ఈశ్వరుని అవసరంలేదు అని వీరి సిద్ధాంతము. ప్రపంచ సృష్టి, స్థితి, లయకారుడిగా కూడా వీరు ఈశ్వరుని అంగీకరించరు. సృష్టికి ఆద్యంతముల లేవు. ఇప్పుడున్నటులే పూర్వం ఉండేది. ఇకముందు కూడా ఉంటుంది. "న కదాచి దనీ దృశం జగత్" సృష్టి ప్రళయములు జగత్తునకు లేవు. కాన సృష్టి ప్రళయకారకుడు ఈశ్వరుడు అని ఈశ్వరుని అంగీకరించనవసరం లేదు. కాననే నిరీశ్వరవాదులు ప్రచ్ఛన్న బౌద్ధులు అని ప్రసిద్ధి గాంచినారు.

ఒకవైపు ఈశ్వరుడు లేడంటూనే నెయ్యి మొదలగు హోమ ద్రవ్యాలతో "అగ్నయే స్వాహా" ఇంద్రాయ స్వాహా అని సమర్పించుట విడ్డూర విషయము. వారి మతమున దేవతలకు శరీరము లేదు.

శబ్దమే వారి రూపము. కాన ఆహ్వానించిన మరుక్షణమే అయా ప్రదేశముల నుండగలరని మీమాంసకుల అభిప్రాయము. మంత్రములు మహిమ గలవి. వర్ణ క్రమము శబ్దములు మార్చరానివి. ఇట్టి మంత్రములతో చేయు కర్మలే ఫలమునివ్వ సమర్థములు.

నిత్య కర్మలు తప్పనిసరిగ చేయదగినవి. ఉదా:–'అహరహ స్సంధ్యా ముపాసీత.' ఉదయ సాయంకాల వేళల ప్రతి దినము ధ్యానము చేయవలెను. ఈ కర్మల వలన పుణ్యమురాదు కాని చేయని యెడల పాపము వస్తుంది. 'ధర్మేణ పాప మపనుదతి' అని పాప నాశనమే నిత్య కర్మల ఫలము అని భాట్టులు.

మూడవ కర్మలు నైమిత్తిక కర్మలు – 'గ్రస్తే స్నాయాత్'. సూర్య గ్రహణమున స్నానము చేయాలి. 'క్షతే ఆచామేత్' తుమ్మి నట్లైతే ఆచమనము చేయాలి అనునవి నైమిత్తిక కర్మలు.

ఫలము కోరి చేయు కర్మలు కామ్య కర్మలు. తప్పనిసరి చేయాలన్న నియమము లేదు. ఆసక్తి లేకున్నను బ్రతికియున్నంత కాలము చేయదగినవి నిత్య నైమిత్తికములు. మోక్ష కారణముగా వేదాంతులు సైతం వీటిని అంగీకరించుచున్నారు, దీనిని నిష్కామ కర్మయోగ మనిరి, ఇదే ఆత్మజ్ఞానాన్ని పొందటానికి ఆ విధంగా ఆత్మప్రాప్తికి కారణము.

'య న్నదుఃఖేన సంభిన్నం' అన్నటుల సుఖ దుఃఖములకు కారణమైన పునర్జన్మ లేకుండుటే మోక్షము. పునర్జన్మ రాకుండుటకు గత కర్మ ఫలము ఈ జన్మలో పూర్తిగా అనుభవించవలయును. అప్పుడు ఇంకొక శరీరమును ఘటింపజేయు సామర్థ్యము గల కర్మ ఉండదు. కాన అప్పుడు మోక్షము సిద్ధించును. ఇదియే మీమాంసా దర్శన సిద్ధాంతము.

---

1. ఋగ్వేద సాయణ భాష్య [ఆనందాశ్రమము]

2. మీమాంసా దర్శనము [ఆనందాశ్రమ ముద్రణాలయము] పేజీ 31.

3. తర్క సంగ్రహము [చౌఖంబా సంస్కృత సిరీస్]

4. మీమాంసా దర్శనము [ఆనందాశ్రమము] పేజీ 42.

5. పంచోపనిషత్తులు నారాయణమ్ [వావిళ్ల] పేజీ 32.

# రస సమీకరణము – భవభూతి

అలంకార శాస్త్రమున వివాద గ్రస్తములైన విషయములలో రస సమీకరణ మొకటి. కొందఱు ఆలకారికులు తమ తమ ఉపపత్తులు ప్రదర్శించి ప్రకృతి రసము ఒక్కటే ననియు తక్కినవి దానినుండి జనించిన వనియు ప్రతిపాదించిరి.

భరతుడు తాను చెప్పిన ఎనిమిది రసములలో నాలుగు [శృంగార, రౌద్ర, వీర, బీభత్సములు] ప్రధాన రసము లనియు, మిగిలినవి తజ్జన్యము లనియు చెప్పెను.

'శృంగార వీరయోః అన్యతరస్య ప్రాధాన్యం' అని ప్రతాపరుద్రీయ కర్త నుడివెను.

'శృంగార వీర శాంతానాం ఏకోఽంగీరస ఇష్యతే' అని సాహిత్యదర్పణకారుడు పేర్కొనెను.

పైని కేవలము ప్రాధాన్య ప్రతిపాదనము మాత్రమే జరిగి యుండగా మరి కొందఱు ఆలంకారికులు ఇంకను వీరావేశమున 'ఒకటే రసము' అనునొక ఉద్యమమును చేపట్టిరి.

భోజుడు 'శృంగార ఏవ ఏకో రసః' అని శృంగార సమీకరణమును, అభినవగుప్తుడు శాంతరస ప్రాధాన్యమును, నారాయణోక్తిగా విశ్వనాథుడు అద్భుతరస ప్రాధాన్యమును వక్కాణించిరి. ఇట్టివి మరికొన్ని కలవు. ఇది అంతయు ఆలంకారిక లోకమునకు సంబంధించిన విషయము.

ఇట్లుండగా భవభూతి మహాకవి తన ఉత్తర రామ చరిత నాటకమున

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగ మయాన్ వికారాన్
అంభో యథా సలిలమేవ హి తత్సమస్తమ్"

అనునొక శ్లోకమును సందర్భ వశమున రచించెను. దీని నాధారముగా గొని కరుణైక రసవాద మొకటి ఏర్పడి, దానికి భవభూతి నాయకుడుగ నిలబడినాడు. ఆధునికులు అనేకులు [ఆంధ్రులు కూడ] ఆలంకారిక శాస్త్ర రచనలలో ఈ విషయమును ఉట్టంకించుచున్నారు.

"కావున కరుణమొక్కటే రసము అని సారాంశము" అని శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు చెప్పగా—

శ్రీ ఎ. రాములు

"ఒక్క నీరే ఆవర్త బుద్బుద తరంగ మయములైన వివిధ ప్రకారములను పొందుచున్నట్లు కరుణ రస మొక్కడే నిమిత్తభేదము వలన శృంగారాద్యన్య రూపములను పొందుచున్నదని అతని అభిప్రాయము" అని దివాకర్ల వేంకటావధానిగారు నిర్వచించిరి.

"ఎవడీ దుఃఖము స్వరూపము తెలియునో వానికి సర్వరసములు కరతలామలకములుగా నుండును......... వాని హృదయమునందు ఆర్ద్రతా లక్షణము నెలకొనును. ఈ ఆర్ద్రతా గుణమే హృదయము నెలకొన్నచో" .........

అనుచు 'కరుణ' శబ్దమునకు ఒక విశిష్టము విలక్షణమునైన వ్యాఖ్య చేయుచు అంతలోనే

"శోకము స్థాయి భావము. రసము కరుణము. అందుచేత తక్కిన రసములన్నియు రసములు కావు. ఒక్క కరుణ రసమే రసము. తక్కిన రసములన్నియు దీనినుండియే పుట్టును"— అని మిగిలిన వారి వలె శోక స్థాయకమైన కరుణ రసమునే విశ్వనాథ సత్యనారాయణగారును పేర్కొనిరి.

మహామహోపాధ్యాయ కుప్పుస్వామిశాస్త్రిగారు తమ ఆశ్చర్య చూడామణి పీఠికలో రస సమీకరణము గూర్చి వ్రాసిన —

"ఫస్ట్‌లీ దేర్ ఈజ్ ది కరుణ సింత్‌సిస్ విచ్ ఒరిజినేటెడ్ ఫ్రమ్ వాల్మీకి ఎండ్ ఫౌండ్ ఇట్స్ కల్మినేషన్ ఇన్ భవభూతిస్ 'ఏకో రసః కరుణ ఏవ' ఆన్ ది ప్రాక్టికల్ సయిడ్ ఎండ్ ఇన్ ఆనందవర్ధనాస్ 'శోకః శ్లోకత్వ మాగతః' ఆన్ ది తియొరిటికల్ సయిడ్"

అను పంక్తులు చూచినచో ఉత్తర రామ చరిత కరుణ రస సమీకరణమునకు నిరూపకముగా, లక్ష్యముగా వారు భావించినట్లు స్పష్టమగుచున్నది.

నా అనుశీలనము ననుసరించి భవభూతి కరుణరస సమీకరణ వాదిగా గోచరించుట లేదు. అసలు పై భవభూతి శ్లోకమే వివాద గ్రస్తముగా నున్నది. నాటకములోని యొక పాత్ర 'సీతా రామాదుల యందు శోకము భిన్న రూపములలో నున్నను మూలమైన కారణ మొక్కటే' — అని చెప్పుచున్నది. ఇచ్చట భవభూతిచే 'ఏకో రసః కరుణ ఏవ' అని 'రస' 'కరుణ' శబ్దములు ప్రయోగింపబడినవి భ్రాంతి కారకము లైనవి.

కావ్యములందు రసము స్వశబ్దవాచ్య మగుట దోషము. అట్టి యెడ భవభూతి మహాకవి ఇంత సూటిగా రస కరుణ శబ్దములను సాంకేతికములుగా ప్రయోగించునా ?

అసలు ఉత్తర రామ చరిత్రలోని అంగి రసము కరుణము కాదని కొందఱు పెద్దల సిద్ధాంతము. మరి అట్టియెడ భవభూతి తీర్మానమునకు విలువ తగ్గును కదా !

భవభూతి యొక్క చిత్తవృత్తిని, ఆంతర్యమును పరిశీలించినచో వీనికి సమాధానములు దొరుకవచ్చును.

భవభూతి 'ఉంబేక' నామముతో కుమారిలభట్టు శిష్యునిగానుండి పూర్వమీమాంసాది శాస్త్రములు చదివి పరిణతుడైన అద్వైత వేదాంతి యని పరిశోధకులు పేర్కొనుచున్నారు. అతడే స్వయముగా—

యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం తత్కథనేన కిం? నహి తతః కశ్చిద్గుణో నాటకే
యత్ప్రౌఢత్వ ముదారతాచ వచసాం యచ్చార్థతో గౌరవం
తచ్చేదస్తి తతస్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః

అను శ్లోకమున తన యోగ మార్గమును, జ్ఞానమును పేర్కొనుచు తన పాండిత్య వైదగ్ధ్యములకు నాటకము గమకమని చెప్పెను. అతని గమ్యము మాత్రము బ్రహ్మానందమే. దీనిని అతడు బహుధా ప్రస్తరించెను. నాటక ప్రస్తావనలో—

'విందేమ దేవతాం వాణీ మమృతా మాత్మనః కలామ్'

అను శ్లోకమున అతడు వాగ్దేవిని అమృతమైన ఆత్మయొక్క 'కళ' గానే భావించెను.

'యం బ్రహ్మాణ మియందేవీ వాగ్వశ్యేవానువర్తతే'

అను శ్లోకములో కూడ వాక్కు బ్రహ్మతత్త్వమును వశయై అనువర్తించుట స్ఫురించుచున్నది. నాటకాంతమున

"తామేతాం పరిభావయన్త్వభినయై ర్విన్యస్త రూపాం బుధాః
శబ్దబ్రహ్మవిదః కవేః పరిణత ప్రజ్ఞస్య వాణీమిమాం"

అనుచోట అతని హృదయము విస్పష్టముగా నావిష్కరింపబడినది.

"అభినయములచే వివిధ రూపములను పొందిన పరిణతప్రజ్ఞుడైన కవియొక్క వాక్కును శబ్దబ్రహ్మవిదులు ఆదరింతురు గాక !" అనుచోట స్వచ్ఛమైన పరిణత ప్రజ్ఞయే వివిధ రసరూపములైన వాక్కులుగా మారునని, వాని ఆంతర్యమును శబ్దబ్రహ్మవేదులు ఎఱుంగుదురని భవభూతి సూచించెను. పరిణతప్రజ్ఞయే బ్రహ్మజ్ఞానము. బ్రహ్మజ్ఞాన పక్వమై స్ఫటికము వివిధ వర్ణములను ప్రతిఫలించినట్లు లౌకికముగా భావముల నభినయించు శబ్దబ్రహ్మవేత్తయొక్క వాక్కు ఆదరింపబడవలెనని భవభూతి ఆకాంక్ష.

నాటకారంభముననే నాయకుడైన రాముడు——

"హృదయ మర్మచ్ఛిదః. సంసార భోగాః ఏభ్యో బీభత్సమానాః సర్వాన్ కామాన్ పరిత్యజ్య అరణ్యే మనీషిణో విశ్రామ్యంతి"—

అనుచు ఒక పరిణతమైన వైరాగ్య భావమును ప్రదర్శించు చున్నాడు, చతుర్థాంకమున జనకుడు అరుంధతికి నమస్కరించుచు—

"త్రిలోకీ మంగల్యామవనితలలోలేన శిరసా
జగద్వన్ద్యాం దేవీముష సమివ వందే భగవతీమ్"

అను శ్లోకమున భగపతియైన సంధ్యాదేవితో అరుంధతిని పోల్చినాడు. అప్పుడామె——

అక్షరం జ్యోతిస్తే ప్రకాశతామ్ సత్యాపునాతుదేవః పరోరజసాం య ఏష తపతి"—— అన్నది. దీనిలో, మహర్థ మిమిడియున్నది. భవభూతి యొక్క కవితాత్మకుకూడ ఈ ఆశంస అనువర్తించుచున్నది దీనిని బట్టి సత్త్వప్రకాశకమైన, అక్షరమైన పరంజ్యోతియే భవభూతి మహాకవికి గమ్యమని తెలియుచున్నది. కావుననే గాయత్రి మంత్రము లోని చతుర్థ పాదమును ఆతడు ఇట్లు వాక్యీకరించినాడు.

సప్తమాంకమున అంతర్నాటకారంభమున సూత్రధారుడు—— "యదిదం ఆర్షేణ చక్షుషా సముద్వీక్ష్య పావనంచ కరుణాద్భుత రసంచ కించి దుపనిబద్ధం" - అని దానిని గూర్చి పేర్కొనెను. వెంటనే రాముడు -

'సాక్షాత్కృత ధర్మాణో మహర్షయః తేషాం అమృతసారాణి పరో రజాంసి ప్రజ్ఞానాని క్వచిదపి వ్యాహన్యంతే ఇతి అనభి శంక నీయాని'—— అనుట చూడగా భవభూతి దృక్పథము రాముని నోట వెలువడినట్లున్నది. సాక్షాత్కరింపబడిన ధర్మములు కలవారైన మహర్షులయొక్క అమృత సారములు తమో రజస్సులకు పగములై ప్రజ్ఞానములై అవ్యాహతములుగా నుండుననుట ఎంత పరిణతమైన ఊహ! సూత్రధారునకు రామునకు (కవికి) ఎంత అంతరము. లోకము తనను గూర్చి ఏమి అనుకొనునో దానిని సూత్రధారునిచే పలికించెను. తన ఆంతర్యమును రామునిచే చెప్పించెను.

ఇట్టి నిదర్శనముచే భవభూతి కరుణైక రసవాది కాజాలడని స్పష్టమగుచున్నది. రసములన్నియు పరిణత ప్రజ్ఞయొక్క అభినయ రూపములనియు. అక్షరమైన పరంజ్యోతియే గమ్యమనియు భావించు పరిణత బుద్ధి 'ఏకోరసః కరుణ యేవ' అని ఎట్లు వ్రాయును?

దీనికి పరిష్కార మిది——

భవభూతి ప్రయోగించిన రస-కరుణ శబ్దములు సాంకేతికములు కావు. అనగా అలంకార శాస్త్ర విషయములు కావు అయినచో స్వశబ్ద వాచ్య దోషము వెన్నాడును. మరి ఆ పదములకు, శ్లోకమునకు అర్థమేమి? అన్నచో——నిరంతరాను భూయమానమగు శ్లోకమునకు ఆర్ద్రత అని అర్థము. ఎవని హృదయమునందు ఈ విధమైన ఆర్ద్రత యుండునో వాని హృదయమున వివిధ రస బీజములు మొలకలెత్తును. పరిపుష్టములై సంపూర్ణముగా నెదుగును. అంతకన్న అదృష్టవంతుడు మరొకడుండడు. వాని అనుభూతియే అనుభూతి. బుడగలు, తరగలు మొదలగునవి భిన్నముగా కనబడినను నీరు ఒక్కటే కారణమయినట్లు ఈ సచేతనమైన ఆర్ద్రతయే జీవులకు వివిధ రసములను అనుభవించు అర్హతను సంపాదించుచున్నది.

ఇదియే ——

'సవాసనానాం సభ్యానాం - రసస్యాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభాః'

అను శ్లోకమున ఆలంకారికులచే 'వాసన' అను పేర చెప్పబడినది.

భవభూతికి 'రస' శబ్దము నుపయోగించుట యందు మిక్కిలి మక్కువ. అది సాంకేతికముకాదు. కేవలము అక్షరముల కందని అనుభూతిని వ్యక్తము చేయు తహతహతో దానిని వాడుచుండును.

'యస్మిన్న హార్యోరసః'

'వీరాణాం సమయోహి దారుణరసః' మొదలగు చోట్లే రస శబ్ద మొక మెరుపు. దీనిని గుర్తించిరో ఏమో.

"భవభూతి కవేర్వాచః స్వదన్తే రసరంజితాః"

"భవభూతి జలధి నిర్గత కావ్యామృత రసకణా ఇపస్ఫురన్తి"

అని కొందఱు కవులు 'రస' శబ్ద ప్రయోగముతో స్తుతించిరని చమత్కారమున కనిపించును.

ఇది ఇట్లుండగా 'మహావీర చరిత్ర' నాటకమున

'వీరాద్భుత ప్రియతయా రఘునందనస్య'—— అనుచు తనకు వీర, అద్భుతముల యందు ప్రీతియున్నట్లుగా భవభూతి చెప్పుకొనినాడు 'కరుణాద్భుతం' అని ఉత్తర రామ చరిత్రలో కూడ అద్భుత ప్రసక్తిని తెచ్చినాడు. శృంగారమును ఎడదలు జిల్లు మనునట్లు పోషించినాడు. కావున అతనికి అన్ని రసములు ఒక్కటే.

ఉత్తర రామ చరిత్రలో తమస చెప్పిన శ్లోకముపంటిదే మహావీర చరితమున వీర రస విషయముగా నొక శ్లోకమున్నది.

'అప్రాకృతేషు పాత్రేషు యత్రవీరః స్థితోరసః
భేదైః సూక్ష్మైః అభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే'—

ఉత్తర రామ చరిత్రలోని శ్లోక భావము ఇట్టిదే అయినను ఆలంకారికమైన కూర్పుతో వివాదముల కెక్కినదనపలెను. వాస్తవము నకు రెండు శ్లోకములును ఆయా నాటకములకే పరిమితములు. ఒక వేళ భవభూతి విస్తృతార్థయోజన చేసెనన్నను 'కరుణ' శబ్దమునకు 'ఆర్ద్రత' అను నర్థమే అతని ఆంతర్యమనుట స్పష్టమగుచున్నది.

కావున ఆ శ్లోకము నొక సమీకరణ వాదముగా చెప్పుట సరికాదు. భవభూతి కరుణ రసమును అద్వితీయముగా పోషించి యుండవచ్చును గాని కరుణ మొక్కటే రసమను నంతటి లౌకికుడు కాడు. వ్యాఖ్యాతలే అతనిని ఇట్లు చేసిరి.

ఉత్తర రామ చరిత్రకు వ్యాఖ్య వ్రాసిన వీరరాఘవ పండితుడు-

"ఇద మత్ర కవేర్మతం. యద్యపి శృంగార ఏక ఏవ రస ఇతి శృంగార ప్రకాశకారాది మతం. తథాపి ప్రాచుర్యాత్ రాగి విరాగి సాధారణ్యాత్ కరుణ ఏక ఏవ రసః. అన్యేతు తద్వికృతయః"

అనుచు తన ఊహను కవి మతముగా ప్రకటించుట ప్రామాదికము.

భోజాది సమీకరణ వాదులందరికిని భవభూతి పూర్వుడు.

సారాంశ మేమనగా భవభూతి హృదయము ఎంత ఆర్ద్రమో అంత బ్రహ్మజ్ఞాన విలసితము. బ్రహ్మానందమే అతని లక్ష్యము.

ఉత్తర రామ చరిత్రలోని శ్లోకము కరుణరస సమీకరణము నకు సంబంధించినది కాదు.

ఆ శ్లోకములోని 'కరుణ' శబ్దము రసార్థకము కాదు. భవభూతి కరుణ రసమును ఆదరించినవాడే కాని అదే రసమని వాదించిన వాడు కాడు.

పై నా అభిప్రాయములను సుప్రసిద్ధాలంకారికులు శ్రీ జమ్ములమడక మాధవరాయ శర్మగారికి తెలుపగా 'భవభూతి కరుణైకరసవాది కాడని నా చిరకాల విశ్వాసము. అది నిశ్చయము' అని చెప్పిరి.

పండితులు పరిశీలింతురు గాక!

శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

# ఏల పదాలు – ఒక పరిచయం

ఏల పదాలు జానపద సాహిత్యానికి సంబంధించిన ఒక రూప వైవిధ్యం. ఈ పదాల సృష్టి, గానం కపిలి తోలేటప్పుడే జరుగుతుంది కనుక వీటిని 'కపిలి పాటలు' అని కూడ అంటారు. సేద్యం చేసేటప్పుడు, బండి తోలేటప్పుడు కూడ వీటిని పాడు కుంటారు. దాదాపు ఇవన్నీ రెండు లైన్ల పదాలే. కపిలిని బావిలో ముంచుతారు, మునిగిన బానను పైకి తెచ్చి కాలువలో గుమ్మరిస్తారు. ఇవి రెండు చర్యలు. బానను ముంచటానికి బారినుండి కాడిని పైకి తోలుతారు. ముంచిన బానను పైకి తేవడానికి కాడిని బారిలోకి దించుతారు. ఇవి రెండు చర్యలు. రెండు కాండ్లను ఉపయోగిస్తారు. ఇద్దరు మనుషులుంటారు. పదాలూ రెండు లైన్లే. బారిలో దిగేటప్పుడు ఒకటి ఎక్కేటప్పుడు మరొకటి – రెండు లైన్లు. పదము చివరే అక్షరంతో దిగటం ప్రారంభిస్తాడు. బానిలోకి వేగంగా జారుతాడు కనుక ఆ చివరి అక్షరానికి వేగంగా దొర్లిపోయే రాగం జతపరుస్తాడు.

ఈ పదాలను పరికిస్తే మనం ఆ గ్రామాలలోని వివిధ రకాల ప్రజలని, జీవన రీతుల్ని పరిచయం చేసుకున్నట్లుంటుంది. వారు చేసే శ్రమ, వారు అనుభవించే ఆ శ్రమ ఫలితం, వారి జీవితాల్ని చుట్టుముట్టిన అసమంజసాల్ని, న్యాయాన్యాయాల్ని, కష్టసుఖాల్ని, ఆనంద విషాదాల్ని, అనురాగ ద్వేషాల్ని, ఆశల్ని, ఆరాటాల్ని అంతేగాక వివిధ రకాల అలరించే ప్రకృతి సౌందర్యాన్ని చూస్తు న్నట్లు ఒక మధురమమైన అనుభూతి కలుగుతుంది.

## శ్రమ

అతడు శ్రమిస్తాడు. ఊపిరి పీల్చడం ఎట్లో శ్రమ చేయ డమూ అంతే. శ్రమ లేని జీవితాన్ని ఊహించలేడు. పనిని ప్రేమి స్తాడు; గౌరవిస్తారు. పనిలో ఆనందాన్ని, అందాన్ని చూస్తాడు. ఎంత కష్టమైనదైనా సరే వెనక్కి పోడు. బరువు పడడు. పని బరువైనదైనకొద్దీ, కష్టమైనకొద్దీ ఛాలెంజిగా తీసుకుంటాడు. శక్తి నంతా ధారవోసి వీరోచితంగా నెరవేర్చుతాడు. పనిలో లీనమై అలా నెరవేర్చడమే మనిషి గొప్పదనంగా భావిస్తాడు. పనినే కాదు, పని పరికరాల్నీ ప్రేమిస్తాడు. వాటిని సంగీత సాధనాలుగా ఆలాపిస్తాడు, శ్రమైకజీవన సౌందర్య మతనికి.

కపిలి తోలినా, పంట పెట్టినా, బేరం చేసినా, గానుగ తోలినా, బండి తోలినా, మాన్లు కొట్టినా, మరేమి చేసినా సాటిలేని విధంగా చేయాలనుకుంటాడు. ఎద్దుల బేరంలో వేల్లమద్ది గొల్లారెడ్డి అతని కతడే సాటి. రామిరెడ్డి ఎపుడూ చినాచెట్లలో మునిగితేలు తుంటాడు. గంగిరెడ్డి గానుగ పెట్టింది మొదలు కడయ్యేవరకూ

యింటికి రానేరాడు. భీమన్న వేసిన ఒక్క గొడ్డలి దెబ్బకే మాను మొదలంట కూలుతుంది. బావ కొడుకు బండి తోలితే పర్వతాలు నేల కొరుగుతాయి.

కవిలి తోలటం చిన్నాబన్నా పనికాదు. ప్రాణాపాయకర మైనది. చాలా మెలకువగా వుండాలి. ఏమాత్రం అజాగ్రత్తఅయినా "గంగమ్మ తల్లిని చేరుకోక తప్పదు." కోడి పుంజు కోటలెక్కి కూత కూసే వేళ అతడు కవిలి బాన వీపున మోసుకొని, ఎద్దులు తోలుకొని బాయి దగ్గరకు వస్తాడు.

"బాలులం మే మొచ్చినాము
బాయి గంగా మేలుకో యా" అని గంగను మేల్కొలుపుతాడు.

"కాపాడుతల్లీ" అని దండం పెడతాడు. "ఇద్దరము బాలలం భద్రము బాయి గంగా" అని భక్తిపూర్వకమైన హెచ్చరిక చేస్తాడు. "బాలుడు, ఎద్దులునీభారమమ్మా"అనిభారమంతా గంగపైకి మోపుతాడు

అతడు పదాలేస్తుంటే వెండిది కవిలబిల్ల ఏడునాదు లెల్లబల్కుతు సంగీతం సమకూర్చుతుంది.

"దాపలెద్దు ధర్మరాజు, వలపలెద్దు పగలకాడు
ఏడువూర్ల ఎద్దుల్లో నా ఎద్దులకు దీటే లేదో" అని ఎద్దుల్ని కీర్తిస్తాడు. అతని ఎద్దులు బారిమీద బొమ్మలై కులుకుతాయి. గుణ్ణాలిడిసినట్లే. ఆ ఎద్దులకు ముల్లుబర్ర అట్లాంటి యిట్లాంటివి కాదు. "ఎర్రగొండ ఎదురుబర్రనా ఎద్దులకు ముల్లుబర్రా" అని గొప్పగా చెప్తాడు. మల్లమ్మ చెరువూ మంచిదే మందు నీళ్ళకే మరువులెల్లుతుంది.

ఆరుగాలం యింత జీవన్మరణ పోరాటంగా కష్టపడినా ఫలితం? ఆకలి, దరిద్రం, రోగం. విషాదం.

"బాయి బాయి కవిలితోలి బలము తగ్గె చిన్నదానా!" అని తన ఊహాలోకపు చిన్నదానితో తన ఆవేదన వెలిబుచ్చుతాడు అపుడు ఆ సుందరి——

"కవిలితోలి కడగా రారో కందిబ్యాళ్ళ పూర్ణము పెడతా
గుడ్ల పెట్టను కోసి గోధుమ పూరీలు చేసి పెడుతా" అంటుంది. ఇదంతా అతని ఆశ. జీవితమంతా వేసినా తీరనే తీరని రుచికర స్వప్నం పంట పండీ ఆకలి. అందువల్లనే ఇది మిక్కిలి విషాదకర ఘటన. ఈ విషాదానికి కారణం దేవుని దయ లేకపోవడమే అనుకుంటాడు. "కడుపునిండ తిండలేదు, కట్టుకోను గుడ్డలేదు చేసిన పాపమేమిర బగవంతుడా?" అని అడుగుతాడు. పైదాని దయ వుంటేనే జీవితం వెల్లమారుతుందనే ఈ తాత్విక తే అతని సమస్త జీవిత విషాదానికి కారణం

ఇంకా అవుర్లో శ్రమద్వారానే కాక ఇతర మార్గాలద్వా డబ్బు సంపాదించేవారూ వున్నారు. దొంగ రాముళ్ళ గురించి, నే గుంతలు పడే వరకూ కూర్చొని సిగ్గులజ్జ విడిచి పైమిలది గుడ్డలత సహ ఒడ్డి అడే జూదగాళ్ళ గురించి, పీల్చి పిప్పిచేసే వ్యాపారు గురించి, వడ్డీ వ్యాపారుల గురించి ఏల పదాలు తెలుపుతాయి. అప్పుల్ని చెల్లి రోగంతో పోలుస్తారు. చెల్లి రోగము మాననట్లే అప్పులూ తీరవు వ్యాజ్యాల గురించి "వెండి కూడినా, బంగారం కూడినా పార్టీలక మొదలంట ఊడూ" అంటాడు,

## కు టుం బ జీ వి తం

సమాజంలోని వైరుధ్యాలు, వైషమ్యాలు సూక్ష్మరూపంలో కుటుంబంలో కనబడుతాయి. యజమాని కింద బానిస, ప్రభువుకింద దాసుడు. పెట్టుబడిదారు కింద కార్మికుడు — ఈ వ్యవస్థా రూపమే కుటుంబంలోనూ కనబడుతుంది. మగవానికింద స్త్రీ, అత్తకింద కోడలు వ్యవస్థ కనుగుణ రూపమే. కోడలుమీద అత్త చెలాయించినట్లుగ అల్లునిమీద మామ చలాయించలేడు. కారణం ఇద్దరూ మగవారు, సంపదకు అధికారులు. మగవానికున్న ఆధిక్యత ఆర్థికంగా అతనికున్న పెద్దరికానికి ఫలితమే. (కొండొకచో 'పుత్రికా వాత్సల్యాన్ని' అడ్డు పెట్టుకొని మామనే ఆడించగలడు అల్లుడు) వారసుల్ని కనే, సేవలు చేసి శారీరిక సుఖాలు తీర్చే భోగవస్తువు స్త్రీ. పీడన వున్నచోట్ల తిరుగుబాట్లూ ఉంటాయి. ఈ క్రమానికి సూక్ష్మరూపాన్ని కుటుంబ కలహాల్లో చూడవచ్చు ఒకోసారి భర్తమీద భార్య, అత్తమీద కోడలు అధికారం చెలాయించడం కద్దు. అంటే ఒకరిమీద ఒకరు అధికారం చెలాయించడం తప్ప, ఎదుటివారు కిమ్మనక తమకు లోబడి వుండా నడం తప్ప పరస్పర అవగాహనతో, ఓర్పికతో, సౌమనస్యంతో కల మెలసి మెలగటం, పరిష్కరించుకోవటం ఉండదు. ఆర్థిక పరాధీనత మూఢ సాంప్రదాయాలు, ఆచారాలు, నమ్మకాలు స్త్రీ జీవితాలక అతలాకుతలం చేస్తున్నాయి. గ్రామీక మహిళ అంతో యింత స్వతంత్రంగా వ్యవహరించగలిగి వుంటుంది. అనుకూలంగాని వివాహ బంధాన్ని తెంచుకోగలిగి వుంటుంది. అంతో యింతో స్వేచ్ఛ అనడ ఎందుకంటే ఏ సమాజంలోనైనా పాలక వర్గం తన కనుకూల సంస్కృతీ సంప్రదాయాలకు ప్రజలో కొనసాగింపజేస్తుంది. వర్గ దోపిడీ సమాజం పీడనా సంస్కృతినే రుద్దుతుంది. అది యజమాని కార్మికుల సమానత్వాన్ని అమోదించదు. ఆలుమగల సమానత్వాన్నే గూడ సమర్థించదు. స్త్రీ స్వేచ్ఛను సహించదు పీడితుని స్వేచ్ఛను సహించదు గనుక బలవంతంగానైనా పురుషాధిక్యాన్ని, స్త్రీహీనత్వాన్ని పోటీలు పెట్టి నిలబెట్టుతుంది. అందుకే శ్రమ జీవుల కుటుంబాలలో కూడా స్త్రీకి దుర్గతులే తెలుచుకొని వుంటాయి. అయినా ఆస్తిపర

ాలలోకన్నా శ్రామిక వర్గాల మహిళ స్వతంత్రంగా జీవితాన్ని పర్యోగలిగి వుంటుందన్నది వాస్తవం.

మొగుడే కుటుంబంలో సర్వాధికారి. అతడు లేక ఏ చిన్నపనీ సగదు. అతడు పోతే బాయికింద బీడే. కనీసం ఇండ్లు కప్పనూ ష్టమే. మొగుని చలకోల ఏటుపడితే పెండ్లాం గాజులు చిట్లుతాయి. నిండా వాతలే.

“ఈ యింటివోకిలో కూడొండలేను, రోకలెత్తి దంచలేను

దిన దినమూ దెబ్బలాయ దిక్కులేసి పాన మాయె” అని లపిస్తుంది కోడలు.

“చేసుకున్న మొగుడైతే చేతులెత్తి మొక్కల్ల” అనే వాళ్ళూ న్నారు. మందుబెట్టి మొగుని జంపి కోర్టుకెక్కిన వాళ్ళూ వున్నారు.

ఒకామెకు ఒకన్ని వలచి మరొకని కట్టుకున్నా బాధ తప్ప దంట. అయితే కొంచెం తేడా వుంది. “వానికంటె వీడు మేలు - ాకి లేసి దంచుతాడు” అంటుంది.

వారసుని కోసమో, వాంఛల కోసమో మూడో పెండ్లి సేసుకున్న ముసలోడు “దూడపిల్లా దుడపడింది బలము చాలదు మిచేతు?” అని వాపోతాడు.

అత్త అధికారాన్ని కోడలు సహించదు. కోడలు ఎదిరింపుకు అత్త ఓర్చదు. అందుకే

“కత్తి కట్టిన కోడిపుంజులాలె
కొట్లాడుతారో అత్తకోడల్లు” అంటాడు.

ప్రతి చిన్న పనికీ అత్తామీద ఆధారపడటం నామోషీ. అత్త ఆ పని నెరవేర్చడానికి తిరస్కరిస్తే మరింత అవమానం. కొన్ని యిండ్లలో కమ్మలు, మెట్టెలు మెరుగు పెట్టించాల్సిన బాధ్యత పుట్టింటివారిది. ఆచారం. పుట్టింటివారు మెరుగు పెట్టించలేపోతే, అత్తగార్ని అడిగితే, ఆమె దెప్పిపొడిస్తే అది కోడలికి భరించలేని బాధ. అందుకే

“కమ్మలట్లా మెరుగుపెట్టి
అత్తను గానకుండ జొన్న లిస్తా” అంటుంది కోడలు కంసాలితో. చాటుమాటు వ్యవహారంతోనైనా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకో జూస్తుంది.

కోడళ్లలోనే ఒకరికొకరికి కొవిరిబెల్లం ఒద్దికలుంటే, మరి కొందరిలో గంగ గౌరి సంవాదా లుంటాయి.

సమిష్టి కుటుంబాలు వ్యష్టి కుటుంబాలుగా చీలిపోవటాన్ని చెడు సంఘటనగా వర్ణిస్తాడు ఏలపద కర్త. సమిష్టి కుటుంబ విచ్ఛేదకురాల్నిగా స్త్రీని - ముఖ్యంగా కోడల్ని నిందిస్తాడు.

“కూడా వుంటే కుదిరేది లేదు
వేరే పోదాము వెర్రి మొగుడా” అని చెవినిల్లుకట్టుకొని పోరి జయిస్తుందట కోడలు. నిజంగా ప్రేమ, అనురాగం, వాత్సల్యం, మమత వగైరాలతో వుండవలసిన కుటుంబ సంబంధాలు రాబందు గోళ్ల చిక్కిన పావురంలా గిలగిలలాడుతుంటే, నిప్పుల బడిన పువ్వుల్లా మలమల మాడుతుండమే అతని ఈ తల్లటకు కారణం. సీతారాములు తలిదండ్రులు. రామలక్ష్మణులు అన్నదమ్ములు. సీత లక్ష్మణులు వదినె మరుదులు. వీరిని ఆదర్శంగా తీసుకోవాలని చెప్పాడు. లోకంలో అలా జరగనందుకు బాధపడతాడు.

సంతానం మీద ముఖ్యంగా మగ సంతానం మీద మిక్కుటమైన ఆసక్తి. చందమామలాంటి కొడుకు పుట్టాలని మొక్కుకుంది ఆమె. అప్పల్ల[1] పుడితె పత్తెముంది బాగా సాకాలని అనుకుంది. దేవలాలకు తిరిగింది. క్షేత్రాలకు పోయింది. నాగులకు ఒక్క పొద్దువుంది. ముత్తైదువుల ఆశీస్సులు పొందింది. అయినా సంతానం కలుగలేదు. ఇక ఆమెకు మగని మొగతనం మీదే అనుమాన మొచ్చింది. “మూతి మీద మీసముంటే ముట్టు నిలపర ముంత కొడకా” అని నిలదీసింది.

## దాంపత్యేతర సంబంధము

ప్రేయసీ ప్రియులు సంకేత స్థలాలలో కలుసుకోవడం ఉత్సుకతతో వర్ణిస్తాడు ఏలపదకర్త.

ఒక కన్య సున్నంగ తలదువ్వి, నూగ్గాయి జడవేసి, సిరిచీర కట్టుకొని, మొగ్గల రవిక తొడుక్కొని; లాకదూదవాడు[2] కవిలికాడ ఉన్నాడని కడపలో కలకండ వేసుకొనిపోతే అతగాడు అక్కడలేడు. ఆమెకు దుఃఖములు కలిగినాయి. కంటినీరు కడవ నిండింది.

ఆమె, అతగాడు “కట్లకని నీవురా, కముజుతేట నేను వస్తా” నని కూడబలుక్కున్నారు. అదే ప్రకారంగా ఆమె పోయి కట్టెలేరుతోంది. కొంత సేపటికి కముజు కూత వినబడింది. ఇక ఆ బాలపాప “కముజు కూసే కూతలకు కట్టెలరబుద్ధి కాదో” అంటుంది.

ఎవర్నేమి అడగల్ల? “నీకు నాకు ఇష్టమైన ఎక్కుదాము దొంగ రైలు” అంటాడట అతగాడు.

“వానవచ్చి వాడు పచ్చ వానికేమి కప్పల్ల?” అంటే “వజ్రాల పైటకొంగు వానికింత కప్పరాదా” అన్నది సమాధానం.

ఈ ఏలపద కర్త సాంగత్య వాంఛను, విచ్చలవిడిగా తీర్చు కోవటాన్ని, ఎక్కువ పరిమాణంలో, ఎక్కువ బూతులతో వర్ణిస్తాడు. ఈ పదకర్త మగవాడే కనుక ఇందులో 'మగబుద్ధి' పాలెక్కువ. మగవానికన్నా స్త్రీనే విచ్చలవిడిగా తిరుగుతుంది. స్త్రీనే మగవాన్ని చెరుపుతుంది. లోకాన్ని చెరుపుతుంది అంటాడు.

స్వీయం నిగ్రహం, సంయమనము, ఉదాత్తమైన ఉన్నతమైన సంస్కృతీశీలత లేనపుడు విచ్చల విడితనం పెరుగుతుంది. ఉదాత్తమైన ఉన్నతమైన గుణశీలత అలవర్చక పోవడమేకాక మానవుని బలహీనతల ఊబిలో ముంచే దోపిడీ సమాజపు హీన సంస్కృతే ఈ విచ్చలవిడి తనాన్ని పోషిస్తోంది. అంతేగాని కొందరు చెప్తున్నట్లు స్త్రీ సమాన హక్కులు, ఆర్థిక స్వేచ్ఛ, సంపాదనా పరురాలు కావడం మాత్రం కారణం కానేకాదు.

ఇతని అంచనా ప్రకారం స్త్రీలలో నూటికి తొంబై ఆరు భాగాలు చెడిన వారేనట. వస్తువుల కాశపడి సుఖాన్ని అమ్ముతారు. చలువ చీర కాశపడి చాకలోన్ని, గుండీ రవిక కాశపడి మిషనోన్ని, కట్లపొడికి[3] అంగిడోన్ని ఇంకా కమ్మల కోసం. కడియాల కోసం, మాడల కోసం, ఉడత బొప్పల చీర కోసం, వేలు వేలు ఉంగరాల కోసం, చీనా చెట్ల కోసం, మాడల కోసం, ఊరకనే ఉండలేక కూడా మగవాన్ని తగులుకుంటారు ఆడవాళ్ళు.

"నిన్ను జూచి నిలవాలేను నన్ను జూచి నగావద్దు" అని అతగాడంటే

"కానిపోని మాటలకు కన్ను సైగ లేల పోరా" అంటుందట ఆమె.

"నాటికి కన్నుల్లదానా ! యాటికి రమ్మన్నా రావు" అంటే

"వస్తా పోతా డాటే గాని చేత బొట్టు కూడా లేదో" అని ఈసడిస్తుందట.

ఆడవారు తనను మరపుకోవటానికి అనేక రకాలుగా తంటాలు పడతారట.

"నేసేది బలె నేర్పురాలు నెయ్యిపోసి మరపుకుండె"
"కాపుది బలె కమ్మని ముండ కూర చేసి పెట్టు" అంటాడు. ఆడవారిలో తన కోసం పోటీ వుంటుంది. పెంర్లాట వుంటుంది బలిజది బంధుత్వమైతే కాపుది తాకుండ చేసిందట.

ఆడవారు మోసకార్లట. సంకేత స్థలాలకు రమ్మని, రాకుండ మోసం చేస్తారు. అందుకే వారిని అతగాడు శపిస్తాడు కూడ. 'అక్కా చెల్లెండ్రమాట ఒక్కనాడూ నిజములేదే' అంటాడు. 'వడ్డివాని మాట నమ్మరాదు వంకర కుంట చేరరాదు' అంటాడు. 'పాయికారి దాని మాట పానముంటే నమ్మరాదు' అంటాడు. "వస్తానని రాకపోం దాని ఒండు బిడ్డ సావనానీ" అని శపిస్తాడు.

స్త్రీ మొగుని మీద కన్నా 'మిండని' మీదే ఎక్కువ యిష్ట చూపుతుందట.

"ఎలపాప ఏడిచేవు
నీ మొగుని పైలో ఎట్లుండాది?" అంటే

"మొగునిమీద గుండ్లు బడ
మిండగాడు బతకదంట" అని గోంగురులు పెడుతుందట.

మొగునికి ద్రోహం చేసే ఆలు వున్నట్లే, ఆలుకు మోసం చేస్తున్న మొగుడూ వున్నాడన్నది వాస్తవం. అయితే భర్త మోసాన్ని ఈ పదకర్త చెప్పడు. పైగా తానేమో (మగవాడు) ఏమీ ఎరుగనివాడు అంతా స్త్రీలే 'నేరనోళ్ళకూ నేర్పిస్తా"రట.

రహస్యం బైట పడకుండ వుండటానికి "ఎద్దు తొక్కిన అడుగులోనే ఎల్లిరార ఎంకట రమణ" అని వుపాయం సూచిస్తుంది ఓ విధవరాలు. అయినా ఈ గుట్టు తెలుసుకున్నాడు రామిరెడ్డి. అందుకే "రొట్టి చేసి పెడుదు గుట్టు రట్టు చేయకుమ"ని లంచం ఆశ పెడ్తుంది.

అతగాడు నమ్మితే చీనా చెట్లని ఆశ చూపినాడు. ఆ కన్నె నమ్మింది. వాడు నమ్మక ద్రోహం చేసినాడు.

"చిన్నవాడా! నిన్ను కూడక మునుపు
నిమ్మ పండు వొళ్ళూ నాది అంటూ వాని నమ్మకద్రోహానికి ఫలితంగా గుల్లయిన శరీరాన్ని చూపుతుంది ఆవేదనతో.

ఆ బాల పాప సుగ్గి[4] కాలంలో బంగకపోయినా అందదు పొందదు. అయితే ఆ పాపే గాలి కాలంలో అతని కోసం వెంటపడుతుంది. బతిమాలుతుంది. 'ఎండ కాలంలో కాలే కాలే బండను' పరుపుగా చేసుకోమన్నా ఆంగీకరిస్తుందట. ఆర్థిక పరిస్థితులు మనిషిని ఎంత నీచస్థాయికి దిగజార్చుతాయో అనేందుకు స్పష్టమైన ఉదాహరణ. లేనివారి ఆకలి అవసరాలను ఆసరాగా తీసుకొని ఉన్నవారు లేనివారిని ఎంత కిరాతముగా పీడిస్తారో అనేందుకు; ఈ ఆకలి అవసరాలే - ఈ ఆర్థిక పరిస్థితులే ఉన్నవారికి లేనివాళ్ళి దాసోహం చేయిస్తున్నా యనేందుకు; ఈ అవసరాలు తీరే ఆర్థిక పరిస్థితులు ఒనగూడితే ఈ పీడనకు లొంగిపోరని, పీడన అంత మవుతాదనేందుకు స్పష్టమైన ఉదాహరణ.

"ఈడు కాదు, జోడు కాదు, వావి కాదు వరస కాదు వానిపోరు పోరు కాదు* అంటుంది ఒకతె.

''ఒద్దు ఒద్దు ముద్దులా మరది
అన్న పెండ్లాం కన్నతల్లి'' అని ఓ వదిన బుద్ధిచెప్తే చలికి చలిమంట వేసుకొమ్మని ఓ వదిన మరదిని రెచ్చగొట్టి పిలుస్తుంది.

## వర్ణన

దృష్టికి ఆనిన భావనకు తోచిన ప్రతి వస్తువుమీద, సంఘటన మీద కవి కడతాడు. ఈ వర్ణన ఆయా కర్తల సామర్థ్యం బట్టి కొన్ని చోట్ల పేలవంగా వుంటుంది, కొన్ని చోట్ల అద్భుతంగా, మురిపించే విధంగా వుంటుంది. అల్పాక్షర అనల్పార్థ రచనగా వుంటుంది.

స్త్రీని వర్ణించటంలో బలె ఉత్సుకత, శ్రద్ధ చూపుతాడు.

దాసరి యంగప్ప బిడ్డ ధర్మారం వేగుచుక్కట. వెండివి జోడుంగరాల పిల్ల తురకోళ్లపిల్ల. కంసతోళ్లపిల్ల కంటికింపిరిగా వుంటుంది. చీటీ పూల రవికది చించానోళ్ల చిన్నది. పది మంది కూలోళ్లలోన పగలు చుక్క నేసేపడుచు. అగ్గురారం సుబ్బిశెట్టి పిల్ల కొప్పులో బంగారు బిల్ల పెట్టుకుంది.

''అద్దములా దాని మొగము ఎద్దులింటికి వెలుగు తగిలా'' అని ఆ కన్నె మొగాన్ని వర్ణిస్తాడు.

''కాటికి కన్నుల్లదానా ! కందిరీగ నడుము దానా ! వదులు కొప్పు బిగువు రవిక ఎంగిసీళ్ళు చేదె దానా ! చేదబాయి బండ్లపైన కులుకుతున్నావు: పగలు పగలు పదొద్దు పాప. పక్కలేస్తావు నీళ్ళ కడవ'' అని హెచ్చరిస్తాడు ఓ పగలవారి మాషుగాడు.

''కురులు కురులు కూడదీసి, పక్కపాపిట దీసి, కాపరంబు కన్నులాకు కాటికింత పెట్టుకోని, నీళ్ళబావి నడవలోన నిలచి రెండు మాటాడు'' మంటున్నాడు కవిలి తోలుతున్న గజ్జ వేసిన గంగిరెడ్డి సేద్యగాడు

ఆ బాలపాప తనను మల్లి మల్లి చూసుకుంటూ పోతుంటే ''మల్లి మల్లి చూడాకే మల్లెలు జల్లున రాలినట్లుండు'' అని మాటల్ని గుబాలిస్తాడు.

సార్ల సార్ల అంగీ తొడుక్కొని చదువు చెప్పే సాతాని, కిర్రు మెట్లు తొడుక్కొని బోజంబంగా నడిచే కిట్టిగాడు, పుల్లిగాని అసాధారణ కోపం, కాసు గుర్రం పాలకీలో పోయే రంగారెడ్డి పయనం, ఐటికాలు ఎగరేసుకుంటు ఎడమ చేయి వూపుకుంటు పయనం అయిన శెట్టి దూడ దాండ్లకు ముందు తెమ్మని దుర్గం దూదేకులోని ఎంటపడే దూద వాండ్లు, సంచి భుజాన వేసుకొని వచ్చే మందుల సౌడన్న, ఎండ పొద్దు ఎదురు గాలికి పోతుంటే ఎగిరే పైట, కొత్త చీర కట్టుకొని కొడుకు రంగా నెత్తుకొని పోతుంటే కొయ్య తట్టుకొని, కోక కొట్టు పట్టి కొడుకు రంగా నేలపడటం, వచ్చి పోయే దావలో మందులునూరే అన్న, సంకలో సారాయి సీసాతో పాటలు పాడే పాపిడి 5, సంక్రాంతి పండక్కి జరిగే కోడి పందాలు, పశువులు కూడినపుడు రేగే ఎర్ర దుమ్ము, రాళ్ళ సేనులో పావరేవులు వాలటం, పైన గద్ద పట్టీలు కొడుతుంటే కోడి పెట్టను హెచ్చరించటం, పీర్ల దేవుళ్ల ఊరేగింపు, వచ్చి పోయే దావలో వున్న రాగిమాను రచ్చబండ, రచ్చబండపైన లోకాభిరామాయణాల చర్చ, ఏటిలో టెంకాయ కొట్టడం, ఏటుబడితె జల్లున రాలే ఏటి గడ్డున నేరేడు చెట్టు, తోటలోని మల్లెలు రవరవ గాలికే రాలిపోవటం, ఎద్దు మొద్దు లేని బండి రైలు బండి యిలా యింకా అనేకమైన వాటిని వర్ణిస్తాడు.

అతను పదమేస్తే ఆమె పైటకొంగు అదురుతుంది. అతను పదమేస్తే ఆమె కంటి నీరు కడవ నిండుతుంది. అతను పదమేస్తే ''ఇతూరైరా యాలపదమూ'' అని వన్స్‌మోర్ పలుకుతారట.

(కదిరి, నల్లమాడ తాలూకాలలోని చారుపల్లె, బడవాండ్ల పల్లె, పోలంవాండ్ల పల్లె హరిజనవాడ, మీసాలవాండ్ల పల్లె. పట్నం, కాళ సముద్రం, ఎఱ దొడ్డి, కొత్తపల్లె గ్రామాలలో నేను సేకరించిన 700 యాలపదాలు ఆధారంగా ఈ వ్యాసం. ఇందులో పేర్కొనబడిన ప్రాంతాలు, వ్యక్తులు యిప్పటికీ వున్నారు. ఇందులోని సంఘటనలూ ఈ గ్రామ ప్రజలందరికీ జ్ఞాపకమే.)

## అర్థాలు

1. అప్పల్ల = కొడుకు
2. లాకదూడవాడు = యువకుడు
3. కట్లపొడి = పొగాకు కాడలు మొద్దులు దంచి చేసిన పొడి తాంబూలంలో ఉపయోగిస్తారు.
4. సుగ్గి = పంటల సీజన్
5. పాపిడి = అంబాడీ

**శ్రీ విద్వాన్ దస్తగిరి**



# గ్రంథ విమర్శలు

## మాతృదర్శనం

[రచన : శ్రీ కొండముది రామకృష్ణ. డెమ్మీసైజు. 8+224 పేజీలు. వెల : 10 రూ॥లు ప్రచురణ : ప్రచురణ విభాగం, శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్లమూడి - 522 114, బాపట్ల తాలూకా, గుంటూరు జిల్లా.]

ధర్మమార్గ ప్రచారానికీ, ప్రజాహిత కార్యాలకూ తమ జీవితాన్ని అంకితం చేసిన అవతారమూర్తులకు దేశకాల భేదంగాని లింగవిచక్షణ గాని లేదు. అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ స్త్రీ పురుష భేదం లేకుండా వారవతరిస్తూనే ఉంటారు. అట్టివారిలో, గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకాలోని జిల్లెళ్లమూడిగ్రామంలో ఉన్న మాతృశ్రీ ఒకరు ఆమె జిల్లెళ్లమూడి అమ్మగా ప్రఖ్యాతి పొందినది. ఆమెను గూర్చి విన్నవారెక్కువ. తెలిసినవారుతక్కువ. 1962 నుంచి ఆమె సన్నిధిలో ఆమెకు అంతరంగికులుగానూ, దేవీస్వరూపిణి అయిన ఆమెను పూజించే అర్చకులై ఆమె దర్శనానికి వచ్చినవారికి దర్శన భాగ్యం కలిగించి ప్రసాదం అందిస్తున్నవారూ అయిన కొండముది రామకృష్ణ 1983 లో అరవై యేండ్లు నిండిన ఆమె వజ్రోత్సవ సందర్భముగా ఈ గ్రంధాన్ని ప్రకాశింప జేశారు

అక్కడి విశ్వజననీ పరిషత్తువారు పెక్కు విద్యాసంస్థలు, ప్రజా సేవామందిరాలను నిర్వహిస్తునట్లు 1967 నుండి మాతృశ్రీ మాస పత్రికను నడుపుతున్నారు దానికి ఈ రచయితయే సంపాదకులు. మాతృశ్రీదేవి జీవిత విశేషాలను గురించి, మహిమలను గురించి ఈయన తమ సంపా కీయాలలో పెక్కువిషయాలు తెలిపారు. వాటిలో అరవై మాత్రం మాతృశ్రీ షష్ట్యబ్ద పూర్తి సందర్భముగా ఈ పుస్తక రూపంలో వెలువరించారు మిగిలినవి కూడా ఇలాగే గ్రంథరూపంలో రావలసి ఉన్నది. కాలక్రమాన ఆ పని జరగవచ్చు.

రచయిత దీనికి వ్రాసిన "ముందు మాట" లో మాతృశ్రీ గుణగణాలు చక్కని శైలితో ఎన్నో వర్ణించబడినవి అవి యీ పుస్తకపు సారాంశమని చెప్పాలి. ఆయన ఇలా అంటున్నారు – "రెండు దశాబ్దాలుగా అనుక్షణం అమ్మను దర్శిస్తు అమ్మధ్యాసే ధ్యానంగా జీవిస్తూ అవగాహన చేసుకున్న పరమాద్భుత విషయం రెండు ముక్కల్లో చెప్పాలంటే-అమ్మ స్వరూపలలిత స్వభావ మధుర ఈ సత్యాన్ని ఆవిష్కరించే ఘటనలు అమ్మచరిత్రలో సహస్రాధికంగా దర్శనమిస్తాయి."

ఈ పుస్తకం చదవడం ప్రారంభిస్తే పూర్తిగా చదవాలనే ఆసక్తి కలుగుతుంది. రచన పాఠకుల్ని చివరి వరకూ తీసుకుని వెళ్తుంది. దీనిని చదివితే మాతృశ్రీపట్ల ప్రగాఢమైన భక్తి, ఆదరమూ కలుగగలవు

## శ్రీ గౌరాంగలీలామృతము

(గ్రంథకర్త: క్రీ శే శ్రీ ఉరిటి జానకిరామ పట్నాయక్. ద్వితీయ ముద్రణము ప్రకాశకులు శ్రీమతి-ఉరటి హేమలతాదేవి C/o శ్రీ ఉరిటి-విశ్వనాథం పట్నాయక్. నెం 3/85 యూనిట్ నెం. 6 ఓల్డ్ సెటిల్మెంట్ ఖర్గపురం 721301 కుద్నపూర్‌జిల్లా - వెస్ట్‌బెంగాల్ డెమ్మి 11+417 పుట. వెల 25 రూ. లు. ప్రతులు ప్రకాశకుల వద్ద దొరుకును.)

రామమోహనరాయలవంటి సంఘసంస్కర్తలకూ, జగదీశుని వంటి శాస్త్రవేత్తలకు, రవీంద్రునివంటి కవీంద్రులకూ, శ్రీరామకృష్ణ వివేకానందులవంటి ఆధ్యాత్మిక తత్త్వవేత్తలకూ వంగదేశం పుట్టినిల్లు ఆధ్యాత్మిక తత్త్వవేత్తలకు ఆ అవతారపురుషుల కోవకు చెందిన మహా నీయుడే గౌరాంగప్రభువు ఆయన సిద్ధాంతాలను అనుసరించిన భక్తులు వంగదేశంలోనూ, ఇతరత్రా చాలామంది ఉన్నారు ఆయన జీవితాన్ని లీలలను వివరించే గ్రంధాలు చాలా ఉన్నవి వాటిలో ఈ పెద్ద పద్య కావ్యం ఒకటి ఇది ఇరవై ఆశ్వాసాల పెద్ద గ్రంథి, పద్యాలతోపాటు సందర్భాలయిన వచన భాగాలు కూడా ఇందులో చాలా ఉన్నవి.

సుప్రసిద్ధ విద్వత్కవి విమర్శకులు దివాకరవారు, విశ్వనాథ వారు మున్నగు మహనీయులు ఆంధ్ర విజ్ఞాన యాత్రకై దేశమంతటా పర్యటిస్తున్నప్పుడు ఖర్గపూరులో గ్రంథకర్త జానకిరామ పట్నాయక్ గారు తాము రచించిన యీ గ్రంథంలోని కొన్ని పద్యాలను వినిపించి వారి ప్రశంసలను అందుకున్నారు. 1951 లో వారిచ్చిన అభి ప్రాయలు ఇందులో చేర్చబడినవి. గ్రంథకర్త మరణించిన సంవత్సర కాలం తర్వాతగాని ఇది అచ్చుకాలేదు ఆయన పెద్ద కుమారులు విశ్వ నాథం పట్నాయక్‌గారు ఉదారుల ద్రవ్యసహాయంతో దీనిని అచ్చు వేయించారు. ఆ కాపీలు అయిపోగా 1983లో తిరిగి దీనిని డాక్టర్

దాశరథిగారి సంగ్రహ పీఠికతో ప్రచురించారు ఇది ఖర్గపూరులోని శారదా ముద్రణాలయంలోనే అచ్చుకావడం ఒక విశేషం ఖర్గపూరు పెద్దరైల్వేకేంద్రం ఉద్యోగరీత్యా అక్కడ ఉన్నవేలాది ఆంధ్రులలో సాహిత్యభిమానులు చాలా మంది ఉన్నారు. కొన్నేళ్లక్రితం తెలుగులో అక్కడి నుండి మాసపత్రిక కూడా వచ్చేది!

ఈ గ్రంథంలో గౌరాంగుని జీవిత విశేషాలు, లీలు, ప్రకృతికి ఈశ్వరునికిగల సంబంధాదులు, సృష్ట్యాది విశేషాలు చిద్బ్రహ్మ స్వరూపం మొదలైన పెక్కు విషయాలు వివరించబడినవి. విషయాలను సులభంగా తెలుసుకొనుటకు అవసరమైన విషయసూచిక ఇందులో లేక పోవడం కొరతగానే కానవస్తుంది. రచన సులభ శైలిలో జరిగింది ఒక్క ఉదాహరణ -

శా॥ అజ్ఞుండేనియు మందుడేనియు సునాయాసంబుగా నంచిత
ప్రజ్ఞానందునికై వడిన్ జనపమేల్, సాపుల్ మహాయోచనస
విజ్ఞానాత్ములు, పూర్వపూరుషులు, నావిశ్వాత్ము జేరంగసత్
ప్రజ్ఞంగాంచిరి, దానబోవదగు, సంప్రాప్తించు మోక్షస్థితుల్
[ పుట 2147]

శ్రీ బులుసు వేంకట రమణయ్య

# రాయలు - పెద్దన

## పెద్దనగారి యొక్క చక్కని పద్యము.

[రచన శ్రీ కె ఎస్. కోదండ రామయ్య, ఎం ఏ , బి. ఓ ఎల్ బి టి మాజీ ఎం ఎల్. ఏ 16 పుటలు డెమ్మిసైజు కరపత్రం హోసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి 3వ ప్రచురణ. హోసూరు, ధర్మపురి జిల్లా ]

ఇది శ్రీకృష్ణ దేవరాయల 474వ పట్టాభిషేక దిన సంస్మరణకు పూజా పుష్పంగా సమర్పించబడింది

శ్రీ కోదండ రామయ్యగారు ప్రజా సేవకై జీవితాన్ని అర్పిస్తున్న ఆదర్శ వ్యక్తి రాజకీయాలలో ఎంత సమర్థులో. చరిత్ర పరిశోధనలోను, సారస్వతంలోనూ అంత సమర్థులు విశేషించి, విజయనగర స్మామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణ దేవరాయల జీవిత విశేషాలను గురించి గొప్ప పరిశ్రమచేసి శాసనాలు ఆధారంగా తీసుకొని బృహచ్చరిత్ర గ్రంథాన్ని రచించారు. ఆయన క్రొత్తగా సేకరించిన మను చరిత్ర తాళ పత్ర ప్రతిలో ప్రథమాశ్వాసం చివరి "గంగాస్వచ్ఛ తరంగ—" అనే పద్యంలోని చివరి పాదంలో "బంగాళాంగ (ధ) కళింగ—" అనే దానికి గల "... భంగాలాప! కళింగ..." అనే పాఠాన్ని గూర్చిన చర్చ ఉన్నది చారిత్రకంగా ఆ పద్యానికి ఎంతో ప్రాధాన్యమున్నది. తాళపత్ర ప్రతిలోని "భంగాలాప!" అనేదే తగిన పాఠమని కోదండ రామయ్యగారు నిర్ణయించారు. దానికి దివాకర్లవారు, బులుసువారు మున్నగు విద్వద్విమర్శకుల ఆమోదాన్ని కూడా చూపారు ఆవిధంగానే - ఆ పద్యంలోని రెండవ పాదంలోని "ప్రతి కళా ప్రౌఢి ప్రియం భావుకో!" అనే చోట 'ప్రతికళా' అనే చోట 'వ్రతకళా' అని ఉండడం సమంజసమనే అభిప్రాయంతో ఏకీభవించారు. మార్పులు చిన్నవె అయినా వీటివల్ల తెలిసే విషయాలు అమూల్యమైనవి

శ్రీ కోదండ రామయ్యగారు సునిశిత దృష్టితో చేస్తున్న పరిశోధన అమూల్యమైనది. వారి రాయలవారిని గూర్చి వ్రాసిన చరిత్ర గ్రంథం ప్రకటితమైతే ఎన్నో నూతనాంశాలు తెలియగలవని భావిస్తున్నాను తమిళనాడులోని సరిహద్దు జిల్లా ధర్మపురి పరిసరాల్లో ఆంధ్ర సంస్కృతికి వీరు చేస్తున్న కృషి మిక్కిలి ప్రశంసించదగినది.

"ఆంగీరస"

# కొరవి గోపరాజు - సాహిత్య విశ్లేషణ

[డాక్టర్ అను మాండ్ల భూమయ్య పుటలు 115 వెల రూ 12/- ప్రతులకు శ్రీమతి ఏ. లక్ష్మి, ఇ, నెం. 5-8-56,లష్కర్ బజార్, హన్మకొండ 506001, బాలా బుక్ డిపో, స్టేషన్‌రోడ్, వరంగల్-2, ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాద్-4]

విశ్వవిద్యాలయాల్లో ఎం ఫిల్, లాంటి పట్టాలవల్ల పూర్వం కన్నా మిన్నగా పరిశోధన జరుగుతున్నదనే చెప్పాలి ఈ అంశంలో తెలుగు పరిశోధకులు కూడా ముందంజ వేయడం ముదావహం,అందుకే నన్నయనాటి నుంచి నేటిదాకా ఎన్నో విషయాలపై సమగ్రంగా పరిశోధన మొదలయింది. ఎం ఫిల్ పట్టాకోసం సమర్పించబడ్డ ఈ గ్రంథం అలాంటికోవకు చెందిందే

నాయని సుబ్బారావుగారి కవిత్వంపై సమగ్రంగా పరిశోధించిన భూమయ్యగారి ప్రథమ ప్రయత్నఫలం ఇది 'సింహాసనద్వాత్రింశిక'ను రచించిన కొరవి గోపరాజుపై పరిశోధన వాస్తవానికి ఒక పి. హెచ్. డి. కి తగిన అంశం కాని ఈ రచయిత కొండనుఅద్దంలో చూపించినట్లు గోపరాజు సాహిత్య విశ్లేషణచేసి చాలవరకు కృతకృత్యులయారు ఇందులో అవతారిక, తెలుగులో కథాకావ్యం, అనువాద విధానం, కథానిర్మాణ మార్మికత, వర్ణనా నిపుణత, అంగాంగి రస వివేకం, కవితా విశ్లేషణ, గోపరాజు హరిహరనాథుడు అనే ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి.

నిజామాబాద్ జిల్లాలో ఆర్మూర్ తాలూకాలో ఉన్న నేటి భీముగల్లే గోపరాజు తనజన్మస్థలంగా చెప్పుకున్న వేముగల్లనీ, 1410-1480 మధ్యకాలంలో ఆయన ఉన్నాడనీ ఈ పరిశోధకుడు సోపపత్తికంగా నిరూపించాడు.

అనువాద విధానం గూర్చి విశ్లేషిస్తూ మూలమైన సంస్కృత విక్రమార్క చరిత్రను ఆధారంగా చేసుకొని గోపరాజు చేసిన మార్పులను వివరించారు అమూల్యమైన కథలు, పెంచిన విషయాలు, కుదించినవి పూర్తిగా వదలినవి కల్పించినభావాలు, వర్ణనలు, అన్యథాకల్పనలు, ఆలంకారాలు, యథాతథానువాదాలు, నామకరణాలు అనేభాగాలుచేసి సోదాహరణంగా తెల్పారు.

అలాగే తపోవీరాది ఇరవై వీరరస భేదాలలో గోపరాజు చూపిన ప్రతిభను పేర్కొన్నారు, రచించిన నీతిపద్యాల మొదళ్లనూ, లోకోక్తులనూ ఉటంకించారు మొదట శివభక్తుడుగా ఉన్నకవి తరువాత హరిహరనాథుణ్ణి కొలిచినాడనిచెప్పి గోపరాజుచేసిన హరిహరనాథస్తుతి ప్రక్షిప్తమన్న గుంటూరు శేషేంద్రశర్మగారి వాదాన్ని ఖండించారు.

అయితే ఈచివరి అధ్యాయం కూడా అవతారికలోనే చేర్చితే సరిపోయేది పూర్వాంధ్రకవుల్లో తిక్కనాది అయిదుగురు హరిహరనాథభక్తులలో గోపరాజు ఒకడని అర్థాంతరంగా ముగించేకన్నా సాహిత్య విశ్లేషణను మరికొన్ని ఉదాహరణలతో వివర చేర్చినట్లయితే ఈ పరిశోధన ఇంకా సమగ్రంగా ఉండేది రాబోయే తరాలవారికి ఒక పరిశీలన గ్రంథంగా తోడ్పడేది.

ఏమయినా భూమయ్యగారి కృషి మెచ్చతగింది. డా॥ సుప్రసన్నగారి 'ముందుమాట' ఈగ్రంథానికి ఒక హైలైట్.

# చేత వెన్న ముద్ద

[ వాకాటిపాండు రంగరావ్ వ్యాస సంకలనం పుటలు 156 వెల రూ. 10/- ప్రతులకు నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-2 ]

ఈ వ్యాసకర్త పత్రికారచయితగా, కథారచయితగా చేయి తిరిగిన అనువాదకుడిగా, కార్యనిర్వాహకుడిగా సాహిత్యలోకానికి చిరపరచితులు.

ఈ వ్యాససంకలనంలో రెండుభాగాలు. పాబ్లోనెరూదా, చార్లీ చాప్లిన్, ఛూయిపాశ్చర్, స్టీపెన్‌స్పెండర్, హెన్రీమిల్లర్, అబ్రహాం లింకన్, మాక్స్‌ములర్, బెంజమిన్‌ఫ్రాంక్లిన్, లుడ్విగ్‌వాన్‌బాతోవెన్ ఆల్బర్ట్ ష్వెయిట్జర్ షెగువారా, మార్టిన్‌లూథర్‌కింగ్, ఇర్వింగ్‌వాలస్ జీవితానుభవాలను గూర్చి మొదటిభాగంలో వివరింపబడింది. ఇవన్నీ పూర్వం 'జ్యోతి' మాసపత్రికలో (1980-82) ప్రచురితాలే!

పాబ్లోనేరూదా కవి దార్లీచాప్లిన్ జీవితం అద్వైతత త్త్వాని ఒక చక్కని ప్రదర్శనం లూయీపాశ్చర్ గొప్పశాస్త్రవేత్త కవి గూర్చి కవితనుగూర్చి వ్యాఖ్యానించినవాడు స్టీఫెన్‌స్పెండర్, అలా శైలిని గూర్చి విశ్లేషించినవాడు హెన్రీమిల్లర్ అదేవిధంగా ఒక్కొక్క జీవితాన్ని ఒక్కొక్క దృక్కోణం నుంచి పరిశీలించి ఆసక్తి దాద కంగా పాఠకుడికి అందించారు పాండురంగారావుగారు ఒక్కొక్క మహావ్యక్తిజీవితం అనుభవం ఒక్కొక్క విధంగా మనకు ఆదర వంతంగా, మార్గదర్శకంగా ఉంటుంది.

ఉదాహరణకు 'మూర్ఖత్వం, అహం, అబద్ధం ఈమూటి క యికే సంఘం......కాని దురదృష్టం ఏమిటంటే సంఘం జీవితాన్ని నమిలిమిగుతుంది (పు 33) అన్న మాక్స్‌ముల్లర్ మాటలలో ఎంతో అనుభవం రంగరించ బడింది మన ఆలోచనలంత ఎత్తుకు మ జీవితం ఎదగాలి లేకపోతే మన జీవితాల స్థాయికి మన ఆలోచన దిగజారతాయి (పు 55) అన్న ష్వెయిట్జర్ ఉపదేశం సర్వదా అను సరణీయం

ఈ విధంగా టూకీగా ఒక్కొక్కరి జీవితంలోని ముఖ్య వి యాలను క్రోడీకరించి చెప్పారు ఈ రచయిత.

ఇక రెండోభాగంలో 1968-78 మధ్యకాలంలో ఆంధ్రజ్యో "యమునాతీరే" "చిత్తగించండి" అనే శీర్షికలక్రింద ప్రచురితమై వ్యాసాలున్నాయి. వీటిలో కొన్నిరిపోర్టులు మరి కొన్ని హృదయ స్పందనలు.

ఒక రచయిత జీవించివుండగా అతని కలాన్ని నిరోధించరాద (పుణ్య) అనివాటి చెప్పిన సోల్జెనిత్సిన్ స్వేచ్ఛాప్రకృతి, గొప్పసంగీ జ్ఞుడయిన చిట్టిబాబు ప్రతిభ ప్రఖ్యాతచిత్రకారుడు ఎం. ఎఫ్ హుసేన్ కళానైపుణ్యం, ప్రపంచం సీతారాం వేణుగాన వైశారద్యం, కొడవ గంటి, మొక్కపాటి, పాలగుమ్మి, రాచకొండ, గజ్జెలమల్లారెడ్డి మొదలై వారి రచనా విశేషాలు క్లుప్తంగా వివరించ బడ్డయి అంతేకా సినిమానటి శారద, గాయని సుశీల గూర్చి కూడా రిపోర్టుల్లా చెప్పా రచయిత నెహ్రూ, జాకీర్‌హుస్సేన్, చలం, బాలగంగాధరతిలక్ ల మ ణాలను గూర్చి పొందిన బాధను వ్యక్తీకరించాడు చివరగా ఉన్న ఆంగ్లవ్యాసం సరస్వతీపుత్ర శ్రీనూన్ పుట్టపర్తినారాయణచార్యు ఆనేది రచయిత విమర్శనాథో అరజిని ఆంగ్లభాషా సామర్థ్యాన్ని ప చూపుతాయి కొత్త ఢిల్లీలో శ్రీశ్రీ షష్టిపూర్తి మొదలైనవి రచయిత ఆనాడు పత్రికకోసం రచించిన రిపోర్టులు

రెండో భాగాన్ని బట్టి పుస్తకం పేరు ఉంచినా మొదటిభాగం లోని వ్యాసాలే మంచి 'ఇన్‌ఫర్‌మేటివ్' గా పాఠకులకు ఉపయోగ పరంగా ఉన్నాయనిపిస్తుంది. పాఠకుడిచే ప్రతి పేజీ చదివించ గల సామర్ధ్యం వాకాటి వారికి ఉన్న దనడానికి ఈ సంకలనం ఒక ప్రబల నిదర్శనం

# సామెత

[సి. వేదవతి. పుటలు 268 వెల రూ. 15/- ప్రతులకు శ్రీమతి సి. వేదవతి గోకుల్, 45, యల్. ఐ. సి. కాలనీ, మెహిదీ పట్నం, హైదరాబాద్-500 028. స్పందన సాహితీ సమాఖ్య, 26-162, బుట్టాయి పేట, మచిలీపట్నం-521 001 ]

నేటి పరిస్థితుల్లో రచన చేయడం ఒక ఎత్తు. అయితే వాటిని ప్రచురించు కోవడం, విక్రయించు కోవడం ఒక బ్రహ్మ ప్రళయం. ఈ గడ్డు సమస్యను ప్రభుత్వం వారికన్నా కొన్ని సాహిత్య సంస్థలు బాగా పరిష్కరిస్తున్నాయనే చెప్పాలి. అలాంటి ప్రముఖ సాహిత్య పోషకులలో స్పందన సాహితీ సమాఖ్య మచిలీపట్నంవారు ఒకరు. ఈ గ్రంథం, వారి 37వ ప్రచురణ కావడమే దానికి ఒక ప్రబల నిదర్శనము. ఈ సంస్థకు ప్రధాన కార్యదర్శిగా గుత్తికొండ సుబ్బారావుగారు చేస్తున్న కృషి ప్రశంసనీయం.

తెలుగు తనాన్ని, జాతి సంప్రదాయ సంస్కృతులనూ ప్రకటించేవి సామెతలు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 'తెలుగు సామెతలు' అనే పేరన ఒక గ్రంథం ప్రచురించారు అలాగే 'నుడి-నానుడి' అనే పుస్తకంలో తిరుమల రామచంద్రగారు ఎన్నో విశేషాలు ప్రకటించారు ఈ మధ్య రాయలసీమ ప్రాంతానికి చెందిన నుడి కారాన్ని పరిశోధకులు గ్రంధస్థం చేయడం కూడా జరిగింది.

ఇప్పుడీ పుస్తకంలో శ్రీమతి వేదవతిగారు సామెత స్వభావాన్ని వివరించడమేకాక స్త్రీ, పెళ్లి, అల్లుడు, అత్తా-కోడలూ, భర్త, పిల్లలు చుట్టాలు ధనం, ఆకలి-ఆహారం రోగాలు వైద్యాలు, మరణం, కర్మ-విధి, దేవుడు-పూజలు అనే విభాగాలుగా సామెతలను వర్గీకరించి వాటి పుట్టు పూర్వోత్తరాలను వ్యాఖ్యానించారు.

ప్రతి విభాగానికీ కొంత ఉపోద్ఘాతమూ, ప్రతి సామెతకు ఒక క్రమ పరిణామమూ కూరుస్తూ రచయిత్రి చేసిన కృషి ఎంతో ఆహ్లాద కరంగా ఉంది. శైలికూడా అందరికీ అందుబాటులో ఉండేటట్లు ఏ విభాగం చూచినా ఒక సమగ్ర దృష్టితో నిర్వహించబడింది.

అయితే రచయిత్రి ఎన్నుకున్న విభాగాలూ, అందులో స్త్రీ అనే విభాగం ముందు పేర్కొనడమూ గమనిస్తే కుటుంబ వ్యవస్థలో, సమాజం నడవడిలో స్త్రీకున్న స్థానాన్ని నొక్కి చెప్పడమే ముఖ్య లక్ష్యంగా కానవస్తుంది. ఆ లక్ష్యసిద్ధి కోసం పురుష జాతినీ, సమాజ సంకుచిత తత్త్వాన్నీ వీలయిన చోటల్లా విమర్శించారు రచయిత్రి. అయితే ఆధునిక అనుశీలనా దృక్పథంలో విమర్శకు పూనుకున్న వేదవతిగారు 'పండుగ నాడూ పాత మొగుడేనా?' (పు. 62) 'రాజును చూచిన కళ్లతో మొగుణ్ణి చూస్తే మొత్త బుద్ధయిందట!' (పు. 63) మాటలలోపడి మగనిని మరచినట్లు, చద్దికూడు తిన్నమ్మకు మగని ఆకలి ఎరుగదు (పు. 64), వృద్ధనారి పతివ్రత (పు. 65) లాంటి సామెతలను పూర్వ గాథలను వదిలి వేయడమో లేక వ్యాఖ్యలను స్త్రీరంగా మార్చి చెప్పడమో ఈ గ్రంథ రచనలో అనుసరించిన విధానంగా గమనార్హం ఇది ఒక రకంగా స్త్రీ జాతిని సమర్థించడమే!

సందర్భాను సారంగా వేమన, సుమతీ శతకాదులనూ, జానపద సాహిత్యాన్ని ఆఖరికి ఎంకి పాటలను ఉదాహరించడం, పూర్వాంధ్ర సాహిత్యాన్ని విమర్శ దృష్టితో ఉటంకించడం రచయిత్రి పాండితీ ప్రకర్షకు ఒక గీటురాయి. 'చీరకట్టు' (పు. 50) మొదలైన వాటిపై వారిచ్చిన వ్యాఖ్యలు హృద్యాలు

'చిత్తి దేవుని మీద-భక్తి చెప్పుల మీద' చిత్తం చెప్పుల మీద-ధ్యానం దేవుని మీద, (పు. 262) లాంటి సామెతలకు లోకంలో ప్రచారమయిన "చిత్తం శివుని మీద-భక్తి చెప్పుల మీద" లాంటి వాటిని కూడా అధస్సూచికల్లో పేర్కొని ఉంటే బాగుండేది ఏమైనా 'సామెత'ల అమె తలమీద ఇంతవరకూ వచ్చిన పుస్తకాలకన్నా ఇది ఒక మెట్టుపైనే ఉన్నట్లుగా చెప్పాలి.

దీనికి డాక్టర్ సంజీవదేవ్‌గారి 'వీక్షణ' తీర్చిదిద్దిన ఒక గేట్ వే!

# చెల్లపిళ్లరాయ చరిత్రము

(బీబీ నాంచారు కల్యాణ గాథ)

[తాళ్లపాక అన్నయ్య. పరిష్కర్త ఆశావాది ప్రకాశరావు. పుటలు 96. వెల రు 15/- ప్రతులకు పరిష్కర్త, ఆంధ్రోప న్యాసకులు, ప్రభుత్వ కళాశాల, గుంతకల్లు - 515 801]

వేంకటేశ్వరస్వామి భక్తవరులలో తాళ్లపాకవారు ప్రసిద్ధులు. 1492 ప్రాంతానపుట్టిన ఈగ్రంథకర్తకూడా ఆ ఇంటి పేరటివాడే! వీరి అందరకూ మూలపురుషుడుగా ప్రసిద్ధి కెక్కినవాడు అన్నమాచార్యుడు (1424).

ఈ చెల్లపిళ్లరాయచరిత్రను పరిష్కరించి, పీఠికలో ప్రచురించిన ఆశావాది ప్రకాశరావుగారు ప్రశంసనీయులు. కాలాదులనుగూర్చి,

కథాసంగ్రహాన్ని గూర్చి, కవితాగుణాలనుగూర్చి ఆయన తెలిపిన విషయాలు వారి పరిశోధన సామర్థ్యాన్నిపట్టి చూపుతున్నాయి అష్టావధాని అయినవీరు గ్రంథంలోని అక్షరస్థాలిత్యాలను సందర్భాను సారంగా పూరించి తమ కవిత్వతత్త్వాన్ని ప్రకటించుకున్నారు. వాటిని క్రీగీతలతో స్పష్టంగా చూపించడం వారి నిజాయితీకి ఒక నిదర్శనం.

అయితే ' శోషిల్లనట్టి వాక్శుద్ధి ' ' పుంఖాను పుంఖముల్ పుణ్య లోకములు ' (పు 17) లాంటి పూరింపులు కొంచెం ఎబ్బెట్టుగా, వింత ప్రయోగాలుగాతోస్తాయి.

ఈ గ్రంథంలో 'తిరుపగూడ' 'తిరుపగూడు' (పు. 12) ఇత్యాది కొన్నిపదాలు వివరణను కోరుతున్నాయి. వాటిని అధస్సూచికలలో ఇస్తేబాగుండేది. అలాగే 'ప్రసన్నపాగలసొంపు' (పు. 12) ఉద్యోగించి (పు 14) లాంటి పదబంధాలు కూడా పీఠికలో తెల్పవలసిన విశేషాలు దాదాపు ఇరవై ఛందస్సులలో రచించిన ఈగ్రంథం దేశీవాఙ్మయంలో ఒక ప్రముఖస్థానాన్ని కల్గిఉన్నదనడంలో సందేహంలేదు ఈ కథ ఒక విధంగా హిందూమహమ్మదీయ సఖ్యాన్ని అపేక్షిస్తున్న విషయం గమనించాలి

అయితే తిరుమల తిరుపతి దేవస్థానంవారూ, కొందరు మిత్రులూ చేసిన ఆర్థికసహాయంతో ముద్రించిన ఈ యక్షగానంవెల అందరికీ అందుబాటులో లేకపోవడం ఆశ్చర్యమనిపిస్తుంది

## నవవిం (సాహిత్యవ్యాస సంకలనం)

[ముదిగొండ ఈశ్వరచరణ్ పుటలు 88. వెల రూ. 6/-. ప్రాప్తిస్థానం కిరణ్ ప్రింటర్స్, సిద్ధిపేట-502103 ]

సాహితీ వికాసమండలి, సిద్ధిపేటవారు ప్రచురించిన ఈ సంకలనంలో తొమ్మిది వ్యాసాలు ఉన్నాయి తిక్కనగారి 'ఉభయ కావ్యప్రౌఢి' హంస వింశతి-వర్ణనావైచిత్రి, వడి-వివేచన, ప్రథమాంధ్ర విప్లవకవి పాల్కురికిసోమన్న, అదిలాబాద్ మాండలికాలు, అదిలాబాద్ జానపదసాహిత్యం, బసవన్నతత్త్వం, ఆదిలాబాద్ జానపదకవి మునిపంతులు, అదిలాబాద్ గ్రామనామాలు అనేశీర్షికలలో ఉన్న వీటన్నింటిలో "ప్రథమాంధ్ర విప్లవకవి-పాల్కురికిసోమన్న" అనేది అత్యుత్తమంగా అనిపిస్తుంది వ్యాసకర్తశైలీ, విమర్శనాధోరణికి ఇది అద్దం పడుతుంది దాని తరువాత పేర్కొనతగింది బసవన్నతత్వం.

ఇక తిక్కనగారి ఉభయకావ్యాలు ఉభయభాషాకావ్యాలు కావని అవిదృశ్యశ్లేషవ్యాలని పేర్కొన్న ఈశ్వరచరణ్ గారి మాటలు ఆలోచనాత్మకంగాఉన్నా ఎందరు పరిశోధకులు ఒప్పుకుంటారోచెప్పడం కష్టం అలాగే 'హంసవింశతి' లోని వర్ణనావైచిత్రికి వ్యాసకర్తపెట్టు కున్నపరిధిసరిపోదు 'వడి'ని గూర్చి వివేచన చేస్తూ తాళ్లపడివేయడ అంటే సారూప్యం, సాజాత్యం కల వేరు వేరు పదార్థాలను ఒకదానితో నొకటి మెలివేసి ఏ కత్వాభాసను కల్పించడం' అని వ్యాఖ్యానించార ఇది కూడా మరో అభిప్రాయంగా మాత్రమే గ్రహించాలి కాని ఇదే దాని అర్థం అనలేము అప్పకవి మొదలైన ఛందో విమర్శకులు ఎన్నో విధాల 'వడి'ని పేర్కొన్నారు. అంతెందుకు? డా॥ కోవెల సంపత్కుమారాచార్య 'పాదాద్యక్షరమేవడి' అంటున్నారు 'ప్రస్తావన'లో

అదిలాబాద్ మాండలికాలూ - గ్రామనామాలు అనే రెండు వ్యాసాలు భాషా సంబంధంగా ఉత్సుకతను రేకెత్తిస్తాయి అలాగే 'అదిలాబాద్ జానపద సాహిత్యం' అనేది వ్యాసకర్త పరిశీలనా శక్తిని ప్రకటిస్తుంది. ఇది పరిశోధకులకు ఒక చక్కని అంశం.

ఈ విధంగా భాషకు, భావానికీ సంబంధించిన ఈ వ్యాస సంకలనం సాహిత్య పరిచయం కోసం తప్పక చదవ తగింది.

ఈశ్వర చరణ్ గారు ఇంకా ఎన్నో పరిశోధనా సంబంధమైన వ్యాసాలు వ్రాస్తారని ఆశిస్తాను

## వాఙ్మయ లహరి

[ద్వా నా శాస్త్రి పుటలు 108 వెల రూ 8/- ప్రతులకు విజయ సాహితి (రిజిష్టర్డ్) 29-36-12, మ్యూజియం రోడ్డు, విజయవాడ-520 002 డి శశికాంత్, కేర్ గుళ్లపల్లి సత్యనారాయణ, భూపయ్య అగ్రహారం, అమలాపురం-533 203 ]

నేటి యువ విమర్శకులలో "కాదేదీ విమర్శ కనర్హం" అనే రీతిగా విభిన్న దృక్కోణాల నుంచి పరిశీలించి సాహిత్య లోకంపై పుంఖాను పుంఖంగా విమర్శల అమ్ములను ప్రయోగిస్తున్న వ్యాసులు శ్రీ ద్వా నా. శాస్త్రి (ద్వాదశి నాగేశ్వర శాస్త్రి) వీరు వచన కవితా వాల్మీకులు కూడా.

ఈ సంకలనంలో మొత్తం పదిహేడు వ్యాసాలున్నాయి స్థూలంగా వీటిని కవిత్వం, భాష, విమర్శ అనే మూడు భాగాలు చేయవచ్చు. కవిత్వము-అన్యాపదేశము, చిలకమర్తివారి పద్యాలు, తిలక్ కవితాతత్త్వం, సాహిత్యంలో సంగీత ప్రస్తావనలు, కవిత్వంలో మానవీకరణ, కవిత్వము-వ్యక్తి నిష్ఠత, చిలకమర్తివారి విశిష్ట వ్యక్తిత్వం, కాదేదీ కవిత కనర్హం, యథార్థ గాథకు కావ్యరూపం 'స్నేహలత', ప్రభువులపై ధ్వజమెత్తిన పద్య కవులు ఇత్యాదులు కవిత్వ సంబంధమైనవి ఆంగ్ల భాష ఒక పరిశీలన, తెలుగులో ధ్వన్యనుకరణ శబ్దాలు, రూపసామ్యం, వాడుకభాష -కొన్ని విశేషాలు

అనేవి భాషా సంబంధమైనవి నేటి విమర్శలు సాహిత్యానికి మేలు చేస్తున్నాయా? లాంటివి విమర్శకు చెందినాయి. అందరూ చదవ తగిన వ్యాస సంకలనం ఇది

ఎక్కడో మూలన పడిన విషయాలను కొత్తగా అలంకరించి పత్రికా ముకురంలో చూపించడం, అదీ విసుగు కలిగించని విధంగా, భిన్నమైన రుచులలో అందించడం ఈ వ్యాసాలలో ఒక సాధారణ లక్షణం. ఈ వ్యాసకర్తకు భాషా శాస్త్రంలో మంచి చొరవ ఉన్నట్లు కానవస్తుంది.

చిలకమర్తివారిపై ఉన్న రెండు వ్యాసాలూ శాస్త్రిగారి పరిశోధనా ప్రతిభను వెల్లడిస్తున్నాయి. కవిత్వము-అన్యాపదేశము సాహిత్యంలో సంగీత ప్రస్తాపనలు, కవిత్వంలో మానవీకరణ ఇత్యాదులు వీరి పూర్వ కావ్య పరిచయాన్ని ప్రకటిస్తాయి. తిలక్ కవితాతత్త్వం అనేది నిజానికి ఎన్నో ఉదాహరణలతో వ్యాఖ్యానించవలసిన విషయం కాని పైపైన అంగలు వేసుకుంటూ ముందుకు పోవడం శోచనీయం. అలాంటిదే 'కవిత్వము వ్యక్తి నిష్ఠత' అనేది కూడా.

'కవిత్వంలో మానవీకరణ' అనే వ్యాసంలో దువ్వూరి వారినీ, ఆచార్య నారాయణ రెడ్డిగారిని దుయ్యబట్టిన శాస్త్రిగారు ఒక్కసారి మొదటి నుంచీ భావకవుల కావ్యాలు లోతుగా పరిశీలిస్తే ప్రకృతి చిత్రీకరణలో నాటికీ నేటికీ ఎంత భేదం ఉన్నదో అవగతం కాకపోదు

"చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చున్న దానికంటె మనకు చేతనైనంత వరకు ఒక చిన్న దివ్వెనైనా వెలిగించే ప్రయత్నం చేయటం ప్రతి విమర్శకునికి ప్రతి రచయితకు కర్తవ్యం" అన్న డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి ముందు మాటలతో (దివ్వెల తోరణం) ఏకీభవిస్తూ, 'నేటి విమర్శలు సాహిత్యానికి మేలు చేస్తున్నాయా?' అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలని అభ్యర్థిస్తున్నాను.

శ్రీ శివలెంక ప్రకాశరావు

# జ్ఞానదేవుడు

[రచన పి. వై. దేశ్‌పాండే. అనువాదం: ఎన్. గోపి, ప్రచురణ: సాహిత్య అకాడెమీ, రవీంద్ర భవన్, న్యూఢిల్లీ-110001 వెల: రూ 4/-]

మహా జ్ఞాని అయిన జ్ఞానదేవుని జీవితాన్ని, రచనలనూ పరిచయం చేయ ప్రయత్నించే చిన్న పుస్తకం ఇది

మూలం అసమగ్రంగా ఉంది. అనువాదం అస్పష్టంగా ఉంది. "జ్ఞాన దేవుని కృతుల్లో శబ్దం, మౌనం, కాలం, కాలాతీత స్థితి దాగుడు మూతలాడుతున్నట్లుంటాయి..." ఇలా సాగుతుంది రచన.

జ్ఞానదేవుని జీవితాన్ని తెలిపే చారిత్రిక ఆధారాలు లేవు, రచనలున్నాయి కథలున్నాయి. కథల ఆధారంతో జ్ఞానదేవుని జీవితాన్నీ, రచనలనూ వ్యాఖ్యానించారు రచయిత

జ్ఞానదేవుని గూర్చి చెప్పుకొనే కథలు భక్తులకు ఆనందాన్ని కల్గిస్తాయి, దున్నపోతువేత వేదాలు పలికించడం, గోడమీద ప్రయాణం చేయటం వంటి కథలు రసవంతంగా ఉంటాయి. ఆ కథలన్నిటినీ వరుసగా చెప్పుకొంటూ పోయినా ఈ పుస్తకం రసవంతంగా ఉండి పాఠకులకు ఆసక్తి రేకెత్తించి ఉండేది శీర్షికలే విసుగు పుట్టించేవిగా ఉన్నాయి. కాలాతీత వైచిత్రి, పరదేశి, అపహామూ-ఆనందము, జ్ఞానేశ్వరి, గీతాజ్ఞానం, నిత్యానుభవం మనిషి-అనుభవం-వాస్తవం. శబ్దం, అవిద్య, జ్ఞానం-అజ్ఞానం-వాస్తవం యోగం-భక్తి-వాస్తవం, జీవితం-మృత్యువు అమృతత్వం - ఇవి శీర్షికలు.

శ్రీ పులిచెర్ల సాంబశివరావు

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3. Editor: S Radhakrishna, Vijayawada Phones: 75667 & 61247